

# సత్యానుభూతి

(1) నియామక దర్శనము (నియామకుడు) (2) తత్త్వదర్శనము (3) అనుష్ఠానదర్శనము (4) అనుభూతి దర్శనము (సహజనిష్ఠా ప్రబుద్ధగీతలు) (5) పరమార్థదర్శనము (6) అంతర్దృష్టి లేక సత్యపథము అను ఆరు గ్రంథముల సంపుటము)

**శ్రీరామకృష్ణ సోదరుడగు శ్రీనివాసునిచే**
**రచింపబడినది**

 **మూల్యము రు 18-00**

# విజ్ఞప్తి

తొలిసారి సంపుటములో లేనివి కొన్ని మార్పులు, చేర్పులు రెండవసారి సంపుటములో చేయబడినవి.

(1) తత్త్వదర్శనమునందలి ప్రథమ భాగము (2) ఆచార్య గురుధ్యానములు, (3) ఇష్టదేవతా ధ్యానములు, (4) అధికార నిర్ణయము చేర్చబడినవి.

నియామకుడు గ్రంథముయొక్క ఉపోద్ఘాతము తొలగింపబడినది మరికొన్ని చిన్నచిన్న మార్పులు చేయబడినవి. మూడవ సారి చేయబడిన యీ సంపుటములో నియామకుడను గ్రంథమునకు నియామకదర్శనమనియు సహజనిష్ఠాప్రబుద్ధగీతలకు అనుభూతిదర్శనమనియు పేరు మార్చబడినది.

(1) అనుష్ఠానదర్శనము (2) పరమార్థదర్శనము అను రెండు గ్రంథములు క్రొత్తగ చేర్చబడినవి.

పాఠకులీవిషయమును గుర్తింతురుగాక.

ప్రకాశకులు

ఓం

# గ్రంథ ముద్రణ కర్తృవిషయః



శ్లో॥ తీరే పెన్నాఖ్య నద్యాః
పురహరనిలయే మౌని సంచార దేశే
సాధూనామానుకూల్యే
స్థల జల పవనాహ్లాదపూర్ణే పవితే
పాళెం నామ్నా ప్రసిద్ధే
హరిహరవసతే ర్మానివర్తే స్సమీపే
గ్రామే సౌభాగ్యయుక్తే
ప్రవిమలగుణతో యాభిషిక్తాత్మవాక్కః।

,, శ్రీమత్ కొండూరు వంశాన్వయ హిమకిరణః
సాధులోకోపకారీ
శ్రీ వెంకటరెడ్డి నామా
బుధనుతరమణాఖ్యస్య సూనుర్వివేకీ
వేదాంతార్థాభిలాషీ
చలిత భవభయో గ్రంథమేనం విలోక్య
కృత్వా తన్ముద్రణాం సః
ప్రముదితమనసా సాధులోకాయ ప్రాదాత్ ॥

# తొలిపలుకు



ఈసంపుటమున నున్న యైదుగ్రంథములును ఒండొకటి నతిక్రమించుచు, వేదప్రామాణ్యమును వేదాంతార్థమును ప్రతిపాదించుచున్నవి. వీనిలో "తత్త్వదర్శన" మను రెండవ దానిని పరికించి దాని కీవలకే నేను పరిచయవాక్యములు వ్రాసియున్నాను. ఇప్పు డుపలబ్ధములైన తక్కు నాల్గింటిలో మొదటిదగు 'నియామకుఁడు' అనుదానిలో గ్రంథకర్త జగత్కారణమును విచారించి జన్మ, కర్మ, రూపమగు సకల సంసారమును నియమించు పరమేశ్వరుఁ డొకఁడు కలఁడని, సమర్థముగా సిద్ధాంతీకరించి యున్నాఁడు. మూఁడవది యైన 'సహజనిష్ఠ' శ్రీరమణభగవానుని 'యుపదేశసారమును' అనుకరించునదియై దృశ్యమును వీడి తాను దృక్ (=చిత్) మాత్రముగా నిలుచుటకు సాధనక్రమమును ఉపపాదించుచున్నది. నాల్గవదియగు 'ప్రబుద్ధగీత'లో గ్రంథకర్త తానెట్లెట్లు పరమార్థము, ననుభవమునకుఁ దెచ్చుకొన్నదియు వాక్రుచ్చి యున్నాఁడు. ఇది ముముక్షువులు తప్పక చదివి యాయాయి యంశముల, హేయోపాదేయముల, నట్లట్లు నిరంతరము తమజీవితమున నన్వయము చేసికోఁ దగినది.

అంతర్దృష్టి. ఇందు రచయిత చూపినవివేకము కొని
గినది. అంతర్దృష్టిచే, నేకైకసత్యమును సాక్షాత్క
న్న ఋషులవాక్యములు కేవలబాహ్యదృష్టికల
వులకు అవబోధమునకు రావని వారు నిపుణముగా
చియున్నారు. ఏతర్కమైనను (Reason) తర్కించు
నుభూతిమీఁదఁగదా ఆధారపడి యుండును. వ్యక్తుల
ములు పరిమితములు, భిన్నములు కావున, వారి తర్క
 తత్ఫలితములును వేర్వేఱుగా నుండక తప్పదు. ఇట్టి
భవముగల బహిర్ముఖులు అఖండమును ప్రత్యక్షీక
న నేరనందున వారి కేకత్వ మేనాఁటికిం గుదుర
తారు పరమప్రమాణముగా విశ్వసించు తర్కము చేతి నే
చున్నది. ఏకవిజ్ఞాన, హేతువైన అతీంద్రియదృష్టి
మకొను నధికారము లేక తమయల్పబుద్ధిపై, బహిర్దృష్టిపై
రపడి ప్రాకృతులు వేదాంత సిద్ధాంతముల విమర్శిం
అంధుఁడు సేయు సౌందర్యవిమర్శ వంటిదని గ్రంథకర్త
ఁగా వ్యక్తము చేసియున్నాఁడు. శాస్త్రప్రమాణము
చి తర్కమునకే పట్టాభిషేకము సేయ దేశహితైషుల
నువారు కంకణము కట్టుకొనియున్న యీ సమయ
ఈబోధ యెంతయు సమంజసమును, అవసరమును.

ంత్యాః ఖలు యే భావాః, న తాం స్తర్కేణ యోజయేత్
కృతిభ్యః పరం యచ్చ, తదచింత్యస్య లక్షణమ్॥

అను సత్యమును ఇదానీంతన హేతువాదులు ఎంత త్వరగా గ్రహించిన దేశమునకంత శ్రేయము.

2. ఈ గ్రంథము లన్నియు తత్కర్తగావించిన శ్రవణ మనన నిదిధ్యాసములకు నిజమైన నిదర్శనములుగా నున్నవి. వీని నన్నింటిఁ జేర్చి శ్రద్ధతో ముద్రింపించి ఆస్తికుల హస్తముల నలంకరింపఁ జేయ దీక్షకొన్న సాధుప్రియులు శ్రీ కొండూరు వెంకటరెడ్డిగారి యుద్యమ మెంతయు శ్లాఘ్యము. భగవానుఁడు వారి కాయురారోగ్య మహైశ్వర్యములు ప్రసాదించుఁ గావుత మని వేఁడుచున్నాను.

విజయదశమి
20-10-1950
నెల్లూరు

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ

# విజ్ఞప్తి



ఏతద్గ్రంథకర్తయు, నాకు గురువులును, అగు బ్రహ్మ శ్రీ పాటూరు శ్రీనివాసయ్యగారు నాకు 1941-వ సంవత్సరమున పరిచితులైరి. వీరు మా గ్రామమునకు వచ్చినపిదప అచిర కాలములోనే వీరి వైరాగ్య శమదమాదిగుణములును, అహింసాఽస్తేయాపరిగ్రహములును గ్రామస్థులందఱి హృదయములను ఆకర్షించినవి. అటువలెనే, వీరి యాధ్యాత్మికశక్తి గూడ నన్నాకర్షించి వీరితోడి పరిచయభాగ్యమబ్బునట్లుచేసినది, అదిమొదలు నాకుఁ గల ఆధ్యాత్మిక సంశయములను; వారి అనుభవములతోను, చిన్న చిన్న ఉపమానములతోను, తీర్చి వారు నాకు అధ్యాత్మికచింత యందు ప్రీతిని అంకురింపఁజేసిరి. ఇట్లుండ ఒకదినము ప్రస్తావ వశమున, వారిచే రచింపఁబడిన గ్రంథములు కొన్ని గలవను విషయము నాకు తెల్లమయ్యెను.

నేనా గ్రంథములను తీసికొని పరిశీలించిన కొలఁదియు, వానిని ముద్రింపించిన, లోకమునకు ఎంతయు మేలౌనగూడు ననుతలంపు నాకు కలిగినది. ఆ విషయమై వారితో ప్రస్తావించితిని. అందులకు వారు తొలుత సమ్మతింపక, ఈ గ్రంథ

లమున నచ్చొత్తింపవలయుననను తలంపు లవమై
ి లేదనియు, హృదయమును విస్మృతినుండి రక్షించు
ఉపయోగపడినఁజాలు ననుతలంపుతో వీని రచన
ిచినాఁడ ననియు, ఈ గ్రంథములన్నియు నాభావము
వ్యక్తమైనఁజాలునను ధోరణిలోనే నడచిన వనియు,
్యాణము నపేక్షించి మహనీయులచే రచింపఁ బడి
రచింపఁబడుచున్నవియు, పాఠకులహృదయము నాక
మమార్గమున నడుపఁగలవియునగు గ్రంథము లసం
లై తనరారుచుండ, నా మట్టుకు నాకే, యను ధోర
ింపఁబడిన యీ గ్రంథము లేమాత్ర మితరుల కుప
లవో చెప్పసాధ్యము కాదనియు, అత్యధిక వ్యయ
ములతో కూడిన యికార్యమునుండి విరమించు
మే మంచిదగునేమో యనియు, వారి నిశ్చితాభి
ు నా కెఱింగించిరి. కాని పలువురకు ఉపయోగ
యీ గ్రంథములు అముద్రితములైయుండుట నాకు
క, యే ఒక్కరికైనను ఉపకరించినచాలు ననివారికి
ారిని అంగీకరింపఁ జేసి యీ ముద్రణమును పూర్తి కా
ఈ గ్రంథములన్నియు అనుభూతిమయములుగను,
ు మొదలు ముముక్షువువఱకును ప్రతియొక్కఁడును
ఁదగిన సత్యాంశముల కూడిక కలవియు, అయి
ఇంతకన్నను ఈ గ్రంథములలోని విషయముల
విమర్శించి చెప్పుటకు నే నెంతవాఁడను? పాఠకలోకమే

యీ గ్రంథములలోని సత్యాంశములను, గ్రహించి నా ప్రయత్నమును సఫలమొనర్చునని విశ్వసించుచున్నాను.

నేనడిగిన వెంటనే తొలుత 'దత్త్వదర్శనము'నకును, నేడు ఈ సంపుటికిని పీఠిక వ్రాసియిచ్చి ఏతత్ప్రకాశనమునకుఁ దోడ్పడిన 'అభినవ తిక్కనే' త్యాది బిరుదాంకితులు శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారికి మత్కృతజ్ఞతాపూర్వక నమస్కృతి శతము లర్పించుచున్నాను.

ముదివర్తిపాళెం
21-10-1950

ఇట్లు,
కొండూరు వెంకటరెడ్డి.

# సత్యానుభూతి

## విషయసూచిక



ఓంతత్సత్

ఓం

ఆచార్యేభ్యోనమః

# ఆచార్యధ్యానమ్

శ్లో॥ సృష్ట్వా పద్మభవం తస్మై వేదాన్ యో ప్రహిణోతి తం।
నారాయణం శరణమహం ప్రపద్యే పురుషోత్తమమ్.

పద్మాసనం పద్మయోనిం వాణీశంచ చతుర్ముఖం
పితరంచ వసిష్ఠస్య నౌమి నారాయణాత్మజమ్.

వసిష్ఠం శిష్టచరితం బ్రహ్మవిద్యా ప్రవర్తకమ్
వాసిష్ఠకృతికర్తారం నౌమి తం బ్రహ్మవంశజమ్.

పుత్రపౌత్రౌ వసిష్ఠస్య ద్వౌ తౌ శక్తిపరాశరౌ
తేజస్వినౌ మహాప్రాజ్ఞౌ నౌమి తాపసపుంగవౌ.

విష్ణోరంశేన సంభూతం వేదశాస్త్రవిభాగినం
బ్రహ్మసూత్రకృతాచార్యం పారాశర్యం నమామ్యహమ్.

మమతాహంకృతేర్ముక్తం నిత్యజ్ఞాన సమాధినం
వ్యాసపుత్రం మహామౌనిం నౌమి తం శుకయోగినమ్.

శుకయోగీంద్రసచ్ఛిష్యం శ్రుతితాత్పర్యవేదినం
గౌడపాదమహం వందే కారికాగ్రంథకారకమ్.

ంచ గౌడపాదస్య శంకరార్యస్య దేశికం
ంగనిష్ఠాగరిష్ఠంతం గోవిందార్యయతిం భజే.

ంపారగమాచార్యం సూత్రతాత్పర్యవేదినం
ష్యకార మహంవందే శంకరార్యం జగద్గురుమ్.

పాదం గిరిం హస్తామలకంచ సురేశ్వరం,
ుకంసద్గురూనన్యాన్ హృదయే సంస్మరామ్యహమ్.

్యాచార్యపదాంభోజ ధ్యాన మజ్ఞాన మోచకం
వాన్ శ్రీనివాసోఽసౌ దశశ్లోకైశ్చ సమ్మితమ్.

ఇత్యాచార్య ధ్యానమ్

శ్రీరామకృష్ణస్య సోదరేణ శ్రీనివాసేన

విరచితమ్



సద్గురుభ్యోనమః

# గురుధ్యానమ్

~~~~~:o:~~~~~

శ్లో॥ శాంత్యాది సద్గుణ నికేతన మాత్మసంస్థమ్
వైరాగ్యఖడ్గ పరిపాలిత చిత్తభూమిమ్
సంసార మోహజలదస్య సమీర మాద్యం
శ్రీ రామకృష్ణగురు మాత్మని సందధేఽహమ్. 1

శమ దమోపరతి తితిక్షా శ్రద్ధా సమాధానములనెడి షడ్గుణములకు నిలయమును, ఆత్మయందు నిలుకడగలవాఁడును, వైరాగ్యమనెడి ఖడ్గము చేత చక్కఁగా పరిపాలింపఁబడిన చిత్తమనెడి భూమిగలవాఁడును, సంసార మోహమనెడి మేఘమునకు వాయుదేవునివంటివాఁడును, ఉత్తముఁడును అగు రామకృష్ణుని (పదములను) నా హృదయమందు చేర్చుచున్నాను.

కోఽహం కుతో హ్యహ ముదేతి విచార్యమాణః
సోఽహం వివేకహృదయేన విసృజ్య మోహమ్
స్వస్మిన్ వసన్ చరతి యో తనుకంచుకేన
శ్రీరామకృష్ణగురు మాత్మని సందధేఽహమ్. 2

నే నెవఁడను? అహంకార మెక్కడ పుట్టుచున్నది? అని విచారించినవాఁడై దేహేంద్రియాతీతమగు చిద్రూప పరమాత్మయే నే ననెడి వివేకజ్ఞానముచేత దేహాదికము నేననెడి, మోహమునువిడచి చిన్మాత్ర స్వరూపమగు తనయందేయున్నవాఁడై శరీరమనెడి కవచమును ధరించి తిరుగుచున్నాఁడో ఆ రామకృష్ణుని (పదములను) నా హృదయమందు చేర్చుచున్నాను.

మౌనం ప్రశాంతహృదయం విజితేంద్రియత్వం
మౌదార్యమాత్మపరతా మృదుళస్వభావం
~~~~~

ర్యం క్షమా చ సమతా త్వనుభాంతి యస్మిన్
)రామకృష్ణగురు మాత్మని సందధేఽహమ్. 3

మును, ప్రశాంతత నొందిన హృదయమును, ఇంద్రియజయమును,
ావమును, ఆత్మపరత్వమును, మెత్తని స్వభావమును, ధైర్యమును,
ప స్తజీవులయందును సమరసభావమును ఎవనియందు ప్రకాశించు
ఆ రామకృష్ణుని (పదములను) నా హృదయమందు చేర్చు

ారబ్ధవాయుచలనా త్తనుకంచుకం తు,
సార క్షేవి చరతా ద్బహుభిః ప్రకారైః
ాన్వై విముక్త మమతాం నపునర్దధార
)రామకృష్ణగురు మాత్మని సందధేఽహమ్. 4

బ్ధమనెడి గాలిచేత శరీరమనెడి కుబుసము సంసారమనెడి ఆకస
ప్రకారముల చలించును గాక! ఎవఁడు విడువఁబడిన మమకార
నిశ్చయముగాఁ బొందఁడో, ఆ రామకృష్ణుని (పదములను) నా
క చేర్చుచున్నాను.

ా వేదమస్తక సుధాబ్ధి నిమజ్జమానః
ర్త్యత్వమోహశమనా దమృతత్వమాప్య
ంతాత్మనా గతభయేన చచార భూమా
)రామకృష్ణగురు మాత్మనిసందధేహమ్. 5

ఁ ఉపనిషత్తులనెడి అమృతసముద్రమున మునిఁగినవాఁడై;
మనొందువాఁడ" ననెడి వ్యామోహము నశించుటవలన మరణ
ొందె, ఏ చిత్తవికారమును లేనివాఁడై సంసారభయములేని
పపంచమున తిరుగాడెనో, ఆ రామకృష్ణుని (పదములను) నా
చేర్చుచున్నాను.

—♦ గురుధ్యానమ్ సమాప్తమ్ ♦—

ఁకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడినది.

ఓం

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

# ఇష్టదేవతా ధ్యానమ్

శ్లో॥ దేహాత్ పూర్వం పరంతద్వాత్ జీవోఽ స్తీతి సనాతనః
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

ఓ రఘువంశశ్రేష్ఠా! శరీరోత్పత్తికి ముందును వెనుకను సనాతనుఁడగు జీవుఁడొకఁడు కలఁడనెడి సత్యముయొక్క అనుభవమును నా హృదయమున స్ఫురింపఁ జేయుము.

కామకర్మావృతో జీవో నయేత్ దేహాంతర స్థితి
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది

ఓ కౌసల్యాతనయా! కామకర్మములచే నావరింపఁబడిన జీవుఁడు దేహాంతరమును బొందునని సత్యముయొక్క అనుభవమును నాహృదయమున స్ఫురింపఁ జేయుము.

జీవస్య సుఖదుఃఖానాం తృష్ణైవేతిహి కారణం
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

ఓ సీతాపతీ! జీవునియొక్క సుఖదుఃఖములకు ఆశయే కారణమనెడి సత్యముయొక్క అనుభవమును నాహృదయమున స్ఫురింపఁ జేయుము.

తృష్ణాది బంధనిర్ముక్తో నిర్లిప్త స్సభవేదితి
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది,

ఓ లక్ష్మణానుజా! తృష్ణాది బంధములనుండి విముక్తిం బొందినవాఁడే నిర్లిప్తుఁడగుచున్నాఁడనెడి సత్యముయొక్క అనుభవమును నా హృదయమున స్ఫురింపఁ జేయుము.

ప్తస్య భవేత్ తృప్తిః నిత్యతృప్తో సుఖీతి

త్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

దశరథనందనా! నిర్లిప్తుఁడగువానికి తృప్తి గలుగుననియును

ప్తుఁడే సుఖియగుననియును వాస్తవికానుభవమును నా హృదయ

రింపఁజేయుము.

స్తి సర్వేశ్వరో హ్యేకో జనానాం హృదయేష్వితి

త్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

రామభద్రా! అందఱి హృదయములయందును, సర్వేశ్వరుఁ

గలఁడనెడి సత్యముయొక్క అనుభవమును నా హృదయమున

జేయుము.

హృదిస్థానే స్థితో దేవో ప్రచోదయతి మామితి

త్యస్యానుభవంరామ! స్ఫురణం కురు మే హృది.

ఆర్తత్రాణ పరాయణా! నా హృదయమందున్న దేవుఁడే నన్ను

ములయందు ప్రేరించుచున్నాఁడనెడి సత్యముయొక్క అనుభవ

హృదయమున స్ఫురింపఁ జేయుము.

యయావృతో జీవస్య తారకో భగవానితి

త్యస్యానుభవంరామ! స్ఫురణం కురు మే హృది.

రావణాంతకా మాయచే నావరింపఁబడియున్న జీవు నుద్ధరించు

గవంతుఁడే యను సత్యముయొక్క అనుభవమును నా హృదయ

ంపఁజేయుము.

జ్ఞానాదేవతుకైవల్య మితి శ్రుత్యాదితక్రమే
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

ఓ పట్టాభిరామా! జ్ఞానముచేతనే మోక్షమని శ్రుతిప్రతిపాదించెడి క్రమమున సత్యముయొక్క అనుభవమును నా హృదయమున స్ఫురింపఁ జేయుము.

ద్రష్టుశ్చాన్య ద్భవేత్ దృశ్యం దృశ్యత్వాత్ ఘటవత్త్వితి
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

ఓ రవివంశతేజా! ఘటద్రష్ట ఘటముకంటె భిన్నమైనట్లు దృశ్యము ద్రష్టకంటెను వేఱనెడి సత్యముయొక్క అనుభవమును నా హృదయమున స్ఫురింపఁజేయుము.

జాగ్రదాద ష్వనుస్యూతో జ్ఞాతైవాఽఽత్మాభవేదితి
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

ఓ రాఘవా! జాగ్రదా ద్యవస్థల మూడింటియందును సమానముగ వ్యాపించియున్న జ్ఞాతయే ఆత్మయనెడి సత్యముయొక్క అనుభవమును నా హృదయమున స్ఫురింపఁజేయుము.

ఇచ్ఛా-జ్ఞానం సుఖం దుఃఖం నేతి ధర్మాశ్చిదాత్మనః
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

ఓ దనుజమర్దనా! ఇచ్ఛా, జ్ఞానము, సుఖము, దుఃఖము అనునివి ఆత్మ ధర్మములు కావనెడి సత్యముయొక్క అనుభవమును నా హృదయమున స్ఫురింపఁజేయుము.

నాహంకర్తా నైవభోక్తా సుఖదుఃఖే నమేత్విత
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

ఓ దయామయా! నేనుకర్తనుగాను నేనుభోక్తనుగాను సుఖ
దుఃఖములు నాకు లేవు అనెడి సత్యముయొక్క అనుభవమును నా హృద
యమున స్ఫురింపఁజేయుము.

నాహం దేహో నచ ప్రాణో నైవాహంకృతి
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

ఓ దాశరథీ! నేను దేహమునుకాను, ప్రాణములుకాను. అహం
కారమునుకాను, బుద్ధికాను అనెడి సత్యముయొక్క అనుభవమును
నా హృదయమున స్ఫురింపఁజేయుము.

జన్మమృత్యు జరారోగాః నమే దేహస్యసన్త్వితి
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

ఓ కోదండపాణీ! జననమరణములు జరారోగములు దేహమునకు
గలవు గాని నాకు లేవనెడి సత్యముయొక్క అనుభవమును నాహృదయ
మున స్ఫురింపఁజేయుము.

తత్త్వమస్యాదిభి ర్వాక్యై రద్వైతం బుధ్యతేత్విత
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

ఓ కాకుత్సకులతిలకా! తత్త్వమస్యాది వాక్యములవలన
అద్వైతమే తెలియఁబడుచున్నదనెడి సత్యముయొక్క అనుభవమును
నా హృదయమున స్ఫురింపఁజేయుము.

జీవేశ్వర జగద్భేదా స్త్వవిద్యాకల్పిత స్త్వితి
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది,

ఓ నీలవర్ణా! జీవేశ్వర జగత్తు లనెడి భేదము అవిద్యాకల్పితమనెడి సత్యముయొక్క అనుభవమును నా హృదయమున స్ఫురింపఁజేయుము.

బ్రహ్మైవాహం నచాన్యోస్మి జన్మమృత్యూ న మేత్వితి
సత్యస్యానుభవం రామ! స్ఫురణం కురు మే హృది.

ఓ రామచంద్రా! నేను బ్రహ్మమును కాని అన్యయమును కాను జనన మరణములు నాకు లేవు. అనెడి సత్యముయొక్క అనుభవమును నా హృదయమున స్ఫురింపఁజేయుము.

శ్రీనివాసకృతం స్తోత్రం రామానుగ్రహసాధనం
యఃపఠేత్సతతం భక్త్యా తత్త్వజ్ఞస్స భవేన్నరః.

శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడిన ఈ స్తోత్రము దశరథరాముని యనుగ్రహమును సంపాదించుకొనుటకు ఒక ఉపకరణమువంటిది. దీనిని భక్తితో పఠించువాఁడు (నిశ్చయముగా) తత్త్వజ్ఞుఁ డగుచున్నాఁడు.

ఇష్టదేవతా ధ్యానమ్

సమాప్తము

ఓం తత్సత్.



# సత్త్వానుభూతి
## అధికారినిర్ణయః



అథ సత్త్వస్థ ముద్దిశ్య
నివృత్తిపథ గామినం
జ్ఞేయార్థం సంప్రవక్ష్యామి
సంపుటేఽస్మిన్ యథామతిః.

నియామకాది భిర్గ్రంథైః
యత్తత్త్వం సంప్రవక్ష్యతే
తదుత్తమ మితి జ్ఞేయం
గుహ్యాత్ గుహ్యాతమంపరం.

రజసాతమసా ముక్తో
సత్త్వస్థో కేవలో బుధః
సాధయేత్స ఇమంతత్త్వం
సోపానక్రమశోఽనిశమ్.

యస్యసత్త్వానుభూతేస్తు
అనుభూతిరర్హ వేద్దృథమ్
చిత్సుఖం నిత్య నిర్దుఃఖం
భవేత్తస్య నసంశయః.

ఓం తత్సత్.

ఓం.

శ్రీ రామాయ నమః

# నియామకుఁడు

---

అస్తీతి సత్యసంకల్పస్స్రష్టాకర్తా నియామకః
చక్షురున్మీలితం యేన తస్మైసద్వ్యాపకేనమః.

చేతనాచేతనాత్మకమగు ఈజగత్సృష్టివైచిత్ర్యము నిత్యమని
ఏలగు విజ్ఞానవంతుల కనుభవసిద్ధమై యున్నది.

ఈ సృష్టియందేది కారణమో ఏది కార్యమో యెవఁడు నిర్ణయింపఁ
?

కారణబీజములనుండి కార్యరూప వృక్షాదికము జనించుచున్నది.
నా కార్యరూప వృక్షాదికమునుండి కారణబీజములు సృజింపఁబడు
బీజములనుండి వృక్షములు జనించుచున్నంగున, బీజములు కార
నియు, వృక్షములు కార్యములనియు, చెప్పవాదమనిన:- వృక్షములు
బీజములు గలుగనందున వృక్షములకు బీజములు కారణములని
కాడదు.

వృక్షములు కారణములనియు, బీజములు కార్యములనియు నంగీక
క :— బీజములు లేక వృక్షాదికము జనించుట లేదు.

ఇక కార్యకారణ నిర్ణయ మెట్లు?

సృష్టియంతయు నీక్రమముననే యున్నది. బీజము వృక్షమును
పచున్నది. ఆ వృక్షము మఱల బీజముల నిర్మించుచున్నది. ఆ బీజ
కాతనసృష్టికి (నూతన వృక్షములకనుట) కారణములగుచున్నవి.

కార్యకారణ నియమ వర్జితమైనను సృష్టి క్రమబద్ధముగనే జరుగుచున్నది. ఏజాతివృక్ష మాజాతి వృక్షముల సృజింపఁగల బీజములనే నిర్మించుచున్నది. అసంఖ్యాకములగు జాతులన్నియు నియమబద్ధములై ఈప్రకారము స్వజాతిని వృద్ధిజేసి కొనుటయందు స్వభావముగఁ బ్రవర్తించుచున్నవి. ఏయొక్కజాతియందును స్వజాతినియామమునకు విరుద్ధమైనట్టియు, నన్యజాతికిఁ గారణమైనట్టియు బీజములు సృజింపఁబడినట్లు గానఁబడదు.

క్రమబద్ధము నచింత్యము నగు ఈసృష్టి స్వభావజనితమా? కర్తృకల్పితమా?

స్వభావజనిత మనిన:— ఈ స్వభావమును దేనికిఁ జెప్పవలయును.

ఉత్పత్తిలయములు దేనియందు జరుగుచున్నవో దానికిఁజెప్పవలయును

సృష్టిలోని పదార్థములన్నియు పాంచభౌతికములై గన్పట్టుచున్నవని, జగత్కారణత్వము భూతములకు నిశ్చయించిన:— సృష్టిస్వభావమున భూతములకే చెప్పవలసివచ్చును.

ప్రపంచమున నుత్పత్తిలయములు రెండును గనఁబడుచున్నందు: ఉత్పత్తి స్వభావకృత మనిన:—లయమును స్వభావకృత మనియే చెప్పవలసివచ్చును.

ఒకటి స్వభావకృత మనియు, రెండవదానికి కర్తగలఁడనియు చెప్పఁగూడదుకదా!

ఒకదానికి కర్త గలఁడనియు, రెండవదానికి మాత్రము లేఁడనియు జెప్పుటకు ప్రమాణమేమి?

ఏప్రమాణమును లేనపుడు ఒకదానికి కర్త గలఁడని అంగీకరించి రెండవదానికి అంగీకరింపఁగూడదను నియమ మేమి గలదు?

దువలన స్వభావవాది ఉత్పత్తికి స్వభావమే కారణ మని అంగీ
లయమునకును స్వభావమే కారణ మని అంగీకరింపవలసి

స్పర విరుద్ధములగు రెండుధర్మములు ఏకవస్తువునందు సంభవింప
ూతములనుండి జగదుత్పత్తి స్వభావకృత మని అంగీకరించిన
లయందే లయస్వభావముగూడ కల దని చెప్పఁగూడదు.

ుఖలైనే లయస్వభావము నంగీకరించిన ఉత్పత్తిస్వభావము నంగీ
ూడదు.

దాని నంగీకరించిన రెండవదాని నంగీకరింపఁగూడ నందునను
ిషయమైన దగుటవలన నొకటి స్వభావకృత మనియు రెండవ
్త గలఁ డనియు నంగీకరించుట యుక్తమై యుండినందునను
భావకృత మనుట సమ్మతింపఁదగినది కాదు.

ృత్సృష్టి స్వభావకృతమైన ఇప్పుడును స్వభావసిద్ధము గనే సృష్టి
డవలయును. సృష్టిస్వభావము భూతములయందుఁ గలదేని ఎచ్చ
బృధివ్యాదులు గలవో అచ్చటచ్చట సృష్టి జరుగుచుండవలయును.

సృష్టి కార్యవర్గములోఁ జేరిన బీజములతోడి పనిలేకయే జరుగు
యును. సృష్టిస్వభావము భూతములయం దున్నయెడల కార్యవర్గ
ేరిన బీజములతో నేటిపని? బీజములులేకయే సృష్టి జరుగుచున్న
్టను కానఁబడదు. కొన్నిస్థలములందు బీజములు ప్రత్యక్షము గ
న్నను, అన్నింటికినిఁ గల కారణబీజములు వీనికిమాత్రము లేక
యనుమానము నాశ్రయించి బీజములయునికి నంగీకరింప

భూతములతోడి సంబంధము లేకయే "బీజమునుండివృక్షము, ఆవృక్షమునుండి వేరొకవృక్షమునకు హేతువగు బీజము, ఆబీజమునుండి మఱల వృక్షము" అనియిట్లు సృష్టిభ్రమణము జరిగిపోవుచుండఁగా, "భూతములయందు ఒకానొక స్వభావము కలదనియు, ఆస్వభావముచేతనే సృష్టి జరుగుచున్నదనియు చెప్పుట ఏటియుక్తి? భూతములయందు బీజముల సృష్టింపఁగల స్వభావము కలదనియు ఆస్వభావముచేతనే బీజసృష్టి జరుగుచున్నదనియు చెప్పుటఁగూడ సరికాదు.

అట్టిస్వభావమున్నయెడల ఇప్పుడును భూతములనుండి సృష్టి జరుగుచుండవలయును.

వృక్షమునుండి బీజములు, బీజములనుండి వృక్షములు జనించుచున్నట్లు తెలియఁబడుచున్నదేగాని ఈసృష్టి భ్రమణమునకు కారణమగు తొలిపదార్థముగ నేదియు భూతములనుండి జనించుచున్నట్లు కానఁబడదు.

అట్లు జరుగుచుండిన యెడల సృష్టిలోని పదార్థములతోడి పని లేకయే స్వతస్సిద్ధముగ సృష్టి జరుగుచుండవలయునుకదా!

భూతములయందట్టిస్వభావ మొకప్పు డుండెననియు క్రమబద్ధముగ సృష్టిభ్రమణము జరుపుచుండఁగల బీజముల సృజించినపిమ్మట నాస్వభావము భూతముల విడిచె ననియు చెప్పుటగూడ అంగీకారయోగ్యము కానేరదు. ఆప్రకారము సృష్టిభ్రమణమునకు హేతువులగు బీజములు సృజింపఁబడిన మీఁదట భూతములనుండి సృష్టిస్వభావము నివర్తించె ననుటకు నాధారమేమి?

ఏప్రమాణమును లేనందున అట్టివాదము గూడ అంగీకరింపఁబడదు.

ట్లుగాక భూతములయం దట్టిస్వభావ ముండి బీజసృష్టి జరిగిన
నశించెనని అంగీకరించినను బీజసృష్టి జరుగువఱకు మాత్రమే
వ ముండునట్లు నియమించిన కర్త నొకని నంగీకరింపవలసి వచ్చును.
ల భూతములు నిత్యమైయుండఁగా మధ్య నివర్తింపఁగల నియాతస్వ
ర్పడుటకు కారణ మేమి?

స్వతస్సిద్ధమగు పదార్థమున కిట్టిస్వభావ మంగీకరింపఁ దగియుండదు

అందువలన మధ్య నివర్తింపఁగల ఈనియత స్వభావము నఁగీకరించిన
ల నిత్యత్వవాదమునకే భంగము వాటిల్లును.

సృష్టిస్వభావము భూతములయందుఁ గాక బీజములయందే గల దని
బీజము లనాదిసిద్ధము లనియు చెప్పఁగూడదా! యనిన నదియును
ు. బీజముల కనాదిత్వ మంగీకరించిన, అబీజములనుండి సృష్టి జరు
బీజములు నిత్యములై యుండవలయును. ప్రతియొక్క బీజమును,
మగు వృక్షమును సృజించి నశించుచున్నది.

అటువలెనే వృక్షముఁ గూడ తన కార్యమగు బీజకల్పనను గావించి
యున్నది. కాని ఇందేదియును అదినుండి నిత్యమై యుండినట్లు
దు.

బీజములు వృక్షముల కెట్లు హేతువులో, అటువలెనే వృక్షములు
కు హేతువులై యున్నవి. వీనియందు సృష్టిస్వభావము వేనికి చెప్ప
ను?—

బీజమునకా? వృక్షమునకా?

బీజము ఒకవృక్షమునుండి జనించినది. కావున దానికిఁ జెప్పఁగూడదు, అటువలెనే, వృక్షమును ఒకబీజమునుండి పుట్టినదే. కావున దానికిఁగూడ చెప్పఁగూడదు.

మఱి దేనికిఁ జెప్పవలయును?

వీటికి రెంటికిని కారణ మని చెప్పఁదగిన మూఁడవపదార్థము లేనందున, వేనికిని చెప్పుటకు వీలులేదు. కావున సృష్టిస్వభావము బీజముల యందు కలదనువారి వాదము గూడ నిరాధారమైనదే.

అందువలన "బీజమునుండి వృక్షము, వృక్షమునుండి బీజము" అని యీ ప్రకారము సృష్టిభ్రమణము నియతముగ జరుగుచుండునటుల నేర్పఱచిన సృష్టికర్త నొకని నంగీకరింపక తప్పదు. ఇట్లని 'స్వభావ మేకే కవయో వదంతి కాలం తథాన్యే పరిముహ్యమానాః దేవస్యైష మహిమాతు లోకే యేనేదం భ్రామ్యతే బ్రహ్మచక్రమ్" అను శ్వేతాశ్వతర శ్రుతియందుఁ గూడ వినఁబడుచున్నది.

అచింత్యరచనా స్వరూపమును కార్యకారణ నియమవర్జితము నగు ఈ సృష్టి చక్కఁగా నాలోచించి ఏర్పఱచి యుండకపోయినయెడల క్రమబద్ధమై నేఁటివఱకును జరుగుచుండుట సంభవింపదుగదా! చేతనుఁడును సంకల్పాదికముతోఁ గూడినవాఁడును సర్వజ్ఞుఁడునగు వానికిఁదక్క క్రమబద్ధము నచింత్యము విచిత్రానేక కార్యసంయుతము, నగు ఈ సృష్టి నేర్పఱుప మఱియొకనికి సాధ్యమగునా?

"సఈక్షత లోకాన్ను సృజా ఇతి, సఇమాఁల్లోకాన్ను సృజత, ఏష సర్వజ్ఞః ఏష సర్వేశ్వరః" అను శ్రుతులును సృష్టికర్తకు సంకల్పత్వ సర్వజ్ఞత్వాదులఁ జెప్పుచున్నవి. అందువలన, సంకల్పత్వాదికముతోఁ గూడినవాఁడు, సర్వజ్ఞుఁడు నగు ఒకానొక సృష్టికర్త గలఁడనియు, నతఁడే ఈ సృష్టిక్రమము నేర్పఱచె ననియు, నంగీకరింపక తప్పదు.

ఘటమునకు మృత్తికవలె, నుపాదాన కారణపదార్థము లేనిదే ఏపదా
ము సంభవింపదుగదా! సర్వజ్ఞుఁడగు సృష్టికర్త జగత్సృష్టికొరకు
ఉపాదాన కారణముగ నేపదార్థమును స్వీకరించెను? ప్రపంచము పం
చభూతాత్మకముగ నున్నమాత్రమున, నుపాదాన కారణత్వము
లకుఁ జెప్పవలయు నను నియమము లేదు.

ఉత్పత్తి వినాశములుగల పదార్థమున కాధారమైనది ఉత్పత్తివినాశ
యుండఁదగదు.

దేనికి నుత్పత్తి వినాశములు గలవో దానియుత్పత్తి వినాశముల
ముగ నొకపదార్థ ముండవలెనో ఆ ఉత్పత్తి వినాశములు దేనియందు
సృష్టి యనఁగా నుత్పత్తి వినాశముల ప్రారంభమే కావున
పూర్వమందు ఉత్పత్తిలయము లుండెనని చెప్పఁగూడదు.

నుక సృష్టికిఁ బూర్వమందున్న పదార్థమునకు ఉత్పత్తి వినాశముల
పఁ గూడదు.

సృష్టిలోని పదార్థముల కూడికయే ప్రపంచము కావున ప్రపంచమున
పగు పదార్థమునకు ఉత్పత్తి వినాశములఁ జెప్పఁగూడదు.

వయవములుగల పదార్థము వినాశము నొందితీరునను న్యాయ
వలన వినాశము నంగీకరింపరాని జగత్కారణ పదార్థమున కవయ
చెప్పఁగూడదు. అందువలన నవయవవంతములగు భూతములకు జగ
త్వ మెట్లు ఘటించును?

వయవములవలన నుత్పత్తి వినాశములను జెప్పవలసియుండుటచే,
ను సృష్టిలోని పదార్థములలో జేర్పవలయును.

కాశము నిరవయవమైనను, శబ్దగుణ ముండుటవలన సృష్టిలోని
నుగనే నిర్ణయింపఁదగియున్నది.

"ఆత్మన ఆకాశ స్సంభూతః" అను శ్రుతియు నాకాశము కల్పిత మనియే, చెప్పుచున్నది.

నిరవయవ వస్తువునందు పరిచ్ఛిన్నత్వము సంభవింపనందున జగత్కారణవస్తువున కనేకత్వము చెప్పఁగూడదు. అందువలన నద్వయత్వమే నిర్ణయింపఁదగినది.

ఈయద్వయవస్తువునకు నిరవయవత్వమువలన, నిర్వికారత్వము గూడ సిద్ధించుచున్నది. అవయవములు లేనిదానికి వికార మెట్లుసంభవించును? పరిణామముచేతనే వికార మంగీకరింపఁబడు చున్నది. నిరవయవమునకు పరిణామము కలుగనందున, వికారము సంభవింపదు.

నిరవయవము, అపరిచ్ఛిన్నము, ఉత్పత్తివినాశ వర్జితము, అద్వయము, పరిణామ రహితమునగు. సద్వస్తువునందే జగద్రచన నంగీకరింపవలసి యున్నది. కావున నదియే జగత్కారణపదార్థ మని చెప్పవలయును.

ఘటోత్పత్తి కుపక్రమించుటకు పూర్వమే కులాలుఁడు సిద్ధమై యున్నట్లు కార్యకల్పనకు పూర్వమే కల్పనాకర్త యుండియుండవలయును. లేని యెడల. కల్పనాకార్య మెవనివలన జరుగును? కర్తలేని కార్య మెట్లంగీకరింపఁబడును?

ఈ హేతువులచే జగత్కల్పనాకర్తను సృష్టికి పూర్వమం దుండినవానినిగనే యంగీకరింప వలసియున్నది. ఉత్పత్తి వినాశముల ప్రారంభమే సృష్టి యగుటవలన సృష్టికి పూర్వమం దున్నవానికి నుత్పత్తివినాశముల జెప్పఁగూడదు కదా!

ఉత్పత్తి వినాశములు లేనిది నిరవయవ పదార్థమే గనుక సృష్టికర్తనుఁ గూడ నవయవముల నిరాకరింపవలసి యున్నది.

గత్కారణ పదార్థమునకుఁ గూడ నుత్పత్తి వినాశములఁ జెప్పఁగూడ
యవత్వము నిర్ణయించి యున్నాము గదా!

ృష్టికర్తకుఁగూడ నవయవములు నిరాకరింపఁబడినందున నిరవయ
పరిచ్ఛిన్నత్వము యుక్తముఁ గాద నెడి హేతువువలన రెండు నిర
ార్థముల నంగీకరింపఁగూడమిచే సృష్టికర్తకును జగత్కారణవస్తు
రవయవత్వముచే నేకత్వము నిశ్చయింపఁ దగియున్నది.

ువవలన ఉపాదాన నిమిత్తకారణములు రెండును ఏకవస్తువునకే
చున్నవి.

పాదాన నిమిత్తకారణములు రెండును ఏకవస్తువునందుఁగూడ
చ్చు ననుటకు లోకమున తంతునాభి దృష్టాంతము గానున్నది.

యినను జగదుపాదాన నిమిత్తకారణములుగ నిర్ణయింపఁబడిన
కును దీనికిని చాలవ్యత్యాసము కలదు.

తునాభి సావయవమైనందున ఒకభాగము ఉపాదాన కారణము
కభాగము నిమిత్తకారణముగను ఉండుట కవకాశము గలదు.

దుపాదాన నిమిత్తకారణములుగ నిర్ణయింపఁబడిన పదార్థము
ుగదా! దీనియందు విభాగమెట్లు ఘటించును?

తునాభి సావయవ మగుటచే సంకల్పాదికమున కవకాశ మున్నది.
ునకు వికారములు సంభవింపనందున, ప్రపంచోపాదాన నిమిత్త
ంగ నిశ్చయింపఁబడిన పదార్థమునకు సంకల్పాదిక మెట్లు

కల్పాదికము నంగీకరించిన, వికారమును, వికారమువలన, నవయవ
వయవములవలన వినాశమును అంగీకరింపవలసి వచ్చునుగదా!

నియామకుఁడు

## ఇది ఎట్లు పొసఁగును?

సృష్టికి పూర్వమందుండిన పదార్థమున కిట్టిధర్మము నంగీకరించినం సృష్టిలోని పదార్థమునకును, దానికిని గల భేద మేమి? ఉపాదాన కారణ మగు పదార్థముకూడ, వినాశవంత మని యంగీకరింపవలసి వచ్చునుగదా!

ఇది యంగీకరింపరాని దగుటచే, సృష్టికి ముందున్న పదార్థమునకు, సంకల్పాదికము చెప్పఁగూడదు. అప్పుడుగాని యాపదార్థమునకు నిత్యత్వము సిద్ధింపదు.

అట్లని సంకల్పాదికమును నిషేధించిన:—సంకల్పాదికములేనివాఁడు సృష్టి నెట్లు చేయఁగలఁడు?

సృష్టికర్తకు సంకల్పాదికముఁ జెప్పినట్లైన నతనిని సృష్టికి పూర్వమం దున్నవానినిగ నంగీకరింపరామిచే నతనికి సృష్టికర్తృత్వ మెట్లు ఘటించును?

సృష్టిలోనివాఁడు సృష్టికర్త కాజాలఁడుగదా!

## ఇక కర్తవ్య మేమి?

ఏవిధముగఁ జూచినను, సృష్టికర్తయొక్క నిత్యత్వమునకు భంగము కలుగఁగూడదు. అతనికి సంకల్పాదికమును నిషేధించుటయు తగదు.

## ఇది సాధ్యమా?

## సాధ్యము కాక పోదు.

సృష్టికర్తయొక్క నిర్వికారత్వమునకు భంగము కలుగదేని అతని నిత్యత్వమునకును భంగమురాదు.

కావున నతని నిర్వికారత్వమునకు భంగము కలుగని రీతిని సృష్టి కార్యము నెఱవేఱఁగల విధమును నిశ్చయించుటయే ప్రస్తుతము విచారణీయాంశము.

దా౹వస్థయందు, జీవుఁడు అవికారియై నిద్రించుచుండు నాతని గల నిద్రాశక్తి అతని యవికారిత్వమునకు భంగము గలుగనీక విచిత్రానేక పదార్థకల్పనముఁజేయుట అందఱికి ననుభవగోచర మే కదా? అప్రకారమే సృష్టికర్తయందు ఒకానొకశక్తి కల నది సృష్టికర్తతోఁ బనిలేకయే సృష్టి కార్యము నెరవేర్పఁగల శక్తి ము, నంగీకరించినచో నైన సృష్టికర్తయొక్క నిత్యత్వమునకు భంగము

మప్రమాణమగు శ్రుతియు నీ ప్రకారమే ప్రతిపాదించుచున్నది.
ష్టికర్తయందుఁ గల జగత్కల్పనాశక్తి శ్రుతియందు మాయా వ్యవహరింపఁబడుచున్నది. మాయగలవాఁడగుటచే, సృష్టికర్త నామము వినఁబడుచున్నది.

చ్ఛిన్నుఁడగు జీవునియందుఁగల నిద్రాశక్తియే విచిత్రానేక వయందు సమర్థంబైయుండ నపరిచ్ఛిన్నుఁడగు మహేశ్వరుని మాయాశక్తి జగత్కల్పన గావించుననుటయం దాశ్చర్య ం?

మువలన మహేశ్వరనామము గలవాఁడును సర్వజ్ఞుఁడును న జగత్కల్పన గావించుచున్నాఁడనియు, నీజగత్కల్పనా న నతని నిత్యత్వమునకు భంగము గలుగదనియు నిశ్చయించ

ప్రకారము నిశ్చయించినను సృష్టి కార్య సమర్థనమునకు మఱి ంకము సంభవించుచున్నది.

కర్తయొక్క నిత్యత్వమును సమర్థించుటకొఱకు ఆయనయందు మాయాశక్తి గలదనియు నదియే జగత్తును సృజించుననియు నా కార్యమునకై సృష్టికర్త వికారము నొందవలసిన పని లేద యుంచినారము కదా!

మాయాశక్తియే సృష్టికర్తృత్వము వహించినప్పటికిని దానికిఁగూడ జగత్కల్పనకొఱకు ఉపాదాన కారణ పదార్థము కావలయునుగదా!

జగదుపాదాన కారణముగ నిశ్చయింపఁబడిన పదార్థము నిరవయవ మగుటచే నది జగదాకారముగ పరిణమింపఁజాలదు.

కావున, నిఁక సృష్టిఁజేయు టెట్లు?

అవయవములు గలదానికి వినాశముఁ జెప్పవలసి యుండుటచే ఉపాదాన కారణ పదార్థము సావయవముగ నుండ వీలులేదుగదా!

ఇక జరుగవలసినదేమి?

జగత్తునకు నిమిత్తకారణముగ నిశ్చయింపఁబడిన మాయాశక్తినే ఉపాదాన కారణముగఁగూడ నిర్ణయింపవలయును, అప్పుడుగాని జగత్కల్పనను సమర్థించుటకు వీలులేదు.

జీవునియందుఁగల నిద్రాశక్తి స్వప్నపదార్థకల్పన కొఱకు నిమిత్త కారణముగ నుండికూడ ఆ పదార్థకల్పనకు కావలసిన యుపాదాన కారణ పదార్థమును ప్రత్యేకముగ స్వీకరింపక తానే యుపాదాన కారణముఁ గూడ నగుచున్నదిగదా!

అప్రకారమే పరమేశ్వరునియందుఁగల మాయాశక్తిగూడ తానే ఉపాదాన నిమిత్త కారణములుగ నుండి జగత్సృష్టిఁ జేయుచున్నదని అంగీకరింపవలయును. ఇట్లు నిశ్చయించుటచేత నిత్యము నిరవయవము ఉత్పత్తి వినాశరహితమునై ఇంతకు పూర్వము ఉపాదాన నిమిత్త కారణ ములుగ నుండనోపునని నిశ్చయింపఁబడిన నిరవయవ పదార్థమును నిరాక రించితి మని శంకింపఁదగదు.

యాశక్తి జగద్రూపముగ పరిణమింపఁగలిగి యున్నందున పరిణా
న కారణముగ నంగీకరింపఁబడినను మాయాశక్తిచే సృజింపఁబడిన
యందు స్థితిని బొందియుండును?

్రకారుఁడు చిత్తరువును రచించునపుడు పరిణామోపాదాన కారణ
ఉపయోగపడినను ఆచిత్తరువునకు అధిష్ఠానముగ పటమునుగూడ
వలయును గదా!

ము లేనియెడల చిత్తరువు దేనియందు రచింపఁబడును? ఆ ప్రకా
యాశక్తిని పరిణామోపాదాన కారణముగ నంగీకరించినను నిత్య
సత్పదార్థమును జగదధిష్ఠానముగ నంగీకరింపవలయును.

దధిష్ఠానమగు నిరవయవ సత్పదార్థమే కాలత్రయమునందును
లేనిదై యున్నందున జగత్తునకు వివర్తోపాదాన కారణ మని చెప్పఁ
మాయాశక్తిని నిమిత్త కారణముగ నంగీకరించి నారముగదా!
శక్తి జడమగుటచేత ఇంతకు పూర్వము నిమిత్త కారణముగ
బడి యుండిన నిరవయవము చేతనము నగు సత్పదార్థముయొక్క
పేక్షింపక స్వయముగా సృష్టిఁజేయనేరదు.

వయవ పదార్థము చేతనమైనను వికార మంగీకరింపరాని దగుటచే
జగద్రచన చేయనేర దని చెప్పియున్నారముగదా!

యాశక్తిచే నపేక్షింపఁ దగియున్న నిరవయవ సత్పదార్థము
గాయ మెట్టిదై యుండును?

యాశక్తి జడమగుటచేత చైతన్య మొకటి మాత్రమే చేతన
ండి కోరఁదగియున్నది.

ఈ చైతన్యము నేలాగున పొందఁగలుగుచున్నది?

నపదార్థ సాన్నిధ్యమాత్రమున పొందఁ గలుగుచున్నదనిన నచే
ముండుటకే యవకాశము లేదు.

అట్లయిన, అంతకు మించిన మార్గమేమి కలదు ?

లేక పోలేదు.

ఆమార్గమును సైతము శబ్దప్రమాణమగు శ్రుతియే వక్కాణించు చున్నది.

దురూహ్యమగు విషయమును నిర్ణయింపవలసి నప్పుడు శ్రుతికి మించిన ప్రమాణము మఱియొకటి లేదుగదా!

అచేతనమగు మాయ చైతన్యము నొందుటకు ఆ మాయయందు చిత్ప్రతిబింబ ముండుటయే కారణమని శ్రుతి ప్రతిపాదించుచున్నది.

కావున చిత్ప్రతిబింబ ధారణముచే మాయ చైతన్యవంతమై సృష్టి కార్య నిర్వహణమునందు సమర్థం బగుచున్నదని అంగీకరింపవలసి యున్నది.

ఆ కారణముచేత కేవల మాయాశక్తినే నిమిత్త కారణముగ చెప్పుట యుక్తము కానేరదు.

మఱేమని చెప్పవలయును?

చేతన సత్పదార్థమునకును మాయాశక్తికిని, ప్రతిబింబమునకును కలిపి సమష్టిమీఁద సృష్టికర్తృత్వము చెప్పవలసి యున్నది.

మాయాశక్తి జడమగుటచేత స్వయముగా సృష్టికార్యము నెఱవేర్పఁ జాలదు.

చేతన సత్పదార్థము నిర్వికార మగుటచేత సృష్టికార్య నిర్వహణము నకై వలయు యోగ్యత లేనిదగుచున్నది.

ప్రతిబింబ మనిననో, మాయాశక్తి లేకున్నను చేతన పదార్థము లేకున్నను, స్వరూపస్థితినే కోల్పోవుచున్నది. కావున ఇవి మూఁడును ప్రత్యేక ప్రత్యేకముగ సృష్టికార్యము నెఱవేర్పఁగల యోగ్యత లేని వనుట నిర్వివాదాంశము.

మూఁటియొక్క కలయికవలన సృష్టికర్తృత్వశక్తి యుత్పన్నమై
్యము నెఱవేర్పఁబడు చున్నందున ఈ మూఁటిని నిమిత్త కారణముగ
వలసి యున్నది.

దువలన మాయాశక్తిని నిమిత్త కారణముగఁ జెప్పినమాత్ర
నువ చేతన పదార్థమును నిరసించుటకు సాధ్యముగాదు. ఆ ప్రకా
నువ సత్పదార్థమును నిమిత్త కారణముగ జెప్పిన మాత్రమున
క్తిని నిషేధించుటకు వీలులేదు. చేతన పదార్థము, మాయాశక్తి,
్యము అను నివి మూఁడును కలసియే శ్రుతియందు మహేశ్వర శబ్ద
హరింపఁ బడుచున్నవి.

మహేశ్వరునకే సృష్టికర్తృత్వమును "స ఈక్షతలోకాన్ను
ను శ్రుతి చెప్పుచున్నది:
మునకే ప్రపంచోపాదాన నిమిత్త కారణముల రెంటిని "తదా
్యయ మకురుత" అనుశ్రుతి నిర్ణయించు చున్నది.
మేశ్వరుఁడు జగత్తును సృజించి; అందుఁ బ్రవేశించె నని "తత్సృ
-ను ప్రావిశత్" అను ఉపనిషత్తు ఘోషించు చున్నదిగదా!
త్తును సృజించి అందుఁ బ్రవేశించిన పరమేశ్వరుఁడే యంతర్యా
వ సర్వభూతముల యందును లోపల నున్నవాఁడై ప్రేరకుఁడుగ
అంతర్యామి బ్రాహ్మణము చెప్పుచున్నది.

దువలన సమస్తజీవుల విజ్ఞానమయాదికోశములను వ్యవహారముల
యమించునది అంతర్యామియగు పరమేశ్వరుఁడే యని నిశ్చయింప

నమయాది కోశములు ఉత్పత్తి వినాశములు గలవి యగుటచే
ముగ చైతన్యముగలవి కాక పోవుట చేతను తమంతతాము వ్యవహా
సామర్థ్యముగలవి యని చెప్పఁగూడదు.

## నియామకుఁడు

జీవుఁడనినచో అజ్ఞుఁడగుటచేతను మాయచే బంధింపఁబడినవాఁడగుట
చేతను విజ్ఞానమయాదికమును వ్యవహారముల యందు నియమింపఁగల శక్తిమం
తుఁడని అంగీకరింపఁ గూడదు.

తాననుభవింపవలసిన కర్మఫలమే తనకుఁ దెలియని జీవునకు కర్మాను
గుణముగ నియమింపఁ బడవలసిన విజ్ఞానమయాదికమును వ్యవహారముల
యందు నియమింపఁగల సామర్థ్యము గలదని ఎవఁడు చెప్పగలఁడు?

జీవుఁడు నియమింపఁగల శక్తిమంతుఁడు గామిచేత వ్యవహారసిద్ధి
కొఱకు విజ్ఞానమయాదికమును నియమించువాఁడుగ వేఱొకఁడుండి యుండ
నగునని అంగీకరింపక తప్పదు.

విజ్ఞాన మయాదికమును నియమింపఁగలవాఁడు అంతర్యామిని విడిచి
నట్లయిన మఱియొకఁడు సిద్ధింపనందున విజ్ఞానమయాదికమును వ్యవహార
ముల యందు నియమించువాఁడు అంతర్యామియగు పరమేశ్వరుఁడేయని
అంగీకరింపక తప్పినది కాదు.

విజ్ఞానమయాదికముచేత వ్యవహరింపఁ జేయువాఁడు పరమేశ్వరుఁడే
యన్ని, "యో విజ్ఞానే తిష్ఠన్ విజ్ఞానదన్తరో యం విజ్ఞానం న వేద యస్య విజ్ఞానగ్
శరం యో విజ్ఞాన మన్తరో యమయ త్యేషత ఆత్మాఽన్తర్యామ్యమృతః"
అను మొదలగు శ్రుతులును "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా" అనునిత్యాది
స్మృతులును జెప్పుచున్నవి.

అంతర్యామియగు ఈశ్వరుఁడు జీవుల విజ్ఞానమయాది కోశములఁ
గర్మానుగుణముగ నియామించుచున్నందున నాయనకు సర్వజ్ఞత్వము చెప్పక
తప్పదుగదా!

స్త జీవుల కర్మల నెఱుఁగక పోయినయెడల కర్మానుగుణముగ
టకెట్లు సాధ్యమగును? అందువలన పరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁ
దముగ నంగీకరించి తీరవలయును.

మేశ్వరునిచే కల్పింపఁబడిన జాగ్రత్స్వప్నరూప ప్రపంచమును
విధముగఁజేయుట కెవ్వఁడును సమర్థుండు గానందున, నతనికే
తోపాటు సర్వేశ్వరత్వముఁగూడ చెప్పఁబడుచున్నది,

జగత్తును శాసించున దీపరమేశ్వరుఁడే యని "ఏతస్యవా అక్ష
సన ఇతి" "అంతః ప్రతిష్ఠశ్శాస్తా జనానాం" అనుశ్రుతులు చెప్పు
దువలన సర్వజగదంతర్యామియు, సర్వేశ్వరుఁడునగు పరమేశ్వ
జగన్నియామకుఁడు గూడనయి యున్నాఁడని నిశ్చయింప

మేశ్వరునకు సర్వజగన్నియామకత్వము అంగీకరింపఁబడినందున
ను సుఖదుఃఖములయందు నియమించునది యతఁడే యని చెప్ప
సర్వజగత్తునకును నియామకుఁడు పరమేశ్వరుఁడని అంగీకరింపఁ
అజ్ఞులు నస్వతంత్రులు మాయాబద్ధులు నగుజీవులకు మాత్రము
డతఁడుగాక మఱియొకఁడని యెట్లు చెప్పవచ్చును!

ల హృదయముల యందుండి వ్యవహరింపఁ జేయువాఁడతఁడే
స్మృతులు వక్కాణించుచున్నవిగదా!

సుఖదుఃఖముల యందు నియమించువాఁ డతఁడుదక్క మఱె
?

దువల్లన జీవులను సుఖదుఃఖముల యందు నియమించువాఁడు పర
ను విషయమున సంశయింప నక్కరలేదు.

పరమేశ్వరుఁడు జీవులను సుఖదుఃఖముల యందు నియామించుచున్నాఁడని అంగీకరించునపుడు కర్మానుగుణముగ నియమించుచున్నాఁడను విషయమును గూడ అంగీకరింప వలయును.

లేనియెడల పరమేశ్వరునియందు పక్షపాతాది దోషముల నారోపింపవలసి వచ్చును.

జీవుల సుఖదుఃఖము లల్పాధిక భేదములతో నొక్కొక్కరియందొక్కొక్కవిధముగ గన్పట్టుచున్నవిగదా! పరమేశ్వరుఁడు కర్మానుగుణముగఁగాక స్వతంత్రించి జీవులను సుఖదుఃఖముల యందు నియమించుచున్నాఁడని అంగీకరించిన జీవుల సుఖదుఃఖభోగముల అల్పాధిక భేదకల్పనకు పరమేశ్వరుని పక్షపాతమే కారణ మని చెప్పవలసివచ్చును.

పరమేశ్వరుఁడు పక్షపాతి యనియు, సుఖదుఃఖకల్పనల యందు స్వతంత్రించి తనబుద్ధికిఁ దోఁచినట్లు చేయుననియు, నంగీకరించిన, జీవుల సుఖదుఃఖభోగానుభవమునకును కర్మలకును సంబంధము లేకపోవుటచేత సుఖప్రాప్తి దుఃఖనివృత్తులయందు జీవప్రయత్న మక్కఱ సరాదని చెప్పవలసివచ్చును.

ఇట్లంగీకరించిన పురుషప్రయత్నమే నిరర్థక మనవలసివచ్చును. సమస్త శాస్త్రములును నిష్ప్రయోజకములగును.

బుద్ధీంద్రియాతీత స్థితినుండి సత్యాంశముల రాశిఁగనుఁగొనిన శాస్త్రకారులే పొరఁబడి రనవలసి వచ్చును, ఇది యెవ్వరికిని సమ్మతము గాదు కదా!

శాస్త్రము సత్యాంశముల రాశి యనుటకు ప్రాచీన కాలమునుండియు నది ప్రత్యక్షాది ప్రమాణములలో నొకటగు శబ్ద ప్రమాణముగ ననుష్ఠాన పరులచే గ్రహింపఁబడు చుండుటయే నిదర్శనము.

ప్రత్యక్షాది ప్రమాణములు ప్రమాణాంతర ప్రతిపాదితార్థమును
దింపక పోవుటచేతనే ప్రమాణములై యున్నవి.

శాస్త్రముఁగూడ, అన్యప్రమాణ గోచరార్థమును ప్రతిపాదింపక
ణాంతర ప్రతిపాదితముగాని యర్థమునే ప్రతిపాదించు చున్నందున
మాణముగ నంగీకరింపఁబడి యున్నది.

ఇట్టి శాస్త్రము ప్రమాణమా? అప్రమాణమా? యని నిర్ణయించు
త్యక్షాది ప్రమాణములు సాధనములు కాఁజాలవుగదా!

అతీంద్రియ స్థితియందుండి కనుఁగొనఁబడిన యీ శాస్త్రార్థ; మను
ముచే నగు మానసిక పరివర్తన మూలమున బుద్ధి కంతర్ముఖ మలవడి
యస్థితి లభ్యమగుచుండ శాస్త్రకారు లేస్థితియందుండి యేవిషయమును
రో ఆస్థితి లభ్యమైనపుడు దాని యథార్థతత్త్వము ప్రస్ఫుటమగు

కీ సత్యమునే పాతంజల యోగశాస్త్రాది గ్రంథములు ధ్రువపఱచు

అందువలన శాస్త్రప్రామాణ్యము నిర్ణయింప వలయుననిన శాస్త్రాను
లై సత్య మనుభూతమైన వారి వాక్యముల వలననే నిర్ణయింప వల
ని, ప్రమాణాంతరములచేతఁ గానేరదు.

శాస్త్రానుష్ఠానపరు లెవ్వరును శాస్త్ర నిరర్థకత్వమును ప్రతిపాదించి
ందునను విశేషించి శాస్త్ర ప్రామాణ్యమునే వక్కాణించి యున్నం
వేకియగు వాఁడెవ్వఁడును శాస్త్ర నిరర్థకత్వ ప్రతిపాదన నంగీ
ం.

అందువలన శాస్త్రార్థమునకు విరుద్ధముగ, 'పరమేశ్వరుఁడు జీవులకు
భోగములఁ గల్పించునపుడు తనబుద్ధికిఁ దోఁచినట్లు చేయు నని
డదు. మఱి మనిన జీవకర్మాను గుణముగనే యతఁడు వ్యవహరిం
ఁడని చెపవలయును'

పరమేశ్వరుఁడు కర్మానుగుణముగనే జీవులను సుఖదుఃఖములయందు నియమించుచున్నాఁడని అంగీకరింపఁబడినందున కర్మలయందు సుఖహేతువులు దుఃఖహేతువులు నను విభాగము గూడ నంగీకరింపవలయును.

లేనియెడల ఒకవిధమగు కర్మకే ద్వివిధరూపఫలముఁ జెప్పవలసి వచ్చును.

కర్మలన్నియు నొక్కవిధముగ నున్నవనియు ప్రతికర్మకును సుఖదుఃఖములనెడి ద్వివిధరూప ఫలమున్నదనియుఁ జెప్పిన:—దుఃఖములు తప్పనివగుటచే దుఃఖనివృత్తికి ప్రయత్నించుటే వ్యర్థమగును. అందువలన ప్రతికర్మకును ద్వివిధరూప ఫలమున్నదని చెప్పఁగూడదు.

మఱెట్లన్నిన:-కర్మలయందు సుఖహేతువులు, దుఃఖహేతువులు నను విభాగము నంగీకరించి తీఱవలెను.

ఈ సుఖదుఃఖహేతువులగు ద్వివిధరూపకర్మలు జీవ వ్యవహారములఁ బట్టి యేర్పడుచున్నందున జీవ వ్యవహారముల యందును సుఖహేతుకర్మకారకములు దుఃఖహేతు కర్మకారకములు నని ద్వివిధత్వ మంగీకరింపవలసి యున్నది.

వ్యవహారభేదము లేనియెడల కర్మభేదము మాత్రమెట్లు సిద్ధించును?

అందువలన వ్యవహారభేదమునుబట్టి కర్మభేదమును కర్మభేదమును బట్టి ఫలభేదమును ఘటించునని అంగీకరింపవలసి యున్నది.

పరమేశ్వరుఁడు వ్యవహారములఁబట్టియే శుభాశుభ కర్మవిభాగమును నిర్ణయించునని అంగీకరింపఁదగియున్నందున జీవవ్యవహారములయందును సుకృతదుష్కృత వ్యవహార విభాగనిర్ణయముఁ జేసినవాఁడుగూడ పరమేశ్వరుఁడే యని నిశ్చయింపవలయును.

ఏవ్యవహారమున కేఫలము? అను నిర్ణయము సర్వజ్ఞుఁడు సర్వేశ్వరుఁడు నగు కర్మఫలప్రదాతదక్క మఱెవ్వఁడు నిశ్చయించును?

అతనికంటె నధికుఁడుగాని, అతనితో సముఁడుకాని వేఱొకఁడు
గా!

వ్యవహారభేదమును నిర్ణయింపక ఫలనిర్ణయముఁ జేయుట కెవ్వఁడును
స గానందున కర్మభేదమును నిర్ణయించిన పరమేశ్వరుఁడే కర్మ
వ్యవహారములయందున్న సుకృతదుష్కృత విభాగమును నిర్ణయించె
ఁగీకరింపవలసియున్నది.

అందువలన జీవులయందుఁ గన్పట్టు నీచోచ్చజన్మములకును సుఖ
భేదములకును పరమేశ్వరునిచే విభాగింపఁబడిన వ్యవహారములలో
చరించు సుకృతదుష్కృత వ్యవహారములే కారణము లని ఎఱుఁగ
వ.

పరమేశ్వరుఁడు జీవప్రకారము సుకృతదుష్కృత వ్యవహారముల నిర్ణ
ఆయావ్యవహారములకుఁ దగినట్లు జీవులను సుఖదుఃఖములయందు
చుటకు కారణ మేమైయుండును! ధర్మపరిపాలన మొనర్ప
నను తలంపొక్కటే కారణ మని చెప్పవలసియున్నది.

పరమేశ్వరసృష్టియందలి ఏజీవి యందైన నిర్మాణమును గమనించి
వి యోగక్షేమముల కవసరములగు దేహేంద్రియ మనోబుద్ధులు
సంగఁబడి యున్నట్లు స్పష్టమగు చున్నదిగదా!

అయినను ఈదేహేంద్రియ మనోబుద్ధు లల్పాధిక భేదములతో
క్కరియం దొక్కొక్కవిధముగ నుండుటగూడ కన్పట్టుచున్నది.

అందువలన పరమేశ్వరుండాయా జీవుల యోగక్షేమ రక్షణలకై
గొసంగఁబడిన దేహేంద్రియ మనోబుద్ధులు చాలవని చెప్పవలసి
ది.

ఒకని దేహేంద్రియ మనోబుద్ధు లధికోపయోగములైయుండ మఱి
వంతటి ఉపయోగవంతములై యుండక పోవుటగూడ కన్పట్టు
గదా!

అట్టియెడ, నొకటివాఁడు రెండవవాని యోగక్షేమములకు భంగము గలిగింపదలఁచినపుడు రెండవవాఁడు తనదేహేంద్రియ మనోబుద్ధుల నుపయోగించి తనయోగక్షేమముల నెట్లు రక్షించుకొనఁగలఁడు?

అందువలన నిష్పక్షపాతియగు పరమేశ్వరుఁడు జీవులను నీచోచ్చాది జన్మములయందుఁ బడవేయునపుడు ఆయాజీవుల యోగక్షేమ రక్షణలకై ప్రత్యేకముగ శ్రద్ధ వహింపవలసి యున్నది.

పరమేశ్వరుఁడు సుకృతదుష్కృత వ్యవహారముల నిర్ణయించి వారి వారి వ్యవహారములకుఁ దగినట్టి సుఖదుఃఖములయందు నియమింపనియెడల జీవులు అన్యజీవుల యోగక్షేమములకు భంగము గలిగింపకుండుటయందును రక్షణల గల్పించుటయందును శ్రద్ధవహింపరుగదా!

కావున జీవులు అన్యజీవుల యోగక్షేమ రక్షణల కుపకరించుట; భంగము గలిగించుట; అను వ్యవహారములఁబట్టియే పరమేశ్వరుఁడు సుకృతదుష్కృత వ్యవహారభేదము నిర్ణయించు నని గ్రహింపవలసియున్నది.

ఈప్రకారము సుకృతదుష్కృత వ్యవహారముల నిర్ణయించిన పరమేశ్వరుఁడు, ఈజన్మమున తనకొసంగిన దేహేంద్రియ మనోబుద్ధుల సద్వినియోగపఱచినవానికి వాని సుకృతమునకుఁదగినట్టి స్వర్గాది సౌఖ్యములను మఱుజన్మమున వెనుకటిజన్మమునందుకంటె నత్యుత్తమములగు దేహేంద్రియ మనోబుద్ధులను నొసంగి వాని యోగక్షేమములకు తగిన రక్షణలఁ గల్పించుచున్నాఁడు.

అట్లుగాక తన కొసంగఁబడిన దేహేంద్రియ మనోబుద్ధుల నన్యజీవుల యోగక్షేమములకు భంగము కలుగునట్లుగునట్లుగా దుర్వినియోగపఱచినవానికి ఘోరవాది నరకయాతనల నొసంగి తన కొసంగఁబడిన దేహేంద్రియ మనోబుద్ధుల సక్రమముగా నుపయోగింపనందులకుగా మరుజన్మమున నంతకంటె హీనములగు దేహేంద్రియ మనోబుద్ధులను కల్పించి అన్యజీవుల యోగ

కు తగురక్షణల కల్పింపనందులకై అతని యోగక్షేమములకు రక్ష పండఁ జేయుచున్నాఁడు. అందువలన మానవుఁడు తనకంటె ములగు దేహేంద్రియ మనోబుద్ధులు గలవానినిఁ జూచినపుడును ంద్రియాదులకంటె నతిహీనములగు దేహేంద్రియ మనోబుద్ధులు ఁ జూచినపుడును (పశుపక్ష్యాదులననుట) వారి నీచోచ్చదశలకు ర్వజన్మ సుకృతదుష్కృతములే కారణము లని గ్రహించి తాను మున నీచత్వము నొందకుండుటకొఱకును, నుచ్చదశ నొందుట దుష్కృతముల విడిచి సుకృతముల నాచరించుటకు ప్రయత్నింప

్రతిజీవిచేతను, తా నాచరించు సుకృతదుష్కృతములకు పరమేశ్వరుఁ సుఖదుఃఖములలో నత్యల్పభాగము మాత్రమే యిచ్చట ననుభ చున్నది. ఏలనన, నిది సుకృతదుష్కృత కర్మల నాచరించుటకు ప్రత్యేకింపఁబడిన కర్మభూమి గాని కర్మఫలములగు సుఖదుఃఖ భవించుటకు నిర్ణయింపఁబడిన స్థలముగాదు.

ందువలన మానవుఁ డీకర్మభూమియందు కర్మల నాచరించుటకు ప్రాధాన్య మివ్వవలయును. గాని సుఖదుఃఖముల ననుభవించు ధాన్య మొసంగరాదు.

ష్యత్క్షేమము నాశించిన వారలగు ప్రాచీనమహాత్ము లేమిచేసిరి ? హికభోగముల నుజ్జగించి భవిష్యత్క్షేమదాయకమగు ఉత్తమమార్గ జీవితములఁ గడపినారుగదా ?

క్కడ జీవు లనుభవించు సుఖదుఃఖములు, సుకృతమునకుఁ గలుగు ది ? దుష్కృతమునకుఁ గలుగు ఫలం బెట్టిది? అనువిషయమును బోధపఱచి సుకృతకర్మలయందు సుముఖులుగను దుష్కృతకర్మల ముఖులుగను నొనర్చుటకొఱకు మచ్చునకుఁగా పరమేశ్వరునిచే

నొసంగఁబడిన వేగాని జీవులాచరించు సుకృతదుష్కృతములకుఁ గలుగవలసిన పూర్ణఫలములుమాత్రము గావు.

ఈసుకృతదుష్కృత ఫలములగు సుఖదుఃఖముల ననుభవించు స్థానములు ప్రత్యేకింపఁబడి యున్నవి. అవియే స్వర్గాది పుణ్యలోకము లనియు రౌరవాది నరకము లనియు శాస్త్రములు పేర్కొనుచున్నవి. జీవులు తామాచరించు సుకృతదుష్కృత ఫలముల నాయాలోకములయం దనుభవించి, కర్మశేషముతో మరల నిచ్చట జన్మించుచున్నారు.

ఇట్లని శ్రు॥ తద్య ఇహ రమణీయచరణా అభ్యాశోహయ త్తే రమణీయాం యోని మాపద్యేరన్ బ్రాహ్మణయోనిం వా క్షత్రియయోనిం వా వైశ్యయోనిం వా; అథ యఇహ కపూయచరణా అభ్యాశోహయ త్తే కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం వా సూకరయోనిం వా చాండాలయోనిం వా॥ (ఛాం౫.౧౦.౭) అను శ్రుతివల్లను, "వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః, ప్రేత్య కర్మఫల మనుభూయ తత శ్శేషేణ విశిష్ట దేశ జాతి కుల రూపాయుశ్శ్రుత వృత్త విత్త సుఖ మేధసో జన్మ ప్రతిపద్యంతే" అను (గౌతమధర్మసూత్ర ౨.౧౧.౨౯) స్మృతివల్లను స్పష్టమగుచున్నది.

మానవుఁడు తాను జన్మించునప్పుడే కర్మశేషము గలదో, యా కర్మశేషమునకు ఫలమగు సుఖదుఃఖముల ననుభవించుచు మరల నిచ్చట కర్మల నాచరింప వలసినవాఁ డగుచున్నాఁడు.

అందువలన తాననుభవించు సుఖదుఃఖములఁ బట్టియే తాను పూర్వజన్మమున నేప్రకారము ప్రవర్తించి యుంటినను విషయమును మానవుఁడు కొంతవఱకైనను నూహించుకొనవచ్చును.

జీవుల నీచోచ్చస్థితిగతుల కాయా జీవుల సుకృతదుష్కృత కర్మలే కారణ మని యెఱింగిన పిదప నైనను మానవుఁడు సుకృత మాచరింపవలయునా? దుష్కృతము నాచరింపవలయునా? యను విషయమును

చుకొనవలసియున్నది. దుష్కృతము నాచరించు చున్నయెడల కృతమును బట్టి తన కబ్బిన మానవత్వమును, అత్యంతోపయోగ కేంద్రియ మనోబుద్ధులను గూడ మఱుజన్మమునఁ గోల్పోవలసి ము.

ను మానవత్వమునే గోల్పోఁదగినంత దుష్కృతము నాచరించిన కబ్బునది పశుపక్ష్యాది నీచ యోనిప్రాప్తియే గదా!

ప్పుడు నీ విదివరలో పశుపక్ష్యాదికమును గూర్చి ప్రవర్తించినటులే వి విషయమై ప్రవర్తింతురను విషయము నిర్వివాదము. అట్టియెడ న దేమున్నది? కర్మఫల మనుభవింపక తప్పదుగదా! కావున అన్య గక్షేమములకు భంగము గలిగింపఁ దలఁచినవాఁడు తన కట్టి జన్మ ము తనస్థితి యేమిగా నుండునో! ముందుగా విమర్శించుకొని వలయును.

దుష్కృత కర్మ శేషమునకు మాత్రమే ఫలములగు పశుపక్ష్యాది ప్రాప్తియు, నపుడు గలుగు దుఃఖములును సహింపరానివై కర్మఫలము పూర్ణముగా ననుభవింపవలసిన నరకలోక దుఃఖ వర్ణింపఁగలఁడు?

వున మానవుఁడు జన్మాంతర లోకాంతరములు లేవను నాస్తికవ నమ్మి అన్యజీవుల యోగక్షేమముల మఱచి యథేష్టాచరణకు గడం ప.

ట్లుగాక; యథేష్టాచరణకు గడంగానేని మాటి మాటికిని నరకము ందు నని శ్రు॥న సాంపరాయః ప్రతిభాతిబాలం ప్రమాద్యంతం హేన మూఢం, అయం లోకో నాస్తి పర ఇతి మానీ, పునః పున పద్యతే మే॥ అను యమవాక్యము గూడ సూచించుచున్నది.

యోని మన్యే ప్రపద్యంతే, శరీరత్వాయ దేహినః" అను శ్రుతి రము నంగీకరించు చున్నది గదా!

"పుణ్యేన పుణ్యం లోకంనయతి పాపేన పాపము భాభ్యాం మనుష్యలోకం" అనుశ్రుతి లోకాంతరమును ప్రతిపాదించు చున్నది.

ఈ జన్మాంతర లోకాంతర విషయములు శాస్త్ర ప్రసిద్ధములుగదా!

గాంధారి శ్రీకృష్ణుఁడొసంగిన దివ్యదృష్టిచే గడచిన నూటొక్క జన్మల విషయమును గ్రహించినట్లు భారతము చెప్పుచున్నది.

శ్రీరామునంతటివాఁడు గూడ పరలోకమును గూర్చి భయపడినట్లు రామాయణమున శ్రీరాముని వాక్యమువలననే స్పష్టమగుచున్నది.

శబ్ద ప్రమాణవేద్యమగు విషయము ప్రమాణాంతరములకు తెలియరానందున జన్మాంతర, లోకాంతరాదులఁగూర్చి అన్య ప్రమాణములచే నిర్ణయించుటకు సాధ్యము కాదు.

సూ॥ "సంస్కార సాక్షాత్కరణా త్పూర్వజాతి జ్ఞానమ్" "భువన జ్ఞానం సూర్యసంయమాత్" అనుపతంజలిసూత్రములఁ జరికింపుడు!

ఏమనుచున్నవి?

జన్మాంతర లోకాంతర జ్ఞానములు సాధనసాధ్యములని, నిరూపించుచున్నవిగదా!

సాధన సాధ్యమగు విషయము విమర్శనాబుద్ధి కెట్లు వేద్యమగును?

సూ॥ "అనుభూతవిషయా సంప్రమోషస్స్మృతిః" అనుసూత్ర ప్రకారమంతకుపూర్వ మనుభూతమైయున్న విషయమే ఇప్పుడుగాని ఇకముందుగాని స్మృతికి వచ్చునను విషయము సర్వజన సమ్మతమైనదే గదా!

అందువలన ఏ విషయము తన కీజన్మమున ననుభూతము కాకపోయినను స్మృతిప్రసిద్ధ మగుచున్నదో అది పూర్వజన్మానుభవ స్మృతి యని యంగీకరింప వలసియున్నది.

జన్మాంతరము లేకపోయిన యెడల తా నీజన్మమున ననుభవించిన

మీ స్మృతికి రావలయును గాని తదన్యమైనది స్మృతికి వచ్చుటకు వీలు
దా!

జీవులయం దేజీవి వ్యవహారమును గమనించినను తా నీజన్మమున
ండని విషయములుగూడ స్మృతి ప్రసిద్ధములై యున్నటుల స్పష్ట
న్నది.

గోవత్సము; మాతృగర్భమునుండి వెలువడిన వెమ్మట ఇతరుల సాయ
పకయే స్వయముగా తన తల్లి పొదుగును సమీపించి క్షీరమును
న్నది గదా!

తన తల్లికి పొదుగున్నదియు నది చేపుట మున్నదియు దానికి
చెప్పిరి?

ఈ జ్ఞాన మీ జన్మమున నేర్చినది కాదుగదా!
దానికీజ్ఞానము కలుగుటకు హేతు వేమి?

నుభవము లేని విషయము స్మృతికి రానేరదను న్యాయమును
చ్చుటకు వీలులేదుగదా!

ఈ హేతువును బట్టిచూచిన అది యింతకుపూర్వ మొకప్పు డీగో
ను జన్మించి యుండుననియు నాఁటియనుభవ మిప్పు డీ గోజన్మ
ల స్మృతికి వచ్చెననియుఁ జెప్పవలసి యున్నది.

నిచో నీ స్మృతి జ్ఞానమునకు హేతువు నూహింప శక్యము గాదు

తునాభి పటమును సృజించుటకును గిజిగాఁడు గూటి నల్లుటకును
నేర్చిన విద్యయే కారణ మని యెవఁడు చెప్పఁగలఁడు?

యెల్లను జన్మాంతర సంస్కార సంబంధమున నలవడిన విద్య
శక్తియు నంగీకరించి తీరవలయునుగదా!

ఈ ప్రకారమే ప్రతిజీవునికిని జన్మాంతర సంస్కార సంబంధమున నేర్పడిన జ్ఞానము లని కొన్నింటిని నంగీకరించి తీరవలసి యున్నది. అందుచేత ప్రతిజీవునికిని జన్మాంతరము గలదని నిర్వివాదముగ నంగీకరింప వలసి యున్నది.

శ్రీ సురేశ్వరాచార్యులును దక్షిణామూర్తి స్తోత్ర వార్తికము సప్తమోల్లాసము నందు:—

శ్లో॥ పూర్వజన్మానుభూతార్థ స్మరణా న్మృగశాబకః
జననీస్తన్యపానాయ స్వయమేవ ప్రవర్తతే॥ ౬

శ్లో॥ తస్మాన్నిశ్చీయతే స్థాయీ హ్యాత్మా దేహాంతరేష్వపి,
స్మృతింవినా న ఘటతే స్తన్యపానం శిశో ర్యతః॥ ౭

శ్లో॥ పూర్వత్రానుభవే కాలే స్మృతికాలే పరత్ర చ
ఆత్మా సంస్కారరూపేణ స్మర త్యర్థం స్వసంస్థితమ్॥ ౮

అను వాక్యములచేత నీయర్థమునే ప్రతిపాదించియున్నారు.

అట్లు గాక ఈజ్ఞానముల కంతర్యామి ప్రేరణయే హేతు వనియు ఆయాజీవులకు ముఖ్యములగు నాయాజ్ఞానముల నంతర్యామియే కలిగించు చున్నాఁడనియు చెప్పుదు మనిన కర్మానుగుణ్యముగ నియమించువాఁ డని యంగీకరింపఁబడిన అంతర్యామికి ఈలాటి నియంతృత్వాదికము నంగీకరించిన ఆయన పాలనయందు పక్షపాతాదిదోషముల నారోపింపవలసివచ్చును. కావున నట్లు చెప్పఁగూడదు.

మఱి యనిన అజ్ఞులు మాయాబద్ధులు నగు జీవులకు జన్మ జరా మరణాది సర్వవ్యవహారములను ఆయాజీవుల కర్మానుగుణ్యముగ నంతర్యామి నెఱవేర్చుచున్నాఁడని చెప్పవలయును.

కావున ఎట్టకేలకు స్మృతిజ్ఞానము నాశ్రయించి జన్మాంతరము నంగీకరించి తీరవలెను.

మున జీవులను కర్మానుగుణముగ నీచోచ్చ జన్మలయందుఁ బడవేయుననియే అంగీకరింప వలసియున్నది.

లోకాంతర విషయమును జన్మాంతర విషయమువలె శబ్దప్రమాణము ప్రతిపాదించిన క్రమముననే నిర్ణయింప వలసియున్నది,

ఈ జన్మాంతర లోకాంతరములు శబ్దప్రమాణమగు శాస్త్రమునకు అంగీకార్యములే గదా!

అందువలన ప్రతివ్యక్తియు జన్మాంతర లోకాంతరములు గలవని విశ్వసించియే ప్రవర్తింపవలసి యున్నది. ఆ ప్రకారము విశ్వసించి ప్రవర్తించిన వానికి నాస్తికవచన ప్రకార మొకవేళ జన్మాంతర లోకాంతరములు లేకపోయినంత మాత్రమున వచ్చు ప్రమాద మేమియును లేదు. తానాచరించిన సుకృతకర్మలు మాత్రమే వ్యర్థములగుచున్నవి.

జన్మాంతర లోకాంతరముల విశ్వసింపని వాని విషయ మట్టిది కాదు. శాస్త్రము నుల్లంఘించి యథేష్టాచరణకు గడంగి అన్యజీవ యోగక్షేమములకు భంగము గలిగించినందులకుగా ననుభవింపవలసిన దుష్కృత కర్మఫలములగు రౌరవాది నరకయాతనలును, పశుపక్ష్యాది నీచజన్మములును తప్పవు.

కావున మానవుం డెప్పుడును నాస్తికవచనముల నమ్మి అన్యజీవుల యోగక్షేమములకు భంగము గల్గు లాగున యథేష్టాచరణకు గడంగఁ గూడదు. సర్వజీవ యోగక్షేమ రక్షణయే సమస్తశాస్త్రముల ముఖ్యాభిప్రాయము.

ఆత్మోద్ధరణమే ప్రధానాంశముగా ప్రతిపాదించెడి మోక్షశాస్త్రముసైతము దీనికి వ్యతిరేకముగ ప్రవర్తింపదు. మానవుఁడు మోక్షమార్గమందుఁ బ్రవేశింపవలయునన్నను అత్యుత్తమములగు దేహేంద్రియ మనో

క్షేమరక్షణల కుపకరింపఁగలందులకై మఱికొన్ని ధర్మములను నిర్ణయించి విధించుచున్నవి.

ఈ శాస్త్రచోదిత ధర్మముల విధిగా నిర్వర్తింపఁగలుగువాఁడు సర్వజీవ యోగక్షేమముల విషయమై సరిగా ప్రవర్తించినవాఁ డగుచున్నాఁడు.

అయినను ఈ ధర్మ శాస్త్రరహస్య మెఱింగి సత్పథమునం బ్రవర్తింప లేని వానికి ఆత్మౌపమ్యదృష్టియే ఉత్తమోత్తమ సాధనముగా నున్నది.

సర్వధర్మముల నెఱింగినవాఁ డేప్రకారము సర్వజీవ యోగక్షేమముల విషయమై ప్రవర్తింపఁగలుగుచున్నాఁడో ఆత్మౌపమ్యదృష్టి గలవాఁ డంతకంటె మిన్నగనే ప్రవర్తింపఁ గలుగుచున్నాఁడు.

దీనినే మఱియొక విధముగాఁ జెప్పవలయుననిన ఆత్మౌపమ్యదృష్టిలేని వానింగూర్చి మాత్రమే ధర్మశాస్త్రములు ప్రవర్తించుచున్నవి. గాని ఆత్మౌపమ్యదృష్టి గలవానిని ధర్మశాస్త్రమును శాసింపనేరదు, ఏలన, ధర్మశాస్త్రములు ప్రతిపాదించియుండని ధర్మసూక్ష్మములఁగూడ నాత్మౌపమ్యదృష్టిగలవాఁ డాచరింపఁగలుగుచున్నాఁడు.

అందువలన సర్వజీవ యోగక్షేమముల విషయమై శ్రద్ధ వహింపవలసిన ప్రతిమానవునకును ఆత్మౌపమ్యదృష్టి నలవఱుచుకొనుట యావశ్యకమై యున్నది.

## ఆత్మౌపమ్యదృష్టి యనన నేమి?

ప్రతిజీవిని తనవలె నెన్నుకొని సుఖము దుఃఖము ప్రియము అప్రియము దానము నిషేధము మొదలగు సర్వవిషయములయందును ఒరులు తన విషయమై ప్రవర్తించినపుడు, తన కెట్లుండునో తా నితరుల విషయమై ప్రవర్తించినపుడు వారి కట్లేయుండునని నిశ్చయించి తనకిష్టమైనవి మాత్రమే తా ననుభవించునట్లు పరుల కిష్టమైనవి మాత్రమే "వారియందుఁ బ్రవర్తింపఁ జేయవలయును.

56. రాగద్వేషముల ప్రాబల్యముతోఁగూడి యుత్పన్నమైన సంక ల్పాదికమును నిరోధించుటకు పురుషునకు శక్యముగాదు.

57. అందువలన, రాగద్వేషాదులు త్పన్నములుగాకుండ నిరోధించు టయే పురుషునకు ప్రథమకర్తవ్యమై యున్నది.

58. ఈ హేతువువలన, మనస్సును సకలవిషయవ్యపేతమును గావింప ప్రయత్నించు పురుషునకు ఇంద్రియములను విషయప్రవృత్తములఁ గానీయకుండ నిరోధించుటావశ్యకమై యున్నది.

59. మనస్సును సంకల్పవికల్పాదికమునుండి నిరోధింపఁ బ్రయ త్నించు పురుషునకు ఇంద్రియసంబంధమగు విషయకాంక్ష జనించెనేని, అతఁడు బలవత్తరమగు బుద్ధిశక్తిచే నా సంకల్పము నడంచి, సంకల్పాను కూలముగ నింద్రియములు ప్రవర్తింపకుండ నిగ్రహింపవలయును.

60. ఇట్లు ఏ యింద్రియసంబంధమగు విషయకాంక్ష జనించునో, ఆ యింద్రియము నా విషయములఁగూర్చి ప్రవర్తింపనీయకుండ నిగ్రహించి, బుద్ధిబలముచేత నా విషయకాంక్షారూపసంకల్పమును నిరోధించుటయే సంకల్పవర్జనక్రియకు సాధనమై యున్నది.

61. ఎవ్వనికి విషయకాంక్షారూపసంకల్పము కార్యరూపము దాల్చ కుండ నిగ్రహింపఁగల బుద్ధిబల మలవడుచున్నదో అట్టివానికిమాత్రమే మానసేంద్రియమును సకలవిషయవ్యపేతమును గావించుటకు సాధ్యమగు చున్నది.

*62. ఇట్లు, మానసేంద్రియమును సకలవిషయవ్యపేతముఁ గావించు టనే శాస్త్రము తపమని పేర్కొనుచున్నది.

---

* కం. తప మనఁగ సకలవిషయ
వ్యపేతమగునట్టి బుద్ధివైభవము సుమీ
తపమున సుస్థిరుఁడగు నృపో
గపరునకుం గలవె యొందు కర్తవ్యంబుల్.
— అరణ్య. 5 అ. 90.

3. ఆర్జవసత్యాహింస శమదమములను పురుషుం డలవఱుచుకొన్నను ద్రియముల నిగవ శేషముగ వశపఱుచుకొనుటకొఱకు పురుషునకు గాడ అవసరమైయున్నది.

4. మానసేంద్రియము అనేక జన్మార్జితవాసనావిశేషముచేతను, స్వభావముచేతను, బహిర్విషయములచే పెనవేసుకొని ప్రవర్తించు

5. అందువలన, పురుషుఁడు స్వభావముననే మానసేంద్రియములు చునట్లు వ్యవహరించుచుండును గాని స్వీయప్రజ్ఞ నుపయోగించి క్రమ న వ్యవహరింపఁగలుగుటలేదు.

తే.గీ. ఎల్లకష్టలకు వెలువడు నింద్రియముల
బాలపుత్రులఁ దండ్రియుఁబోలె నాఁగు
మఱియు మనమును నిశ్చలైకాగ్రభావ
మొందుటుత్తమతప మది యోజ్జ్వలాత్మ.
—శాం. 5 ఆ. 179

కం. అది ధర్మంబులకెల్లం
దుదియగు ధర్మంబు మనసుతో దానిఁదగం
గుదియించి మేధతోడం
గదియింపుము నియతిఁ బుత్ర కడుగాఢముగాన్.
—శాం. 5 ఆ. 180

తే.గీ. ఇంద్రియంబుల నాఁటింటి నిట్లు విషయ
ములకు నొలయక యుండఁగ నిలుకరించి
తలఁపు లడిగితేనియుఁ బ్రసాదమున నా సు
ఖంగిఁదృప్తుఁడనై యుండు పరముఁగాంతు.
—శాం. 5. 181

66. ఈ హేతువువలన, పురుషుఁడు మానసేంద్రియముల వశీకరించుకొని ఆత్మస్వాతంత్ర్యమును పరిరక్షించుకొనవలయుననిన అందులకు తగిన చిత్తస్థైర్య మవసరమైయున్నది.

67. బుద్ధి దృఢత్వమును బొందియుండినఁగాని చిత్తమును స్థిరముగావించుకొని మానసేంద్రియముల నదుపులో నుంచుకొనుటకు పురుషుఁడు సమర్థుఁడు గానేరఁడు.

68. అందువలన ఇంద్రియమనంబుల నదుపులోఁ బెట్టుకొనుటకొఱకు పురుషునకు బుద్ధిబలమును పోషించుకొనుట ప్రధాన కర్తవ్యమైయున్నది.

69. బుద్ధిబలమునకు వీర్యము ప్రధానమైయున్నందున బుద్ధిబలమును పోషించుకొనుటకొఱకు పురుషునకు వీర్యసంరక్షణ మవసరమైయున్నది.

70. వీర్యము రక్షింపఁబడదేని వీర్యవర్జితమగు బుద్ధి బలహీనమగుచున్నది.

71. బుద్ధిబలమును గోల్పోయిన పురుషుఁడు మానసేంద్రియముల వశీకరించుకొని వానిని అదుపులో పెట్టుకొనఁజాలఁడు.

72. అట్టివానికి ఇంద్రియమనంబులు సంచారభూములగు శబ్దాదుల యందు అడ్డువీడి ప్రవర్తించుచున్నవి.

73. ఆత్మస్వాతంత్ర్యమును గోరు పురుషుని ప్రయత్నమంతయు నింద్రియమనంబుల వశీకరించుకొనుటకొఱకే యగుటవలన ఆ యింద్రియమనంబుల వశీకరించుకొనుటకొఱకు వలయు బుద్ధిబలమును సమకూర్చుకొనుటకొఱకుగాను పురుషునకు బ్రహ్మచర్యపరిరక్షణము ముఖ్యకర్తవ్యమైయున్నది.

74. ఇట్లు ఆత్మస్వాతంత్ర్యము నుపలక్షించి ప్రవర్తించువానికి ఆర్జవసత్యాహింస శమదమతపంబులవలె బ్రహ్మచర్యముగూడ అవసరమై యున్నది.

75. ఈ ప్రకారమే, శాస్త్రప్రసిద్ధములైయున్న ధర్మములన్నియు మానసేంద్రియములను వశీకరించుకొని అదుపులో నుంచుకొనుటకొఱకు పురుషునకు తోడ్పడుచున్నందున ప్రతియొక్కనిచేతను ఈ శాస్త్రప్రసిద్ధ ధర్మములు అవశ్య మనుష్ఠింపవలసినవియై యున్నవి.

76. ధర్మములయం దేయొకదానికైనను పురుషుండు వ్యతిరేకముగ ంచెనేని, ఇంద్రియమనంబు లతనివశమునుండి తప్పి, అతనినే తమ గావించుకొనఁ గలుగుచున్నవి.

77. అందువలన, పురుషుండు తనకు ఇష్టమైన యేకొన్ని ధర్మ నియతముగ ననుష్ఠింపఁదలఁచినను, ఇంద్రియమనంబులు తన వశము తప్పిపోకుండ రక్షించుకొనుటకొఱకుగాను, ఏయొక ధర్మమునకైనను కముగ ప్రవర్తింపకుండ జాగ్రత్త వహింపవలసియున్నది.

78. పురుషునకు ధర్మాధర్మపరిజ్ఞానము లేనపుడు పురుషునిపై యమనంబుల పెత్తనమును దెచ్చిపెట్టఁగలవన్నియు అధర్మములని, ఆ పురుషునిపైఁగల మానసేంద్రియ ప్రాబల్యమును తుడిచివేయఁగల యు ధర్మములనియును గుఱుతుగ నుంచుకొనవలసియున్నది.

79. పురుషునకు శాస్త్రముచే నిర్ణయింపఁబడిన నియతధర్మములలో ు ముఖ్యమైనదిగ పేర్కొనఁబడినది.

80. అందువలన, ఆర్జవసత్యాహింస శమదమతపంబులవలె శౌచము పురుషుఁ డనుష్ఠింపవలసినదై యున్నది.

81. ఈశౌచము బాహ్యశౌచము, అంతశ్శౌచము అని ద్వివిధ ఁ బేర్కొనఁబడియున్నది.

82. మృత్తిక, జలము మున్నగువానిచే దేహమును శుద్ధిఁగావించు బాహ్యశౌచ మనఁబడుచున్నది.

*83. మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షాదిసద్భావనాపాటవముచేత ను రాగద్వేషవిముక్తముఁ గావించి శమసంపద నార్జించుకొనుట చమని చెప్పఁబడుచున్నది.

---

తే.గీ. బ్రహ్మచర్యంబు కంటెను బరము మద్య
మాంసములు రెండు నుడుగుట మనుజనాథ
లోకయాత్ర వాటించు చలోలుపతయు
శమము గల్గి వర్తించుట శౌచవిధము. —అను. 2 అ. 45

84. బాహ్యశౌచము:— నేను పరిశుద్ధుఁడ ననుభావమును హృదయమునఁ గలుగఁజేసి క్రమముగ దేహమునం దసహ్యభావమును బుట్టించి దేహసంబంధములగు విషయసుఖములనుండి మనస్సును మరలింపఁ దోడ్పడుచున్నది.

85. అంతశ్శౌచము:— హృదయమున శమసంపదను నెలకొల్పఁజేసి క్రమముగ మానసేంద్రియవశీకరణప్రయత్నమునఁ బురుషున కుపకరించుచున్నది.

86. అంతశ్శౌచములేని బాహ్యశౌచము నేనే పరిశుద్ధుండ ననుదేహాత్మసంబంధమగు దురభిమానమునకు అవకాశమును కల్పించి, పురుషుని అతని మానసేంద్రియములకు శాశ్వతముగ బద్ధుని గావించుచున్నది.

87. అందువలన వివేకియగువాఁడు బాహ్యశౌచముతోఁడ నంతశ్శౌచమునుగూడ నలవఱచుకొనవలసియున్నది.

88. ఎవ్వఁ డీప్రకారము ధర్మప్రాధాన్యమును గుర్తెఱిఁగి ప్రవర్తించుచున్నాఁడో, వాఁడు అవశీకృత మానసేంద్రియముల వశీకరించుకొని ఆత్మస్వాతంత్ర్యపరమావధిని జేరఁగలుగుచున్నాఁడు.

—♦ ధర్మప్రాధాన్య నిర్ణయము సమాప్తమ్ ♦—

శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడినది.

ఓం తత్సత్.

ఓం

శ్రీ రామాయనమః

# ధర్మప్రాశస్త్య నిర్ణయము

॥ ధర్మతత్త్వస్య ప్రాధాన్యం వివిచ్యాఽథ వివేకినః
ప్రాశస్త్యంత్తు ప్రవక్ష్యామి నత్వా మద్హృదయేశ్వరమ్.

1. మానవుం డెంత విజ్ఞానవంతుండైనను పరమేశ్వర కల్పితములును ...ఖములును, పాంచభౌతికములును, ఏకకాలమాత్రపరిమితజ్ఞానవంతము దృశ్యపదార్థవివేచనాపరిమితశక్తివంతములును, భ్రమప్రమాదాది సంయుతములును నగు మానసేంద్రియముల చేతమాత్రమే వ్యవహరింపం ...చున్నందున, త్రికాలాబాధ్యుండగు జీవుని యోగక్షేమరక్షణాసంబంధ వ్యవహారము నా మానసేంద్రియములచేం బరిష్కరింప నతనికి శక్యము

2. ఈ హేతువువలన ఏకకాలపరిమితపాంచభౌతికజ్ఞానమాత్రము మానసేంద్రియములను వ్యవహారసాధనములుగం గలిగియున్న పురు ...ఁ భూతభవిష్యద్వర్తమానకాలముల గుర్తెఱింగి తన యోగక్షేమరక్ష ...గుణముగ వ్యవహరింప సమర్థుండు గానేరండు.

3. అందువలన అంతములేని కాలప్రవాహమునంబడి పరితపించుచున్న ...ను తన భవిష్యత్క్షేమమునుగూర్చి వర్తమానకాలపరిమిత కించిత్ ...ముచేత నిర్ణయింపంబూనక తనకు తను మానసేంద్రియాబుద్ధుల నొసంగి ...ని వ్యవహారములయందు నియమించుచున్న సర్వశక్తిమంతుండును, సర్వ ...ను నగు నియామకు నాశ్రయించుటావశ్యకమై యున్నది.

4. సర్వజ్ఞుఁడును, సర్వశక్తిమంతుఁడును అగు పరమేశ్వరుని ఆదేశమునకు భిన్నముగ పురుషుండు వ్యవహరింపఁజాలఁడు.

5. అందువలన విషయమెఱుఁగనివాఁడు విషయ మెఱుఁగుటకును, కార్యార్థి యగువాఁడు కార్యసాఫల్యముకొఱకును, శక్తిమంతుఁడగు అన్య పురుషు నాశ్రయించునట్లు, వర్తమానకాలపరిమిత కించిత్ జ్ఞానవంతుఁడగు జీవుఁడు, భవిష్యద్వర్తమానకాలములో రెండింటియందును తన యోగక్షేమ రక్షణల నాసించి, సర్వజ్ఞుఁడును, సర్వశక్తిమంతుఁడును నగు పరమేశ్వరు నాశ్రయింపవలసియున్నది.

6. పరమేశ్వరుఁ డనన్యమగు నైకాంతికభక్తిచేఁగాని పురుషునకు వశుఁడై అనుగ్రహింపఁడు.

7. ఈ యనన్యభక్తి మానసేంద్రియముల శబ్దాదివిషయములనుండి మరల్చి వశీకరించుకొని, వానిని పరమేశ్వరునియందు పరవశముఁజేయువఱకును పురుషునకు సిద్ధింపదు.

*8. అందువలన అనన్యభక్తి నార్జించుకొనుటకొఱకు విషయప్రవృత్తములైయున్న మానసేంద్రియముల విషయనివృత్తములఁజేసి ఆత్మస్వాతంత్ర్యము నార్జించుకొనుట పురుషున కత్యంతావశ్యకమై యున్నది.

†9. ఏకాంతికధర్మమున కహింసమూలమనియు, తపము శమదమములు నవసరములనియు శాంతిపర్వమునఁ జెప్పఁబడియున్నది.

---

* కం. శాంతిపరినిష్ఠునకు నే
కాంతికధర్మంబు కరతలామలకమగుఁ
జింతాతంతుత్రుటనా
త్యంతవిదగ్ధంబు నూవె యది మనుజేంద్రా.

—శాం. 6 ఆ. 503

† కం. దాని కహింసయ మూలము
దానన హరిప్రీతుఁడగు నతండవ ధరణీ
జ్ఞానీ క్షేత్రజ్ఞుండనఁ
[illegible]

—శాం. 6 ఆ. [illegible]

*10. ఆర్జవములేని భక్తియు, భక్తిలేని ఆర్జవమును గలవారి హృద
ల నధివసింపనొల్లననెడి శ్రీకృష్ణవచనము వల్లను, భక్తికి ఆర్జవ
ాడ ఆవసరమని నిర్ణయింపఁబడుచున్నది.

11. వీని నన్నింటినిఁ బరికించినట్లయిన, ఐకాంతిక భక్తికి సత్యా
ాది ధర్మము లత్యంతావశ్యకములని అంగీకరింపవలసి యున్నది.

♦12. ఈ సందర్భమున సత్యముఁగూర్చిన ప్రస్తావన లేకున్నను,
ంసాప్రస్తావన యుండుటవలన సత్యాహింస లన్యోన్య సంరక్షకములని
ొనఁబడిన కర్ణపర్వవచనము ననుసరించి ఇచ్చోట సత్యమునుగూడ
ంపవలసియున్నది.

13. ఈ ప్రకారము పరమైకాంతికభక్తికి, సత్యాహింసాదిధర్మము
రములని నిర్వివాదముగ నంగీకరింపవలసియున్నది.

---

కం. ఈ సెలవులఁ దోఁచును హరి
నా నొక్కఁడ యింద్రియప్రతతి కందం డే
కానూనభక్తి కగపడు
జ్ఞానికిఁ దపమును శమంబు దమమును వలయున్.
—శాం. 6 ఆ. 502

* కం. భక్తియు నార్జవమును సం
యుక్తము లై యున్నయట్టి యుల్లంబున నా
సక్తి నిలుతు నిందొకఁడు వి
యుక్తంబైనను వసింప నుర్వీనాథా.
—శాం. 2 ఆ. 115

♦ కం. సత్యంబు నహింసయు నను
నత్యుత్తమధర్మయుగళమందు నహింసన్
సత్యము గాచుట ధర్మము
సత్యమున నహింసఁ గావఁ జనుచంద్రా బుధుల్.
—కర్ణ. 8 ఆ. 78 ప.

14. అటువలెనే ఆత్మస్వాతంత్ర్యపరమావధియగు స్వరూపావస్థితికి గూడ సత్యాహింసాది ధర్మము లవసరములని గ్రహింపవలసియున్నది.

15. పురుషునకు మానసేంద్రియములకంటె నన్యములగు వ్యవహార సాధనములు లేనందున నాతఁడు ఏ ప్రయత్నము చేయవలసియున్నను, మానసేంద్రియములపై నాధారపడవలసినవాఁడై యున్నాఁడు.

16. అందువలన ఆత్మస్వాతంత్ర్య పరమావధిఁ జేరు ప్రయత్నమున కైనను అతని కీ మానసేంద్రియములే సాధనములై యున్నవి.

17. ఆత్మస్వాతంత్ర్యపరమావధి యనఁబడు చిదాత్మ దృశ్య పదార్థ విలక్షణమగుటవలన దృశ్యపదార్థములఁగూర్చి ప్రవర్తించెడి మానసేంద్రియముల నా దృశ్యపదార్థములనుండి మరలించి, చిదాత్మయందుఁ జేర్చువఱకును పురుషుఁ డాత్మస్వాతంత్ర్య పరమావధిని జేరినట్లంగీకరింపఁ బడఁడు.

18. మానసేంద్రియములు తన వశమునఁ బ్రవర్తించుచుండినఁగాని పురుషుం డీ ప్రయత్నమునఁ గృతార్థుఁడు కాఁజాలఁడు.

19. సత్యాహింసాదిధర్మములు స్వభావసిద్ధములై యుండినఁగాని, పురుషున కీ మానసేంద్రియములు వశీకృతములై అతని నియోగానుసారము శబ్దాదివిషయవిరహితపదార్థమునందు నిలుకడను బొందనేరవు.

*20. ఆత్మస్వాతంత్ర్యపరమావధి యనఁబడు బ్రహ్మస్వరూపావ స్థానముఁ జేరుటకు ఆర్జవ మవసరమని శాస్త్రమున చెప్పఁబడినది.

* తే. వంకయైన తలంపెల్ల వసుమతీశ
యరయ మృత్యుపదంబగు నార్జవాన్వి
తంబు బ్రహ్మపదం బింత తథ్య మేల
యూఱటాల తలంపుల బీఱుకాఱు.

—ఆశ్వ. 1 ఆ. 108

*21. సత్యము, క్షమ, దమము అనునివి హృద్గ్రంధిభేదన ప్రాధము
ను; అహింస, ఇంద్రియజయము, నైరాశ్యము, అచపలత్వము అను
అంతరాత్మమహిమను కరతలామలకము గావించుననియును; సత్యము,
ము, శమము, దమము హృదయమున నెలకొనుట మోహాచ్యుతికి
మనియును; దమమువలన కామము, క్రోధము, లోభము, మత్సరము,
ు తొలఁగుననియును; బ్రహ్మస్వరూపము సన్నిహితమగుననియును;
వలన భయము, శోకము, మదము, హర్షము అనునివి నశించునని
శాంతిపర్వమునఁ జెప్పఁబడినది.

---

* కం. సత్యక్షమాదమంబులు
నిత్యపదంబునకు నెక్కు నిచ్చెన యవి సం
గత్యనుగతములు సత్సాం
గత్యం బటు గాన ముఖ్యకార్యము సుండీ.

—శాం. 5 ఆ. 556

ఆ. హింసలేక యునికి యింద్రియజయము నై
రాశ్య మచపలత్వ మను గుణములు
నాల్గు గలుగునట్టి నరునకుఁ గరతలా
మలక మంతరాత్మ మహిమయెల్ల.

—శాం. 6 ఆ. 315

కం. విను తెవు లుడుపఁగ భేషజ
మునకుం దలకొనినచందమున మది సత్యం
బును శౌచము శమమును దమ
మును నెలకొలుపంగవలయు మోహాచ్యుతికిన్.

—శాం. 4 ఆ. 286

కం. గుహయందు నిహిత మనియెడు
మహనీయబ్రహ్మపదము మహితదమత్వో
పహితుండగు వానికి స
న్నిహితంబని చెప్పుదురు మనీషిజనంబుల్.

—శాం. 3 ఆ. 409

*22. దానము, శమము, దమము, బ్రహ్మచర్యము, వ్రతపరిరక్షణము, దయ, పరధనదారవర్జనము, నియమము, ఇంద్రియనిగ్రహము, జననీజనక గురుజనపూజలు, దేవతాతిథిపితృదేవతార్చనములు, సత్యము, శౌచము, శుభసంవిధాననిరతి, ధైర్యము, క్రౌర్యనిరసనము నను వీనిఁ గలిగియున్న నరుఁడు వీని నూఁతఁగఁ గొని మోక్షమున కేఁగునని అనుశాసనీకమునఁ బ్రతిపాదింపఁబడియున్నది.

---

కం. శమముం గడచిన సద్ధ
ర్మము లేదని విందు నాశ్రమము లన్నిటికిన్
దమవంతుఁడు గామము క్రో
ధము లోభము మత్సరంబు దర్పము గెల్చున్.

—శాం. 3 ఆ. 407

కం. శమసంపద బ్రాహ్మణజ
న్మమునకు సామగ్ర్య మవ్వినయసారము చి
త్తమున కలవడ్డ మునికి భ
యము శోకము మదము హర్షమను నివి గలవే.

—శాం. 5 ఆ. 176

* సీ. కావున ముక్తికిఁ గారణంబగుదాని
నేర్పడఁ జెప్పెద నెఱిఁగికొనుము
దానంబు శమమును దమమును బ్రహ్మచ
ర్యంబును వ్రతపరిరక్షణంబు
దయయును బరధనదారవర్జనమును
నియమయ మేంద్రియనిగ్రహములు
జననీజనకగురుజనపూజలును దేవ
తాతిథిపితృదేవతార్చనములు
తే.గీ. సత్యమును శౌచమును శుభసంవిధాన
నిరతియును ధైర్యమును క్రౌర్యనిరసనమ్ముఁ
గలిమి పుణ్యస్థితిం బెడి గలుగు నరుఁడు
మొనయు దీని నూఁతఁగ గొని మోక్షమునకు.

—ఆశ్వ. 1 ఆ. 18

23. వీని నన్నింటినిఁ బరికించిన పురుషుఁ డాత్మస్వాతంత్ర్యపరమా
పొందుటకు సత్యాహింసాది ధర్మము లనుష్ఠింపవలసినవియై యున్నవని
గుచున్నది.

24. అందువలన మానవేంద్రియముల వశీకరించుకొనుటకొఱకు
భించినది మొదలు ఆత్మస్వాతంత్ర్య పరమావధినిఁ జేరువఱకును పురు
సత్యాహింసాది ధర్మములు అవశ్య మనుష్ఠింపవలసినవియై యున్నవి.

25. ఎవ్వఁడీప్రకారము ధర్మప్రాశస్త్యమును గ్రహించి ప్రవర్తింపఁ
చున్నాఁడో, వాఁ డవశ్యము ధర్మానుష్ఠానపరుఁడగుచున్నాఁడు.

—♦ ధర్మప్రాశస్త్య నిర్ణయము సమాప్తమ్ ♦—

శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడినది.

ఓం తత్సత్

ఓం

శ్రీ రామాయనమః

# ధర్మానుష్ఠానక్రమ నిర్ణయము

శ్లో॥ కథం ధర్మమనుష్ఠేయం కథం భోగేషువర్తయేత్
మయోచ్యతే వివిచ్యైవం ధర్మానుష్ఠాన నిర్ణయమ్.

1. విషయప్రవృత్తములై యున్న మానసేంద్రియములు విషయనివృత్తములగువఱకును నా మానసేంద్రియములనుండి రాగల ఆత్మస్వాతంత్ర్యాపహారణప్రమాదము పురుషునకు నివర్తింపదు.

2. విషయసంగ్రహణానుభవములే స్వేచ్ఛాప్రవృత్తములై యున్న మానసేంద్రియములకు లక్ష్యమగుటవలన నా మానసేంద్రియముల విషయసంగ్రహణానుభవములనుండి మరలింపఁ గలుగువఱకును వానిని విషయనివృత్తములఁ గావించుటకు పురుషునకు శక్యముగాదు.

3. కాంక్షాబద్ధములై విషయసంగ్రహణానుభవములయందుఁ బ్రవర్తించుచున్న మానసేంద్రియములను విషయకాంక్ష నివర్తించువఱకును మరల్ప శక్యముగాదు.

4. విషయసంగ్రహణానుభవములవలన విషయప్రవృత్తములై యున్న మానసేంద్రియములా విషయములకు వశములై యంతకంతకును అధికముగ వానియందుఁ బ్రవర్తించుచున్నందున విషయకాంక్ష నశించుటకు విషయసంగ్రహణానుభవములు సాధనములు కాఁజాలవు.

5. మానసేంద్రియముల విషయసంగ్రహణానుభవములనుండి బలాత్కారముగ నిరోధించినట్లయిన విషయకాంక్ష నశింపక నానాట బలపడి

సధర్మప్రవర్తనకు దారితీయఁగల విధమున నవి పరివర్తనముఁ జెందు

6. అందువలన విషయసంగ్రహణానుభవములనుండి మానసేంద్రియ
బలాత్కారముగ నిరోధింపఁగోరుట విషయకాంక్షను నశింపఁజేయు
మార్గము గా నేరదు.

7. ఈ హేతువువలన గంధరసాదివిషయకాంక్షనుండి విముక్తిఁ
గోరు పురుషుఁడు మానసేంద్రియముల బలాత్కారముగ నొక్క
నిరోధింపఁ బ్రయత్నింపక క్రమబద్ధము పరిమితమునగు నొక నిర్ణీత
క మెల్లమెల్లగ నిరోధింపవలసియున్నది.

8. మానసేంద్రియముల విషయసంగ్రహణానుభవములనుండి నిరో
సిన క్రమము నా పురుషుఁడే నిశ్చయించుకొనఁబూనెనేని అతఁడా
ంద్రియాభీష్టానుకూలముగ ప్రవర్తింపఁ గలుగును గాని వాస్తవిక
క్రమముతో వ్యవహరింపఁజాలఁడు.

9. అందువలనఁ బురుషున కీ విషయమున శాస్త్రకర్తలయొక్క
మే అనుసరణీయమై యున్నది.

10. పురుషుఁడు శాస్త్రచోదితక్రమమున విషయసంగ్రహణానుభవ
ండి మానసేంద్రియముల మరల్పఁగలిగెనేని స్వేచ్ఛాప్రవృత్తి అరి
డి క్రమముగ నా మానసేంద్రియములు పురుషునకు వశములై విషయ
గాహమునుండి విముక్తిఁ బొందఁగల యవకాశ మతని కేర్పడుచున్నది.

11. విషయసంగ్రహణానుభవములయందలి వ్యామోహమున కాధా
స్వేచ్ఛాప్రవృత్తినుండి మానసేంద్రియముల మరలించి శాస్త్రబద్ధముగ
రింపఁజేయుచున్నను నా మానసేంద్రియములకుఁ బురుషుని వశునిం
చెడి రాగము, ద్వేషము, మత్సరము మొదలగు దుష్ప్రభవర్తనముల
మానసేంద్రియముల మరల్చి సత్ప్రథమునఁ బ్రవర్తింపఁజేయుటకొఱకు
ప్రవకు సత్యశమదమాహింసాది.ధర్మము లనుష్ఠింపవలసినవై యున్నవి.

తీగలలుటకుఁ బెట్టఁబడిన అలుమండల వంటిది.

13. పందిరిపై కెగఁబ్రాకుటకు తీగ యల్లుమండ నుపయోగించునట్లు ఆత్మస్వాతంత్ర్య పరమావధియను పందిరిపైకి మానసేంద్రియములను తీగ నెగఁబ్రాకుటకు ధర్మములను అల్లుమండ నుపయోగింపఁబడుచున్నవి.

14. తీగ యొక అల్లుమండ నందుకొని దానిపై కెగఁబ్రాకి క్రమముగ దానికంటెను పందిరికి సమీపముగనున్న మఱియొక అల్లుమండ నందుకొనునట్లు ఆత్మస్వాతంత్ర్యపరమావధి నందుకొనఁగలవిధమున మానసేంద్రియముల మగల్పఁగల ధర్మములఁ గొన్నింటిని దొలుదొల్త పురుషుఁ డనుష్ఠించినను, వాని నూఁతగఁ గొని ముందునకు నడిపింపఁగల ధర్మముల మఱల నా పురుషుఁ డనుష్ఠింపవలసినవాఁడై యున్నాఁడు.

15. ఇట్లు క్రమానుగతములగు ధర్మముల ననుష్ఠించుటవలన పురుషుని మానసేంద్రియములు క్రమముగ నాత్మస్వాతంత్ర్యపరమావధిని జేరుకొని యతఁడు సర్వస్వతంత్రుఁడుగ వ్యవహరింపఁగలుగుచున్నాఁడు.

16. అనేకవిధములగు ధర్మముల ననేకవర్షము లనుష్ఠించుటచే నేర్పడిన మానసేంద్రియవశీకరణ మొకనాఁటి యొకానొక అధర్మప్రవర్తన వలన నశించుచున్నది.

17. అందువలన పురుషుం డెవ్విధముచేతనైనను అధర్మవర్తనుఁడు గాకుండ జాగ్రత్తగ వ్యవహరింపవలసియున్నది.

18. పురుషునకు మానసేంద్రియముల వశీకరించుకొనుట కెంత ప్రయత్న మవసరమో వశీకృతమానసేంద్రియములు అవశీకృతములు గాకుండ పరిరక్షించుకొనుటకుఁగూడ అంత ప్రయత్న మవసరమై యున్నది.

19. మానసేంద్రియములు నిశ్శేషముగ విషయనివృత్తములగువఱకును అవి స్వేచ్ఛాప్రవృత్తములు కాఁగల ప్రమాదము తొలఁగనందునఁ బురుషుఁడు విషయసంగ్రహణానుభవములయందు శాస్త్రబద్ధముగ వ్యవహరించుచున్నవాఁడైనను నిశ్శేష విషయపరిత్యాగమువఱకును జాగ్రత్తగ మెలఁగుట కగనై యున్నది.

20. ఎవని మానసేంద్రియములు విషయవిముక్తములగుచున్నవో అట్టివాఁడుమాత్రమే స్వతంత్రముగ నాలోచింప సమర్థుఁడగుచున్నాఁడు.

7. పురుషుఁడు మానసేంద్రియసుఖాపేక్షలఁ గలిగియున్నంతవఱకును మానసేంద్రియములు వశీకృతములు గానేరవు.

8. మానసేంద్రియములు వశీకరించుకొనఁబడువఱకును ఆత్మస్వాతంత్ర్య లభింపదు.

9. అందువలనఁ బురుషుఁ డేధర్మము ననుష్ఠించుచున్నను అది మానసములను వశీకృతములఁ గావించుకొనుటకొఱకుమాత్రమే యనుష్ఠింపఁ న్నదని గ్రహింపవలసియున్నది.

10. మానసేంద్రియములయం దేయొకటి అవశీకృతమైనను దాని దక్కినవిగూడఁ గ్రమముగ నవశీకృతము లగుచున్నవి.

11. ఈ హేతువువలనఁ బురుషుం డెన్ని ధర్మముల ననుష్ఠించు మానసేంద్రియములయం దేయొక్కటిగూడ నదుపునుండి తప్పి డ జాగ్రత్త వహింపవలసియున్నది.

12. ధర్మములు కామక్రోధాద్యరిషడ్వర్గనివృత్తిపూర్వకముగ మానయ వశీకరణమునకు సాధనములై యున్నందున ధర్మవిరుద్ధము న్నియు మానసేంద్రియము లవశీకృతములగుటకుఁ దోడ్పడుచున్నవని ంపవలసియున్నది.

13. మానసేంద్రియముల వశీకరించుకొనుటకొఱకును వశీకృతమానయములు అవశీకృతములు గాకుండ పరిరక్షించుకొనుటకొఱకును ఆర్జవము (2) అహింస (3) శమము (4) దమము (5) తపము సమత్వము (7) అమత్సరము (8) అనసూయ (9) అక్రోధము క్రౌర్యనిరసనము (11) కామలోభాదివర్జనము (12) తితిక్ష క్షమ (14) దురభిమానరాహిత్యము (15) అఖిలభూతదయ నిందాస్తుతిప్రవణతాత్యాగము (17) అపైశునత్వము (18) అమృషాణము (19) నిస్స్పృహా (20) ధృతి (21) సుశీలభావము (22) శౌచము (23) సుఖసంవిధాననిరతి (24) సాధుజనసంగమము [illegible] (26) పరధనదారగవర్జనము (27) జననీజనకగురు [illegible] (28) దేవతారాధనములు (29) వ్రతపరిరక్షణము

(30) అతులనియమము (31) అతివాదవర్జనము (32) విగతదైన్యత్వ వృత్తి (33) దానము (34) సద్ధత్యాగము (35) మౌనము (36) హ్రీః (37) అప్రమాదము (38) శౌచము (39) ఇంద్రియగ్రామజయము అను మొదలగు ధర్మములు పురుషుఁ డనుష్ఠింపవలసినవియై యున్నందున వీనిని ఏమఱుపాటునకైనను విడువకూడదు.

14. శాస్త్రధర్మముల నెఱిఁగినను యెఱుఁగకపోయినను దేని నాచరించిన మానసేంద్రియములు వశీకృతములగునో అది ధర్మమనియును, దేని ననుష్ఠించిన మానసేంద్రియము లవశీకృతములగునో అది యధర్మమనియును పురుషుఁడు జ్ఞప్తియందుంచుకొనవలసి యున్నది.

15. ఎవ్వఁ డీ ప్రకార మెఱిఁగి ధర్మానుష్ఠానపరుఁడగుచున్నాఁడో, వాఁడు ఆత్మస్వాతంత్ర్యానుభూతిని బొందఁగలుగుచున్నాఁడు.

శ్లో॥ యోశేషస్వాంతే నిగూఢస్సన్ ప్రచోదయతి యో ధియః
త మంతర్యామినం వందే రామాభిఖ్యం మమప్రియమ్.

— వివేకసార నిర్ణయము సమాప్తమ్ —

ధర్మతత్త్వవివేకము సమాప్తమ్

శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడినది.

ఓం తత్సత్

ఓం
శ్రీ రామాయనమః

# కర్మతత్త్వ వివేకము

## (ఉపోద్ఘాతము)

~~~:O:~~~

సత్యవిస్ఫూర్తి మిచ్ఛన్ తం ధీనేతారం విచింతయన్
కర్మతత్త్వం ప్రవక్ష్యామి గ్రంథేఽస్మిన్ తత్త్వదర్శనే.

*1. పురుషుని జయాపజయములకును మానావమానములకును [illegible]ణములకును ఆపత్సంపదలకును అతని పూర్వజన్మకర్మలే కారణ [illegible]మున్నవి.

[illegible]2. అందువలన కర్మతంత్రమునకు విరుద్ధముగ వీనియందు మార్పును [illegible]టకు పురుషుండు సమర్థుఁడు గానేరఁడు.

---

ఆ. కలిమిలేమి యనఁగ గలవొకరెండవి
యత్నగౌరవము వియత్నతయును
గలుగవచ్చునసూట గాదని నూ బేలఁ
దనము వినుము తెలియ ననిమిషేంద్ర.

—శాం. 4 ఆ. 372

కం. తేరకయుండఁగఁ జేరుం
దేరంగాఁ బోలియు విధియాధీనంబులు గా
కోరయ విత్తంబులు పురు
షారంభాయత్తములె మహాబుద్ధినిధీ.

—శాం. 4 ఆ. 373

తే.గీ. తపమునను బ్రహ్మచర్యవ్రతమున హితమి
తాశనమున రసాయనాభ్యాసమునను
~~~

*3. జీవుఁడు కర్మపరతంత్రుఁడగుటవలన పురుషుఁడు తనకు ఆపదలు, సంపదలు, జయము, అపజయము, రుజ, మరణము అను మొదలగునవి సంభవించినపుడు ఉబ్బు వగ మొదలైన చిత్తవికారములకు లోనగుట వివేకవంతమైన పనిగా నేరదు.

---

తెనఁగు నాయు వాక్రియల పై నరుఁడు ప్రీతి
గలుగుటయుఁ బూర్వభవకృతకర్మఫలము. —అను. 5 ఆ. 131

కం. తనలావున కధికమయిన
పనిసేయుట యుత్కటము నపథ్యమునగు భో
జనములు హరించు నాయువు
వనిత యవియుఁ బూర్వకర్మవశతన కలుగున్.
—అను. 5 ఆ. 133

* కం. పురుషుఁడు కర్మాధీనత
నరుగక తన వశము యనిన నాపదలు రుజల్
మరణంబును నివియేవియుఁ
బొరయక యుండంగ బ్రతుకఁబోలదె చెప్పమా. —అర. 5 ఆ. 69

కం. సమయంబైనను గుసుమఫ
లము లెట్టులు దోఁచు దరువు లందఱితోఁ గ
ర్మములం బొడముఁ సుఖ దుః
ఖము లట్టుల నిప్పు యత్నకలితోద్భూతిన్. —శాం. 4 ఆ. 77

కం. విను పూర్వకర్మఫలములు
దనకు వశముగాక పొందుఁ దఱితో వానిం
గని కొన నేరక పురుషుఁడు
దన కాపదయైన చోట దైవము దూఱున్. —అర. 5 ఆ. 65

కం. వినుము పురాతన జన్మం
బున జేసిన యట్టి కర్మముల ఫలములు ప్రా
జ్ఞునికైనఁ బొందు వానికి
మనుజేశ్వర మందు ధైర్యమహీనుయ సుమ్మీ. —శాం. 4 ఆ. 14

4. సర్వమును పూర్వకర్మానుగుణముగ జరుగుచున్నందున జరుగ
రిగియే తీరునను దృఢనిశ్చయము గలవానికి ఉబ్బు, వగ, సంపద
ను నిట్టి చిత్తవికారములు గలుగ నేరవు.

5. అందువలన ఏకాలమున కేది యెట్లు సంప్రాప్తమగునో నా
నట్లు దాని ననుభవించుచు నిర్లిప్తత నలవఱచుకొనుటయే చిత్త
మూలమై యున్నది.

. అందువలన చిత్తశాంతినిఁ గోరు ప్రతియొక్కరుఁడును కానున్నది
ప దనెడు దృఢనిశ్చయము నలవఱుచుకొని వ్యవహరించు టత్యంతా
యున్నది.

. పురుషున కే కాలమున కట్టివి సంభవించినను అవియన్నియు
షుని పూర్వజన్మకృతఫలము లగుటవలన 'కానున్నది కాక మాన'
ృఢనిశ్చయము కలుగుట కతనికి కర్మతత్త్వము చక్కగాఁ దెలియ
న్నది.

---

కం. ఇది నాకయ్యెం గాఁగల
యదియైనను గాఢ నిశ్చయం బెవ్వని నె
మ్మదిఁ గలుగు నుబ్బు వగ సం
పద యాపద గలుగవట్టి భవ్యున కింద్రా.

—శాం. 4 ఆ. 414

. వె. మేలుఁగీడును నరుఁ బొందుఁ గాలము లన
వశ్యమును వానిఁ గోరిన వచ్చుటయును
వినుము త్రోచినఁ బోవుటయును సురేంద్ర
కలదె వానికిఁ గావున వలదు చింత.

—శాం. 4 ఆ. 416

కం. కాలగతి గనుట శాంతికి
మూలంబై యంతరంగమున కౌత్మనుయు
త్వాలంబనంబు నిచ్చుఁ ద
దాప్తుండైన పురుషుఁ డవిక్షోభ్యుఁ డగుడా.

—శాం. 4 ఆ. 417

8. కర్మతత్త్వము చక్కఁగా తెలియఁబడువఱకును పురుషునకట్టి దృఢనిశ్చయము గలుగనేరదు.

9. ఇట్టి దృఢనిశ్చయము నలవఱుచుకొనినవాఁడుగాని ఆపదలయందు స్థైర్యమును వహించి ధర్మమార్గమునందు ముందంజ వేయఁజాలఁడు.

10. అందువలన పురుషుఁడు చెదరని చిత్తస్థైర్యమును బొంది ధర్మమార్గమునం దప్రమాదవృత్తితోఁ బ్రవర్తించుటకొఱకతనిచేఁ దెలియఁబడవలసిన కర్మతత్త్వవివేక మీతత్త్వదర్శనమునందు నాచేఁ జెప్పఁబడుచున్నది.

ఓం తత్సత్.

ఓం

శ్రీ రామాయనమః

# పురుష వ్యవహార హేతు నిర్ణయము

జగదంతస్థితం దేవం జానకీహృదయేశ్వరమ్
నమస్కృత్వాథ వక్ష్యామి వ్యవహారస్యకారణమ్.

పురుషునకు వ్యవహార నిర్వహణకొఱకు ధీమానసేంద్రియదేహ ...తములై యున్నవి.

ఈ ధీమానసేంద్రియదేహములచే నిర్వహింపఁబడు ప్రతి వ్యవ ...సను వలయు విషయములు తమంతనే బుద్ధియందు స్ఫురించు

ఏ విషయమైనను బుద్ధియందు స్ఫురించినపిమ్మటనే దానిని పురు... తెలిసికొనఁ గలుగుచున్నాఁడు.

విషయస్ఫురణమునకు పూర్వ మా విషయమునుగూర్చి పురుషున ...మును తెలియదు.

బుద్ధియందు స్ఫురించిన విషయము జ్ఞాతృత్వస్వభావముగల ...చే గ్రహింపఁబడఁగనే దానియొక్క ఉపయోగానుపయోగములు ...క్రమము నను మొదలగు విషయములు బుద్ధియందు విచారింపఁబడు

1. ఇదియే 'ఆలోచన' యను పేర వ్యవహరింపఁబడుచున్నది.

7. బుద్ధియందు స్ఫురించిన విషయమునుగూర్చి మనస్సునం దాలో ...డుచున్న దనిన బుద్ధియందు స్ఫురించిన విషయముయొక్క ఉప

యోగానుపయోగములు, నిర్వహణక్రమము అనువానిగూర్చి ఎఱుఁగ వలసిన విషయములన్నియు బుద్ధియందు స్ఫురించుచునుక వానికొఱకెదురు చూచుట మాత్రమేగాని వేఱొండు గానేరదు.

8. బుద్ధియందు స్ఫురణరూపమున నుదయించిన విషయమును వ్యవహారమునం దుంచుటవలన గలుగు ఉపయోగానుపయోగములు మొదలుగాఁ గల విషయములన్నియు మనస్సను భాగమున సంకల్ప వికల్పరూపమున స్ఫురించుచుండ నది మనస్సుయొక్క కార్యముగ నిశ్చయింపఁబడుచున్నది.

9. బుద్ధియందు స్ఫురించి మనస్సునందు విచారింపఁబడిన విషయమునుగూర్చి అంతిమనిర్ణయముఁ జేయవలసిన బాధ్యత బుద్ధిపైఁ బడుచున్నది.

10. అందువలన మనస్సునందు విచారింపఁబడిన విషయమునుగూర్చి చేయవలసిన తుది నిర్ణయమును బుద్ధియే చేయుచున్నది.

11. ఈ నిర్ణయమునుగూర్చిన స్ఫురణముగూడ తనంతనే బుద్ధియందు జనించుచున్నది.

12. ఇట్లు జరుగుచుండెడి మనోబుద్ధుల వ్యవహారములన్నింటియందును పురుషుఁడు కేవలము ద్రష్టగ మాత్రమే యున్నటుల స్పష్టమగుచున్నది.

13. వ్యవహారముగాని వ్యవహార నిర్వహణక్రమముగాని పురుషుని ప్రేరణమువలన జరుగుచున్నదని అంగీకరించినయెడల ఆ వ్యవహారమును వ్యవహారనిర్వహణక్రమమును బుద్ధియందు స్ఫురింపక పూర్వమే పురుషునకు తెలిసియుండవలసి యున్నది.

14. పురుషుఁడు తానెఱుఁగని విషయము నన్యులచే వ్యవహరింపఁ జేసినాఁడనిన నెవ్వరును అంగీకరింపరు.

15. బుద్ధియందు విషయము స్ఫురింపకపూర్వ మా విషయమును గూర్చి పురుషుఁ డెఱిఁగియున్నటుల సనుమానించుటకైనను ఆధారములు లేవు.

16. విషయ స్ఫురణమునకు పిమ్మటనే పురుషుఁడా విషయము గుచున్నటుల అనుభవమువలననే స్పష్టమగుచున్నది.

17. అందువలన తనకు తెలియని విషయమునుగూర్చి వ్యవహరింపఁటకొఱకు పురుషుఁడు బుద్ధిని ప్రేరించుచున్నాఁడని చెప్పుటయుఁ

18. ఈ హేతువువలన మనోబుద్ధుల వ్యవహారములకు పురుషప్రేర కారణమని చెప్పుట యుక్తముగాదు.

19. మనోబుద్ధులమీఁద పురుషుని పెత్తన మేమాత్రమును లేదని ఆ మనోబుద్ధుల వ్యవహారములుగ స్పష్టత్వమును బొందుచున్న సర్వ రములను తమంత తామే బుద్ధియందు స్ఫురించుచున్నవియును షుఁ డెఱుఁగవలసియున్నది.

20. బుద్ధియందలి విషయస్ఫురణము తనంతనే కలుగుచున్నందున యస్ఫురణమునకు బుద్ధి కారణమని చెప్పవచ్చునని నదియును దు.

21. బుద్ధి జడమగుటచే స్వతంత్రముగ వ్యవహరింపఁగల సామర్థ్యము ఁ గలదని చెప్పఁగూడదు.

22. అందువలన బుద్ధియందలి వ్యవహారవిషయస్ఫురణమునకు ప్రేర నొకానొక చేతను నంగీకరింపవలసియున్నది.

23. ఈ చేతనుని పురుషునిగ చెప్పుట కవకాశము లేనందున తనుఁడు పురుషునకంటె భిన్నమైనవాఁడుగాఁ బేర్కొనవలసినవాఁడై గ్నాఁడు.

24. పురుషునకు వ్యవహారసాధనములుగనున్న ధీమానసేంద్రియ ములు పురుషకల్పితములు గావనుట సర్వవాది సమ్మతమైయున్నది.

25. అందువలన ధీమానసేంద్రియదేహకల్పన కొక చేతనుని షునిగ నంగీకరింపవలయును.

26. ధీమానసేంద్రియకల్పనము నా ధీమానసేంద్రియములచేత వ్యవహరింపఁజేయుట యను నీ రెండుకార్యముల నిర్వహించువాఁడొక్కఁడే యని అంగీకరించుట యుక్తమై యున్నది.

27. ధీమానసేంద్రియదేహములు పురుషునకు వ్యవహారసాధనములుగ కల్పింపఁబడియున్నందున నాధీమానసేంద్రియములఁ బ్రేరించువాఁడే వానిచే వ్యవహరింపఁజేయవలసిన వ్యవహారములను గుర్తెఱిఁగి యుండవలసిన వాఁడై యున్నాఁడు.

28. అట్లు కానియెడల నాధీమానసేంద్రియదేహముల క్రమబద్ధములుగ వ్యవహరింప నాతఁడు నియమింపఁజాలఁడు.

29. ప్రపంచమును బరికించిన జీవుల వ్యవహారము లోక క్రమమునకు లోఁబడి జరుగుచున్నటుల స్పష్టమగుచున్నది.

30. జీవులను వ్యవహారములయందు నియమించువాఁడు సర్వజ్ఞుఁడుగను నియంతగను ఉండవలయుననుట నిర్వివాదమై యున్నది.

31. లేనిచో జీవులనందఱ నీ ప్రకారము క్రమబద్ధ వ్యవహారములయందు నియమింప నెవ్వఁడును సమర్థుఁడు కాఁజాలఁడు.

32. ఇట్టి నియామకశక్తియు సర్వజ్ఞత్వమును ధీమానసేంద్రియదేహములఁ గల్పించినవానియందుఁ దక్క తదన్యులగు జీవులయందున్నటులఁ గన్పట్టదు.

33. అందువలన ధీమానసేంద్రియదేహములఁ గల్పించుచున్న చేతనుఁడగు పరమేశ్వరుఁడే ఆ ధీమానసేంద్రియ దేహములను వ్యవహారములందుఁ గూడఁ బ్రేరించుచున్నాఁడని నిర్వివాదముగ నంగీకరింపవలసి యున్నది.

34. ఈ హేతువువలన బుద్ధియందలి విషయస్ఫురణమునకు నియంతయు సర్వజ్ఞుఁడునగు ఆ చేతనుఁడే ప్రేరకుఁడని అంగీకరింపవలసి యున్నది.

35. ప్రపంచమునఁ గల జీవరాసులన్నింటికిని ధీమానసేంద్రియదేహములును వ్యవహారములును గన్పట్టుచున్నందున పురుషునకువలెనే సర్వజీవులకును వ్యవహారవిషయస్ఫురణము వ్యవహార నిర్వహణక్రమనిర్ణయ రూప విషయస్ఫురణము అను నివియన్నియు సర్వజ్ఞుఁడగు నాచేతనుని ప్రేరణముచేతనే కలుగుచున్నవనిగూడ నిశ్చయింపవలసియున్నది.

36. జీవరాసులయొక్క ధీమానసేంద్రియదేహములయందును వ్యవహులయందును (ఎన్నియో విధముల) తరతమభేదములు గన్పట్టుచున్నంనివి యిట్లుండుటకుఁగూడ కారణ మూహింపవలసియున్నది.

37. సర్వజ్ఞులగు శాస్త్రకర్త లీ విషయమును చక్కఁగ విచారించి యందుఁ గన్పట్టు ఈ తరతమభేదముల కాయా జీవుల పూర్వజన్మకే కారణములని నిశ్చయించియున్నారు.

38. జీవులయొక్క ధీమానసేంద్రియ దేహములకును సుఖదుఃఖము ు అయా జీవుల పూర్వజన్మకర్మలే కారణములై యున్నవి.

39. పురుషుని పూర్వకర్మయొక్క ఫలము నా పురుషునిచే యనుభ జేయుటకునై వలయు వ్యవహారములకొఱకు నీ ధీమానసేంద్రియదేహ పరమేశ్వరునిచేఁ బ్రేరింపఁబడుచున్నవి.

40. పరమేశ్వరుని ప్రేరణము జీవుని పూర్వకర్మానుగుణముగ జరుగు ంగున నతని సర్వవ్యవహారములును పూర్వజన్మకర్మ సంజనితములేయని చుకొనవలసియున్నది.

41. అందువలన బుద్ధియం దేయే తలఁపు లుత్పన్నములగుచున్నవో ప్రకార మా బుద్ధి వ్యవహరించుచున్నదో దానికంతకును పురుషుని జన్మకర్మలే కారణములని గ్రహింపవలయును.

42. మనోబుద్ధ్యాత్మకమగు అంతఃకరణమున పూర్వకర్మప్రేరణము వ్యవహారము వ్యవహారక్రమమును నిర్ణయమును స్ఫురింపఁగనే దేహేంద్రి లా వ్యవహారము నంతఃకరణనిర్ణయానుసారముగ కార్యరూపము ంచుచున్నవి.

43. అందువలన పురుషుని వ్యవహారములకు నా పురుషుని పూర్వర్మలే కారణములని ప్రతియొక్కఁడును ఎఱుఁగవలయును.

44. ఎవ్వఁడే ప్రకార మెఱుఁగునో వాఁడు తన ధీమానసేంద్రియ హారములకు తన ప్రయత్నమే కారణమును మోహమును బొందును

—♦ పురుష వ్యవహార హేతు నిర్ణయము సమాప్తమ్ ♦—

శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడినది.

ఓం తత్సత్

ఓం

శ్రీ రామాయనమః

# పురుషప్రయత్నశబ్దార్థ నిర్ణయము

శ్లో॥ పురుషవ్యవహారస్య హేతు రాద్యో నిరూపితః
నిగద్యతే ప్రయత్నస్య శబ్దస్యార్థో వివేకినః॥

1. ప్రతి పురుషుఁడును 'నేను నే'నని, నే ననుశబ్దముచేత తన్ను నిర్దేశించుకొనుచుండుటవలన 'నే' నను శబ్దవాచ్యుఁడే పురుషుఁడని నిశ్చయింపఁబడుచున్నది.

2. ఈ 'నే'ననెడి శబ్దప్రయోగము దేహాదులయందుసైతము గన్పట్టుచున్నను అహంస్ఫురణోత్పత్తికి అంతఃకరణ సూక్ష్మభాగమగు అహంకారమే స్థానమైయున్నందున నీయహంస్ఫురణ సహితాహంకారమే పురుషశబ్దమున కన్వయింపఁదగిన యర్థమైయున్నది.

3. అహంశబ్దమునకు లక్ష్యార్థము చిదాత్మయే అయినను వ్యావహారికముగ కర్తృత్వ భోక్తృత్వాది ధర్మవిశిష్టమగు అహంకారమే అహంశబ్దార్థముగ నిశ్చయింపఁదగియున్నది.

4. అందువల్లనే పురుషశబ్దమునకు అహంస్ఫురణ రూపకమగు అహంకారమే చెప్పఁదగిన యర్థముగ నిశ్చయింపఁబడినది.

5. 'నేను నే'ననెడి అహంస్ఫురణతోఁగూడినదియును, కర్తృత్వ భోక్తృత్వాది ధర్మవిశిష్టమైనదియును, అహంకారవాచకమైనదియును అగు అంతఃకరణవృత్తి. ధీమానసేంద్రియ దేహాదులయందంతటను వ్యాపించుట వలన ధీమానసేంద్రియదేహాదులు అహంకారమువలెనే 'నేను నే'నని, అభిమానింపఁబడుచున్నవి.

6. అందువలన అహంకారము మొదలు దేహమువఱకుఁ గల సర్వ పదార్థములును లౌకికులచేత పురుషశబ్దార్థములుగఁ జెప్పఁబడుచున్నవి.

7. అంతఃకరణసూక్ష్మభాగముగు అహంకారమునందు 'నేను నే'నని
ంచుచున్న ఈ పురుషుఁడు చిత్ప్రతిబింబరూపుఁడగుటవలన పగమార్థ
దీ పురుషునకు చిదాత్మునవలెనే కర్తృత్వ భోక్తృత్వాదులుగాని
ఃఖములుగాని లేవు.

8. కేవలము జ్ఞాతృత్వ స్వభావముమాత్రమే కలిగియున్న పురు
ధీమానసేంద్రియ దేహాదులయందు దాత్మాభిమానముఁ జేసి ఆ ధీమాన
యదేహాదులయొక్క వ్యవహారముల తనవిగ నభిమానించుటవలన
ం కర్తృత్వ భోక్తృత్వాదులును, సుఖదుఃఖాదులును గలవానివలెఁ
ంచుచున్నాఁడు.

9. ఈ హేతువువల్లనే ధీమానసేంద్రియదేహాదులయొక్క వ్యవ
ములు పురుష వ్యవహారములుగఁ జెప్పఁబడుచున్నవి.

10. ఇవియే పురుషప్రయత్న శబ్దముచేతఁగూడ వ్యవహరింపఁబడు
వి.

11. ధీమానసేంద్రియ దేహములను వ్యవహారములయందుఁ బ్రేరించు
లోన్ముఖ పూర్వకర్మలుగాని పురుషుఁడు గాఁడు.

12. అందువలన ధీమానసేంద్రియ వ్యవహారములు పురుష
త్నశబ్దముచేతఁ బేర్కొనఁదగినవి గావు.

13. అజ్ఞుఁడీ ధీమానసేంద్రియ దేహములయొక్క వ్యవహారముల
వ్యవహారములుగ భ్రమించుచున్నను వివేకజ్ఞుఁడా ధీమానసేంద్రియ
రములఁ గర్మప్రేరణవలనఁ గలుగు వ్యవహారములుగ గ్రహించు
డు.

14. జ్ఞాతృత్వ స్వభావముగల పురుషునకీ ధీమానసేంద్రియదేహాదుల
వ్యవహారముల గ్రహించుటదక్క వానిని వ్యవహారములయందు
ంపఁగల సామర్థ్యములేదు.

15. ఎవ్వఁడీ ప్రకార మెఱుఁగునో వాఁడు ఫలోన్ముఖ పూర్వకర్మ
వలనఁ గలుగుచుండెడి ధీమానసేంద్రియ దేహాదులయొక్క వ్యవహార
పురుషప్రయత్న ఫలితములుగ భావింపఁడు.

—♦ పురుషప్రయత్నశబ్దార్థ నిర్ణయము సమాప్తము ♦—

శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడినది.

ఓం తత్సత్

ఓం

శ్రీ రామాయనమః

# వ్యవహారక్రమ నిర్ణయము

శ్లో॥ ధీనేత్రోన్మీలనం కర్తుం సమర్థం రామమాశ్రయక్
ధీమాన సేంద్రియాదీనాం వ్యవహారంవదామ్యహమ్.

1. సంకల్ప వికల్పములు, సంశయములు, నిశ్చయములు, 'నేను, నాది' యను నభిమానము అనునవియన్నియు మనోబుద్ధ్యాత్మకమగు అంతః కరణముయొక్క ధర్మములై యున్నవి.

2. అంతఃకరణము లేనప్పుడు వ్యవహారము లుండనందునను, అంతః కరణ మున్నపుడుమాత్రమే వ్యవహారము లుండుటవలనను సర్వవ్యవహారముల కును అంతఃకరణమే ఆధారమని నిశ్చయింపవలసియున్నది.

3. అంతఃకరణమున స్ఫురించెడి తలఁపులమీఁదనే ఆ యంతఃకరణ వ్యవహారము లాధారపడియున్నందున పురుషులయం దొక్కొకని వ్యవహార మొక్కొక్కరీతిగ నుండుటకు వానివాని అంతఃకరణములయందు స్ఫురించెడి తలఁపులభేదమే కారణమైయున్నది.

4. అంతఃకరణమున స్ఫురించెడి తలఁపులకా యంతఃకరణమును ప్రేరించెడి ఫలోన్ముఖకర్మలే కారణములై యున్నవి.

5. అందువలన నొక్కొకరి యంతఃకరణమునం దొక్కొక విధమగు తలఁపు లుదయించుటకా యా పురుషుల యంతఃకరణములఁ బ్రేరించెడి ఫలోన్ముఖపూర్వకర్మలయొక్క భేదమే కారణమైయున్నది.

6. ఫలోన్ముఖమైన పూర్వకర్మ మెప్పుడు అంతఃకరణమును బ్రేరించు చున్నదో అప్పుడా యంతఃకరణమున వ్యవహారస్ఫురణ మేర్పడుచున్నవి.

7. ఈ హేతువువలన అంతఃకరణమునం బుట్టెడి ప్రతియొక్క పును ఫలోన్ముఖ పూర్వకర్మయొక్క ప్రేరణమువలనఁ గలుగునట్టిదిగనే పురుషుఁడు గ్రహింపవలసియున్నది.

8. దేహేంద్రియము లంతఃకరణ వ్యవహారములను కార్యరూపము దించుట కొఱకొ యంతఃకరణవ్యవహారముల కనుగుణముగఁ బ్రవర్తించు మన వగుటవలన అంతఃకరణ వ్యవహారములవలెనే దేహేంద్రియ వ్యవ ములును పూర్వకర్మప్రేరితములైన వనియే యెఱుఁగవలయును.

9. ఇట్లగుటవలన పురుషుని ధీమానసేంద్రియాదుల వ్యవహారము యూ ఫలోన్ముఖ పూర్వకర్మప్రేరణమువలనఁ గలుగునవి యని నిశ్చయింప దగును.

10. అందువలన లౌకికులచే పురుషవ్యవహారములుగఁ గ్రహింపఁబడు వ్యవహారములును పూర్వకర్మప్రేరణమువలనఁ గలుగుచున్నట్టివనియే కియగువాఁడు గ్రహింపవలసియున్నది.

11. ఎవ్వఁ డీ ప్రకార మెఱుఁగునో వాఁడు నేనే వ్యవహర్తననెడు ంకృతికి చోటివ్వఁడు.

— ♦ వ్యవహారక్రమ నిర్ణయము సమాప్తము ♦ —

శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడినది.

ఓం తత్సత్

ఓం

శ్రీ రామాయనమః

# జగద్వ్యవహారహేతు నిర్ణయము

శ్లో॥ జగతః పరిణామస్యజ్ఞానం హేతూనవివేకినః
జగతః వ్యవహారస్య కారణం ప్రతిపద్యతే.

1. పురుషునకు ధీమానసేంద్రియదేహములు కల్పింపఁబడియున్నటుల ప్రపంచమునఁ గల జీవులందఱకును ధీమానసేంద్రియదేహములు కల్పింపఁబడియున్నవి.

2. పురుషునిచేఁ జేయఁబడు వ్యవహారములన్నియు ఆ పురుషుని ఫలోన్ముఖ కర్మలయొక్క ఫలంబులే యగునట్లు ప్రపంచమున జరుగుచుండు వ్యవహారములన్నియు జీవుల ఫలోన్ముఖకర్మలయొక్క ఫలంబులే యగుచున్నవి.

3. జీవసంఘమునం దెవ్విధమగు కర్మ మనుభోగ్యమైయున్నదో దాని కనుగుణముగనే ప్రపంచ వ్యవహారములు పరిణామమును బొందుచున్నవి.

4. అందువలన ప్రపంచ వ్యవహారములయందుఁ గలుగుచుండు పరిణామములకు జీవుల ఫలోన్ముఖ కర్మలే కారణములని అంగీకరింపవలసి యున్నది.

5. ఫలోన్ముఖకర్మ ప్రేరితులై వ్యవహరించెడి జీవులయం దేయొక్కఁడును స్వతంత్రుఁడుగామి, జగద్వ్యవహారములయందుఁ గలుగుచుండు మార్పులకే యొక్కఁడును బాధ్యతను వహింపఁజాలఁడు.

6. ప్రాక్తనకర్మఫలానుభవముకొఱకు ధీమానసేంద్రియదేహముల వ్యవహరించుచుండ 'నేను వ్యవహరించుచున్నా'నని అభిమానించెడు అజ్ఞ

వులయం దేయొక్కఁడును స్వతంత్రించి ఇతరుల కుపకారాపకార జేయ సమర్థుఁడు గానేరఁడు.

7. అందువలన జీవులయందలి శత్రుత్వ మిత్రత్వ భావముల కాయా ప్రాక్తనకర్మలే కారణములని నిశ్చయింపవలసియున్నది.

8. ఇట్లగుటవలన ప్రాక్తనకర్మజన్యములగు సుఖదుఃఖములయందు ం సంప్రాప్తమైనపుడు ఉబ్బును, దుఃఖ మనుభవింపవలసివచ్చినపుడు మును బొందక సమబుద్ధితో ననుభవింపఁగల వివేకయుతమైన దృష్టి నాఁడు పురుషునకు చిత్తశాంతి గలుగ నేరదు.

9. ఎవ్వఁడీ ప్రకార మెఱుఁగునో వాఁడు ఎప్పటి కేది యెట్లు కలసియున్నదో అప్పటి కది యట్లే జరిగితీరునని వివేకయుత వృఢబుద్ధిని వహించి జగద్వ్యవహార పరిణామములయొక్క అనుకూల్య కూల్యములయందు నిశ్చింతతో విధ్యుక్తధర్మమును నప్రమాదుఁడై ండఁ గలుగుచున్నాఁడు.

— ♦ జగద్వ్యవహారహేతు నిర్ణయము సమాప్తమ్ ♦ —

శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడినది.

ఓం తత్సత్

ఓం

శ్రీ రామాయనమః

# కర్మతత్త్వప్రయోజన నిర్ణయము

---

శ్లో॥ కర్మణోఽధ్యక్షమీశస్థం నమః కుర్వన్ మహేశ్వరమ్
వివేకిన మహం వక్ష్యే కర్మతత్త్వప్రయోజనమ్.

1. ఫలోన్ముఖపూర్వకర్మప్రేరణమునకు భిన్నముగ బుద్ధి వ్యవహరింపఁజాలనందునను, బుద్ధియొక్క నిర్ణయమునకు వ్యతిరేకముగ పురుషుఁడు ప్రవర్తింపఁజాలనందునను బుద్ధియొక్క నిర్ణయమే పురుషుని నిర్ణయమనియును అదియే ఫలోన్ముఖపూర్వకర్మప్రేరిత వ్యవహారనిర్ణయమనియును పురుషుఁడు గ్రహింపవలసియున్నది.

2. ఫలోన్ముఖపూర్వకర్మప్రేరణమునకు భిన్నముగ తనయొక్క బుద్ధి వ్యవహారము లుండఁజాలనట్లు ఆత్మేతరజీవులయొక్క బుద్ధివ్యవహారములును ఆయా జీవుల ఫలోన్ముఖపూర్వకర్మప్రేరణమునకు భిన్నముగ నుండఁజాలవు.

3. ఫలోన్ముఖములైన ప్రాక్తనకర్మలు పురుషుని ప్రేరించి ఫలము బొసఁగునట్లు అన్యులఁగూడఁ బ్రేరించి ఫలం బొసఁగుచున్నవి.

4. అందుచేత ఇతరులవలన తన కుపకారాపకారములు గలిగినపుడు ఆ యుపకారాపకారములకుఁ దనయొక్క ప్రాక్తనకర్మలే కారణములుగాని ఇతరులు గారనుట కర్మతత్త్వజ్ఞుని నిశ్చయమైయున్నది.

5. ఈ హేతువువలన అన్యునివలన తన కపకారము గలిగినపుడు ఆ యన్యుఁడు పూర్వకర్మప్రేరితుఁడై వ్యవహరింపఁగలవాఁడు మాత్రమేగాని

ను సామర్థ్యముగలవాఁడు కాఁడని యెఱింగియుండిన కర్మతత్త్వజ్ఞుఁడు ప్రకృతిఁ గావించినవానిఁగూర్చి వైరబుద్ధిని వహింపఁడు.

6. అటువలెనే తనయొక్క వ్యవహారమువలనఁగాని ఇతరుల వ్యవహారములవలనఁగాని, ఏ వ్యవహారమును లేకగాని, ఎవ్విధముచేతనైనను సంభవించెడి మానావమానములును, కలిమిలేములును, సుఖదుఃఖములును ప్రాక్తనకర్మఫలములుగాని, వేఱొండుగావని యెఱింగియుండిన తత్త్వజ్ఞుఁడు వీని ననుభవించునపుడు హర్షశోకముల నొందఁడు.

7. అందువలన కర్మతత్త్వజ్ఞునకు కోపము, ఉబ్బు, గర్వము, గోపుట, దురభిమానమునుఁ బొందుట అను మొదలగు అవివేకపూర్వక వ్యవహారములు గలుగనేరవు.

8. ఈ హేతువువలన నాతఁ డెట్టి వికారములకును లోనుగాక శాంతిని బొంది నిర్వర్తింపవలసిన ధర్మములనుమాత్రము విధ్యుక్తముగ నిర్వర్తింపఁగలుగుచున్నాఁడు.

9. ఎవ్వఁ డీప్రకార మెఱుఁగునో వాఁ డెన్ని యిక్కట్టులు ప్రాప్తమైనను చిత్తవికారములఁ బొందఁడు.

—♦ కర్మతత్త్వప్రయోజన నిర్ణయము సమాప్తమ్ ♦—

శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడినది.

ఓం తత్సత్

ఓం

శ్రీ రామాయనమః

# కర్మతత్త్వ హృదయము

కం. సమయంబైనను గుసుమ ఫ
లము లెట్టులు దోఁచుఁ దరువు లందరితోఁ గ
ర్మములం బొడమున్ సుఖదుః
ఖము లట్టుల నిష్ప్రియత్నకలితోద్భూతిన్.

—శాం. 4 ఆ. 77

కం. అనఘా! విధివిహితంబున్
దనచేఁతఁగఁ దలఁప ఫలము దగులు నహంకా
ర నిరూఢున - కనహంకా
రున కది లేమి ఫలయుక్తిఁ బ్రోవం జాలున్.

—శాం. 4 ఆ. 378

కం. విను విధికృత్యము లూరక
కనుఁగొనుచును సిద్ధ్యసిద్ధికల్పితసుఖదుః
ఖనిరూఢిఁ బొందకుండఁగ
మనముం దొలఁగించు వెరవు మహనీయ మగున్.

—శాం. 4 ఆ. 379

ఆ. భావములు నిజస్వభావంబునన తోఁచు
నడఁగు నట్లుగాన యస్థిరతకు
నెలవులని యెఱింగ నేర్చిన భావంబు
లందుఁ దగులు నెట్లు పొంద ననఘ! — శాం. 4 ఆ. 377

కం. ఆలును బిడ్డలు బంధులు
నైలీలఁ జరించుచును గృహస్థుఁడు దత్త
ల్లోలత్వరహితచిత్తత
మేలుగ నలవఱుపవలయు మీఁ దెఱిఁగి నృపా.
—శాం. 1 ఆ. 327

కం. విను సకలభూతముల వ
ర్తనములు గనునపుడు దవులఁబడక యొం
డును బరఁగి దివ్యబోధం
బున నలవడు నట్టి పెంపుఁ బొందు మనింద్యా.
—శాం. 2 ఆ. 124

తే.గీ. వినుము ప్రజ్ఞాధిరూఢుఁడై వనటదక్కి
సంస్కృతిక్లేశపరుల భూస్థలిఁ జరించు
వారి నచలమ్ముపైనున్న వాఁడు సూచు
నట్లు చూచుట సూవె నేర్పుమలహృదయ.
-శాం. 1 ఆ. 129

కం. సుత నీవు సుప్రసన్నా
త్మతఁబొంది నగాగ్రగతుఁడు మహీవాగలఁజూ
చు తెఱంగున నీ భూత
ప్రతతిం గనుగొను మనుండు పరితృప్తుఁడవై.
—శాం. 5 ఆ. 185

—♦ కర్మతత్త్వ హృదయము సమాప్తము ♦—

తత్త్వదర్శనమున ధర్మతత్త్వ కర్మతత్త్వవివేకములు
అను ప్రథమ భాగము సమాప్తము.

ఓం తత్సత్

/o/-



ఈ గ్రంథమును కూర్చిన చి॥ పాటూరు శ్రీనివాసయ్యగారితో నాకుఁ బరిచయ మేర్పడి యొకవత్సరము కానోపును. ఆనాఁడు వాటిల్లిన యొండు రెండు మాటలలోనే యీయన వినయము నాకుఁ బ్రస్ఫుటముగ గోచరమయ్యెను. క్రమముగా నీయన కేవలము వినీతుఁడేగాక విరక్తుఁడనియు గ్రహింపఁ గలిగితిని. నాఁటఁగోలె నెల్లూరికిఁ గార్యవశమున వచ్చినపుడెల్ల నీయన నన్నుఁ గలసికొనుచుండెడువాఁడు. ఒకపరి ఈయన స్వైరచిత్తమైన 'సహజనిష్ఠ' అను చిన్నపొత్తము నొండు నాకుఁదెచ్చి యిచ్చెను. దానిఁ బరిశీలింపుడు ఈయన కేవల 'పారోక్ష్యకథాభిధాయి' గాక తత్త్వము ననుభవమునకుఁ దెచ్చుకొనుచున్న ముముక్షువని నాబుదికిఁ బొడకట్టెను తత్త్వాభ్యాసపరునకుఁగాక యమానిత్వాదు లలవడునా? ఈ గ్రంథముద్రణ విషయమున నీయన ఉపేక్షకుఁ డగుటయు దీనిని అచ్చొత్తింప వలసిన దని శ్రీకొండూరు వెంకటరెడ్డిగారు నిర్బంధించుటయు నే నెఱుఁగుదును. శ్రీనివాసయ్యకు అపరిగ్రహమునందుఁ బట్టుదల. రెడ్డిగారికి ఉత్తమపాత్రము నందుఁ దనయీవి వినియోగింపవలయునని పట్టుదల. వీరి యిరువురచెలిమిచే నేను సుకృతినిగా భావించుకొనుచున్నాను.

2. తత్పద వాచ్యార్థ మెఱింగి తత్పరాయణుఁడైయున్న తత్త్వజిజ్ఞాసువునకే తత్పద లక్ష్యార్థ మెఱింగింప వలయుననుట విధి. ఇతరులు స్వబుద్ధిబలముచే తత్త్వము నెంత యవగతముచేసి కొన్నను, పరావర దర్శనము వడయనేరరు. అందువలననే వేదాంతములఁగూర్చి యెంతో నిపుణముగా నుపన్యసింపఁగల యంతర్వాణులును జ్ఞానోత్పత్తి ప్రతిబంధముల (ప్రారబ్ధవ్యతిరిక్తముల) నివర్తిల్లఁ జేసికొన నేరక నిర్విణ్ణు లగుచుందురు. ఏ నిర్వేదమును లేని ధన్యమ్మన్యుల మాట యిటనేటికి? తొలిపుటలోని 'శాస్త్రహృదయము' ఈ యుపపాదనముతోనే యారంభ మగుటచే నా అంతరంగము హర్షతరంగిత మగుచున్నది.

తత్త్వేఽర్హసత్తమ! నమః స్తుతి కర్మపూజాః
కర్మ స్మృతి శ్చరణయోః శ్రవణం కథాయాం
సంసేవయా త్వయి వినేతి షడంగయా కిం
భక్తిం జనః పరమహంసగతౌ లభేత॥

(విష్ణుభాగవతము 7-9-50)

నీ గృహాంగణభూమి నిటలంబు మోవంగ
మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని
నీ మంగళ స్తవ నికరవర్ణంబులు
పలుమారు నాలుకఁ బలుకఁడేని
నీ యధీనములుగా నిఖిల కృత్యంబులు
ప్రియభావమున సమర్పింపఁడేని
నీ పదాంబుజములు నిర్మల హృదయుఁడై
చింతించి మక్కువఁ జిక్కఁడేని

తే॥ నిన్నుఁ జెవులార వినఁడేని, నీకుసేవ
చేయ రాఁడేని బ్రహ్మంబుఁ జెందఁ గలఁడె?
యోగియైనఁ దపోవ్రత యోగియైన,
వేదియైన మహాతత్త్వ వేదియైన॥

(ఆంధ్రభాగవతము 7-367)

గ్రంథములోని తక్కువిషయములు పెద్దలకు విమర్శించి చెప్పుటకు నెంతవాఁడను? ఆ వాక్కు లన్నియు ప్రసిద్ధశ్రుతులకు ప్రతిధ్వనులు. శంకరులవారు నిశ్శంకముగ నుగ్గడించిన సిద్ధాంతములకు లఘుటీకలు.

3. గ్రంథకర్త 'పాటూరువారి ఖండ్రిక'వాస్తవ్యుఁడు. ద్రావిడుల తెగకుఁ జేరిన వైదికబ్రాహ్మణుఁడు. కాశ్యపుఁడు. ఇప్పు డీయన 'ముదివర్తిపాళెము' లోని ప్రాథమిక పాఠశాలలో సామాన్యోపాధ్యాయుఁడుగా నున్నాఁడు అన్నగారగు శ్రీరామకృష్ణుని వలననే యీయన బ్రహ్మోపదేశము వడసి నట్లు కానవచ్చుచున్నది. తనపేరు వ్రాసికొనుచోట నెల్ల 'శ్రీరామకృష్ణసోదరుఁడ'నని తన్ను నిర్దేశించుకొనుటవల్ల ఈయన గురుభక్తియు సువ్యక్తమగుచున్నది. ఈ వయస్తరుణునికి జ్ఞానవృద్ధునకు మహ్యాత్ స్పృహణీయ చరిత్రునకు సర్వాభీష్టముల నొడఁగూర్చుఁగావుత మని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

నెల్లూరు
24—6—1949

దుర్భా సుబ్రహ్మణ్య శర్మ



# ప ఠ ఖ



ంభీరమును దుర్విజ్ఞేయమును అగు శాస్త్రరహస్యార్థము నెఱుంగం
ుధాసంపత్తి లేని కించిద్జ్ఞుండనయ్యు మోక్షేచ్ఛ నన్నుం దీవ
ే నాపడసిన అల్పజ్ఞానమునైన ననుభవమునకుం దెచ్చుకోవలయునను
తో వ్యవహరించు కాలమున మద్గురుమూర్తియు సోదరుండునగు
ృష్ణుని కృపాతిశయము చేతను, హృదయనియామకుండగు శ్రీ సీతా
మ్రామునియొక్క ప్రేరణచేతను, కలిగిన అంతర్ముఖబుద్ధియందు
ంచిన సత్యాంశములనెల్ల సంగ్రహించి నే నీగ్రంథమును రచిం

ఈ గ్రంథ రచనా కాలమున నచ్చొత్తింప వలయునను తలంపు
వమైనను లేనందునను, నా హృదయము ను విస్మృతినుండి రక్షించు
కుపయోగపడిన చాలునను తలంపుతో దీనిరచన కుపక్రమించిన
ేగుటచేతను, ఈ గ్రంథమంతయు నాభావము నాకు సువ్యక్తమైన
ను ధోరణిలోనే నడిచినది.

1941 వ॥ సంవత్సరమున దైవికముగా నాకు పరిచితులైన ముదివర్తి
గ్రామ వాస్తవ్యులును, మాననీయులునగు శ్రీ కొండూరు వెంకటరెడ్డి
నాచే రచియింపంబడి యుండిన గ్రంథముల నవలోకించు సందర్భ
ంతటి వ్యయప్రయాసములకైన నోర్చి యీగ్రంథమును దీనితోపాటు
గంథములను, ముద్రింపించి ఆత్మజిజ్ఞాసాపరమగు పాఠకలోక
కందింప వలయునను తమ నిశ్చితాభిప్రాయమును నాతో వెల్లడించిరి.

కాని లోకకల్యాణము నపేక్షించి మహనీయులచే రచింపంబడి
ు, రచింపంబడుచున్నవియు, పాఠకుల హృదయము నాకర్షించి క్రమ
మున నడుపంగలవియు, నగు గ్రంథము లసంఖ్యాకములై తనరారు

చుండ 'నామట్టుకునాకే' యనుధోరణితో రచింపఁబడిన, నాయీ గ్రంథ మితరులకేమాత్ర ముపకరింపఁగలదో చెప్పసాధ్యము కాదనియు, అత్యధిక వ్యయప్రయాసములతో కూడిన ఇక్కార్యమునుండి విరమించుకొనుటయే మంచిదగునేమోయనియు. నాయభిప్రాయమును వారి కెఱింగించితిని. వారి హృదయ వైశాల్య మెట్టిదో కాని, ఒక్క ని కుపకరించినను నాయుద్యమము ఫలప్రదమైనట్లే యని, తమ యభిప్రాయమును వెల్లడించి, ముద్రణ కార్య నిర్వహణకై, నన్ను తొందరపెట్ట మొదలిడిరి. కొన్ని కారణముల చేత నేనే కాలయాపన చేయవలసినవాఁడ నైతిని

ఈ లోపల నాచే రచింపఁబడి యుండిన, 'రామకృష్ణహృదయాది, గ్రంథముల వారే ముద్రింపించి పాఠకుల కందఁజేసి పిమ్మట నీగ్రంథ ముద్ర ణమున కుద్యుక్తులైరి

ఇంతలో శ్రీవారి సోదరియు, కావలితాలూకా, సర్వాయపాళెంగ్రామ వాస్తవ్యులు శ్రీకేతిరెడ్డి శేషాద్రిరెడ్డిగారి మూఁడవ కోడలును శ్రీరామచంద్రా రెడ్డిగారి సహధర్మచారిణియు, నగు శ్రీ సౌభాగ్యవతి వజ్రావతమ్మగారు, తమ పితామహియు, కీర్తిరూపిణియునగు కమలాంబ స్మృత్యర్థ మీగ్రంథమును ముద్రింపింపఁ దలపెట్టినందున, శ్రీరెడ్డిగారు తమసోదరి యభీష్టముఁదీర్ప నియ్యకొని తనకు మారుగా తమసోదరియే ఇక్కార్యము నెరవేర్పఁగావు త మని తమయుద్యమమునుండి విరమించుకొని, ఇక్కార్యభారమును తమ సోదరిపై నిడినవారైరి. నా యీగ్రంథరచనోద్దేశము స్వకీయమన నానుకూల్యమే గాన, ఇందలివిషయము పాఠకుల కేమాత్ర ముపకరించునో పాఠకులే నిర్ణయింపఁగలరని ఆ విషయ మిచ్చట ప్రస్తావింపఁ దలఁచుకొన లేదు.

ఇది సాధకుల కేమాత్ర ముపకరించినను అదియంతయు శ్రీరెడ్డిగారి యొక్కయు వారిసోదరియొక్కయు ఉదారాశయఫలితమే.

గ్రంథము తా ముద్దేశించినంతగా లోకమున కుపకరింపక పోయినను
ల్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాతగచ్ఛతి' అనుభగవద్వాక్యము
వ ఈగ్రంథ ముద్రణకార్యమును నిర్వహించిన శ్రీవారిశ్రమము నిరర్థ
కుండ వారికి ఇతోధిక అమానిత్వాది గుణములును ఆయురారోగ్యై
భివృద్ధులును పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాత

ఈగ్రంథము ప్రేమతోఁబరిశీలించి ముద్రణమునకు యోగ్యముగా
ని నన్నుఁబ్రోత్సహించి యీకార్యము నెఱవేర్పించిన అద్వైత
ాయ మర్మజ్ఞులు 'అభినవతిక్క-నే'తి విశ్రుతులు బ్రహ్మశ్రీ దుర్భా
గ్మణ్యశర్మగారికి నేనెంతయు కృతజ్ఞుఁడను

వ_ర్తిపాళెం,
_6—1949.

పాటూరు శ్రీనివాసులు
(శ్రీరామకృష్ణ సోదరుఁడు)

ఓంతత్సత్



# శాస్త్రి హృదయమ్

శ్లో॥ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా

,, తమేవ శరణం గచ్ఛ సర్వభావేనభారత!
తత్ప్రసాదా త్పరాంశాంతిం స్థానం ప్రాప్యసి శాశ్వతం॥

,, కృతం పురుషకారేణ కేవలేనచ కర్మణా
మహేశానుగ్రహాదేవ ప్రాప్తవ్యం ప్రాప్యతే నరైః॥

,, ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా
మహాభయపరిత్రాణా ద్విప్రాణా ముపజాయతే॥

,, యావన్నానుగ్రహ స్సాక్షా జ్జాయతే పరమేశ్వరాత్
తావ న్నసద్గురుంకశ్చి త్సచ్ఛాస్త్రంవాపి నోలభేత్

,, తటస్థితా బోధయంతి గురవ శ్శ్రుతయో యథా
ప్రజ్ఞయైవ తరే ద్విద్వా నీశ్వరానుగృహీతయా॥

,, శ్రుత్వా తత్త్వమసీత్యేవం బోధ్యమానో ప్యనేకథా
నవిజానా త్యయంతత్త్వ మీశానుగ్రహవర్జితః॥

,, మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అథచే త్త్వమహంకారా న్నశ్రోష్యసి వినజ్ఞ్యసి॥

,, మయ్యేవ మనఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అతఊర్ధ్వం నసంశయః॥

,, సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

,, అనన్యా శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్

శాస్త్రిహృదయమ్-సమాప్తమ్. ఓంతత్సత్.

ఓం

శ్రీ రామాయనమః

# — ఇష్టదేవతా ధ్యానమ్ :—



కర్తా స్థితిచ విశ్వస్య నిత్యశ్శేషీ నియామకః
ఆస్తిక్యం దేహిమే రామ! నాస్తికై రవిచాలితం॥ 1

ఘువంశశ్రేష్ఠుఁడా! చేతనాచేతన ప్రపంచమును క్రమము దప్పకుండ నియమించు వాఁడును, కాలత్రయమందును. వినాశము లేని ం, అగు ఒకానొకఁడు ఈ ప్రపంచమునకు సృష్టికర్తగా నున్నాఁ ఆస్తిక్యబుద్ధిని నాస్తికులు చలింపఁజేయఁజాల నంత దృఢముగా ంగుము.

సర్వజ్ఞ స్సత్యసంకల్ప, స్సర్వేశో భగవానితి
ఆస్తిక్యం దేహిమే రామ! నాస్తికై రవిచాలితం॥ 2

॥ ఓ రాఘవా! సమస్తజీవుల హృదయవాసనల నెఱింగిన వాఁడును, ప్పమాత్రమున నెట్టి కార్యము నైన నెఱవేర్పఁగల వాఁడును, సర్వనియా డు నగువాఁడై భగవంతుఁడనెడి ఆస్తిక్య బుద్ధిని నాస్తికులు చలింపఁ ఁజాల నంత దృఢముగా నాకొసంగుము.

శ్లో॥ అస్తీతి బహుధారూపైర ప్యేకో దేవ స్సనాతనః
ఆస్తిక్యం దేహిమే రామ! నాస్తికై రవిచాలితం॥ 3

తా॥ ఓ దాశరథీ! సనాతనుఁడగు ఒక్క దేవుఁడే అనేక రూపములతో నున్నాఁడనెడి ఆస్తిక్యబుద్ధిని నాస్తికులు చలింపఁజేయఁజాల నంత స్థిరము గా నాకొసంగుము

శ్లో॥ సత్యకామస్య దేవస్య సంకల్ప ఇతి చాఖిలం,
ఆస్తిక్యం దేహిమే రామ! నాస్తికై రవిచాలితం॥ 4

తా॥ ఓ జానకీరమణా! తాను తలంచిన కార్యము నవిచ్ఛిన్నముగ నెఱవేర్పఁ గల వాఁడును, స్వయంప్రకాశ స్వరూపుండు నగు భగవంతుని సంకల్ప మాత్రమే ఈ చేతనా చేతన ప్రపంచమనెడి ఆస్తిక్యబుద్ధిని నాస్తికులు చలింపఁజేయఁజాలనంత సుదృఢముగా నాకొసంగుము.

శ్లో॥ జీవస్యహృదయే నిత్య మస్తీత్యేకో నియామకః
ఆస్తిక్యం దేహిమే రామ! నాస్తికై రవిచాలితం॥ 5

తా॥ ఓ రవివంశతిలకా! ప్రతిజీవియొక్క హృదయమందును నియామకుఁ డొకఁడు గలఁడనెడి ఆస్తిక్యబుద్ధిని నాస్తికులు చలింపఁజేయఁజాలనంత దృఢముగా నాకొసంగుము.

శ్లో॥ అంతర్యామి స్వరూపేణ చాస్తీతి జగదీశ్వరః
ఆస్తిక్యం దేహిమే రామ! నాస్తికై రవి చాలితం॥ 6

తా॥ ఓ కకుత్స్థకుల భూషణా! జగత్ప్రభుఁడగు పరమేశ్వరుఁడు వస్త్రమునందు దారపుఁజీలికవలె సర్వప్రపంచము లోపలను వ్యాపించి నియ

ౕడనెడి ఆస్తిక్యబుద్ధిని నాస్తికులు చలింపఁజేయఁజాలని ఘ
కొసంగుము.

శ్వస్యాంతః స్థితో యోసౌ త్వమేవేతి జగత్ప్రభుః
స్తిక్యం దేహి మే రామ! నాస్తికై రవిచాలితం॥

॥ ఓ కౌసల్యా తనయా! సర్వజగత్తునకు నెవఁడు లోపల
వాఁడె ఈజగత్పరిపాలకుఁడవగు నీవనెడి ఆస్తిక్యబుద్ధి నాస్తి
పఁజేయఁజాల నంత గట్టిగా నుండులాగున నాకొసంగుము

జగతః ప్రభు రీశానో నహ్యాస్తీతి త్వదన్యకః
ఆస్తిక్యం దేహి మే రామ! నాస్తికై రవిచాలితం॥ 8

॥ ఓ భరతాగ్రజా! జగత్ భర్తయగు నియామకుండు నీకంటె
లేఁడనెడి ఆస్తిక్యబుద్ధిని నాస్తికులు చలింపఁజేయరానంత దృఢ
కొసంగుము.

జ్ఞాతుంత్వాం విశ్వకర్తార మంతర్యామిన మీశ్వరం
ఆస్తిక్యం దేహి మే రామ! నాస్తికై రవిచాలితం॥ 9

॥ ఓ రామచంద్రా! నిన్ను సృష్టికర్తగను అంతర్యామి స్వరూపి
శ్వేశ్వరునిగను తెలిసికొనుట కవసరమగు ఆస్తిక్యబుద్ధిని నాస్తికులు
జేయఁజాల నంత దృఢముగా నాకొసఁగుము.

శ్లో॥ శ్రీనివాస ముఖోద్గీతం నాస్తికత్వ భయాపహం
ప్రముఖై రాస్తికై స్సేవ్య మిదం రఘుపతే స్తవం॥ 10

తా॥ ఉత్తములగు ఆస్తికులచే పఠింపఁదగినదియు నాస్తికభయమును పోఁగొట్టునదియు నగు ఈ రాఘవస్తవము శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁ బడినది

ఓం తత్సత్



అంతర్యామి నేనమః

# —: అంతర్యామి ధ్యానము —

చిత్పూర్ణ విశ్వమూర్తే ప్రత్యక్చైతన్యరూపపరమాత్మన్
హృత్పుష్కర మధ్యవర్తిన్ త్వాందర్శయ సపది మే ను
కంపార్థే॥

గా॥ స్వయంప్రకాశమగు స్వరూపజ్ఞానముచేత నిబిడీకృతమైయున్న మీ స్వరూపముగాఁ గలవాఁడా! సర్వ దృశ్యపదార్థములకు లోపల జ్ఞానస్వరూప పరమాత్ముఁడా! సమస్తజీవ హృదయాంతర్వర్తివైనవాఁడా! ఓ దయాసముద్రుఁడా! నీ స్వరూపసాక్షాత్కారమందే నాకాసంగుము.

అహమితి కృత్రిమరూపం విలసతి హృదయే స్వరూప
మపిధాయ
మయి పూర్ణకరుణయా తద్విఘటయ ఘటయ స్వరూప
విజ్ఞానం॥

తా॥ ఓ కరుణామయుఁడా! నన్ను నే నెఱుఁగకుండు లాగున హృదయమున నేనను పేరుతో కల్పితాత్మస్వరూప మొకటి ప్రకాశించు. కావున స్వరూపదర్శనార్థినగు నాయందు పరిపూర్ణకటాక్షము యాకృత్రిమాత్మస్వరూపమును నశింపఁజేసి నాకు స్వరూపజ్ఞానమును జేయుము

శ్లో॥ అంతర్యామిన్ హృదయం చలతిచ వ్యవహరతి తావకా
దేశాత్
నకదాచన నిజశక్త్యా లబ్ధ్యయ చేత స్వరూపసద్బోధే॥

తా॥ మణులయందు సూత్రమువలె సర్వభూతాంతర్యామివై ప్రకాశించెడి యోపరమేశ్వరుఁడా! సర్వ వ్యవహారముల కాధారమగు హృదయము నీయొక్క యాజ్ఞచేతనే చలించుచున్నది. నీవు శాసించిన ప్రకారము వ్యవహరించు చున్నది. స్వకీయమగు సామర్థ్యమున వ్యవహరించు నది కాదు కనుక నియామకుండవగు నీవు నా హృదయమును నే నర్థించెడి స్వరూపజ్ఞానమునఁ జేర్పుము.

శ్లో॥ భగవన్ యది ప్రసీదేః ఉదయతి హృదయే చిదాత్మ
బోధో దాక్
నశ్య త్యనాద్యవిద్యా దృశ్యం భాతిహి తవస్వరూపేణ॥

తా॥ ఓ భగవంతుఁడా! నీ వనుగ్రహించినట్లయిన తత్క్షణమే స్వరూపజ్ఞానము కలుగుచున్నది. అనాద్యజ్ఞానము నసించుచున్నది. [అజ్ఞానముచే నీకన్యముగఁ జూడఁ బడుచుండిన] దృశ్యప్రపంచమంతయు నీ స్వరూపముగనే ప్రకాశించుచున్నది.

శ్లో॥ కరుణా ప్రపూర్ణమూర్తే విశ్వస్యాంతః ప్రవిష్టశాస్తృత్వే
హృద్గహ్వరస్థితాత్మన్ మయి పూర్ణసుఖే నిమజ్జయ స్వాంతం॥

తా॥ ఈ దృశ్యమానమగు ప్రపంచమును జీవకర్మానుగుణముగ నియమించుటకయి జగత్తులోపల ప్రవేశించిన వాఁడా! నాయొక్క హృద

ి గుహయందు సూత్రాత్మస్వరూపముతో నున్నవాఁడా! ఓ దయా
రా! పరిపూర్ణమైన నాస్వరూప సుఖమున నాహ్లాదయమును
ు చేయుము,

అంతర్యామిధ్యానమ్ భవసాగరమగ్న తారణే ...కా
పంచక మార్యగీతేః విరచిత మేతద్ధి శ్రీనివాసేన॥

తా॥ [బంధమునుగాని మోక్షమునుగాని పొందుటకు నెవని శాస
రణమో] ఆ యంతర్యామిని గూర్చి ఆర్యావృత్త పంచకముచేతఁ
ిన యీధ్యానము సంసారసముద్రమున మునిఁగియున్న వారికి
కు నావవలె నుపయోగపడుచున్నది. ఇది శ్రీనివాసునిచే రచింపఁ

అంతర్యామి ధ్యానము
సమాప్తము
ఓంతత్సత్



ఓం

శ్రీరామాయనమః

# —:తత్త్వదర్శనము:—



శ్లో॥ ఈశతత్త్వాత్మతత్త్వేతి వివేకద్వయపూరితః
తత్త్వదర్శన గ్రంథోయ ముచ్యతే చాధికారిణాం ॥

1 బ్రహ్మ మొదలు చీమవఱకుఁగల సర్వప్రాణులును సుఖప్రాప్తి దుఃఖనివృత్తుల కొఱకు ప్రయత్నించుట స్వాభావికమై యున్నది

2 ఈ సుఖప్రాప్తి దుఃఖనివృత్తు లాత్మజ్ఞానోదయ మగువంత దనుక సంభవింపవని శ్రుతిసహస్రములు ప్రతిపాదించుచున్నవి

3 ఆత్మజ్ఞానమున కజ్ఞాననాశ మొక్కటి మాత్రమే యపేక్షణీయ మైయున్నది

4 అజ్ఞాననాశనమునకు ఆత్మస్వరూప విచారము సాధనమై యున్నది.

5 అయినను విచారమాత్రమున నశింపఁగల అజ్ఞానము మాత్రమే మిగిలియున్న వాని యందు ఆత్మస్వరూపవిచారము సార్థక మగుచున్నది

6 అజ్ఞాన శేషమాత్రుఁ డగువాఁడు సాధనచతుష్టయ సంపన్నుఁ డనఁబడును

[2]

7 సాధనచతుష్టయసంపత్తి; స్వవర్ణాశ్రమ ధర్మానుష్ఠానము చేయను
కీర్తను పరమేశ్వరుని సంతుష్టిపఱుచుట చేతనుకలుగునని శ్రీశంకరుల
ము

8 యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
త్రి పరమేశ్వర ప్రీతికొఱకు• చేయఁబడని ప్రతికర్మయు బంధ
ని చెప్పుచున్నది

9 అందువలన బంధవిముక్తికొఱకు చేయఁబడు ప్రతికర్మయు పర
విషయమైనదిగ నుండి తీఱవలయును

10 వర్ణాశ్రమ ధర్మములును తపస్సును, పరమేశ్వరునితోడి సం
కలిగియుండుటవలననే, పరమేశ్వర సంతుష్టికొఱకు ప్రత్యేకముగ
డు క్రియవలె సాధనసంపత్తికి హేతువులుగా పేర్కొనఁబడియున్నవి

11 జీవులను బంధమోక్షములయందు నియమించువాఁ డంతర్యా
పరమేశ్వరుఁ డగుటవలన ఆయన యనుగ్రహము నార్జించుట మూల
మానవుఁడు బంధవిముక్తిని బొందవలసినవాఁడై యున్నాఁడు

12 పరమేశ్వరానుగ్రహము లేనివాఁడు తత్త్వమసి వాక్యార్థ
గార్లు బోధింపఁ బడినవాఁడైనను ఆత్మజ్ఞానమును పొందఁజాలఁడు

13 ఆత్మజ్ఞానాధికారి యనఁబడు వానియందున్న సాధనసం
రమేశ్వరు నుద్దేశించి చేయఁబడిన క్రియలవలన కలిగినదగుటచే
్వరానుగ్రహ జన్యమని గ్రహింపవలయును

14 అందువలన పరమేశ్వరానుగ్రహము నార్జించినవాఁడుమాత్రమే
నాధికారి యగుచున్నాఁడని అంగీకరింపవలసియున్నది

15 పరమేశ్వరానుగ్రహము నార్జింపనివాఁడు స్వతంత్రముగా
ప్రయత్నించినను బంధవిముక్తుఁడు కాఁజాలఁడు

16 'తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః' అను శ్రుతి జీవుఁడు జగత్తునందు మాయచే బంధింపఁబడి యున్నాఁడని చెప్పుచున్నది

17 'దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా' అను భగవద్వాక్యము మాయ అతిక్రమింపరానిదని చెప్పుచున్నది

18 అట్లయిన మాయాబద్ధుఁడగు జీవుఁడు మాయనెట్లు తరింపఁ గలఁడు అను సంశయము పొడమకుండుటకై ఆ భగవంతుఁడే 'మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరన్తి తే' అనువాక్యమువలన మాయను స్వాధీనమున నుంచుకొనిన తన్ను నాశ్రయించినవారే మాయను తరించుచున్నారని చెప్పియున్నాఁడు

19 ఈ సందర్భము పరికించినను మానవుఁడు బంధవిముక్తికై పరమేశ్వరు నాశ్రయింప వలయుననియే స్పష్టమగుచున్నది

20 అందువలన మాయాబద్ధులగు మానవులలో ప్రతియొక్కఁడు పరమేశ్వరు నాశ్రయింప వలసియున్నది

21 పరమేశ్వరు నాశ్రయింపనివానికి మాయామోహ వశుఁడై యున్నందున, 'నేను బద్ధుఁడను బంధవిముక్తిం బొందవలయును' అనెడి వివేకము కూడ నుండదు

22 అజ్ఞుఁడు మాయాబద్ధుఁడు నగు జీవుఁడు తనయొక్క పరమార్థస్వరూపము నెఱుఁగనట్లే సర్వజగత్సృష్టికర్తయగు పరమేశ్వరుని గూడ నెఱుఁగఁడు

23 ఇట్లని 'త్రిభిర్గుణమయైర్భావైరేభిస్సర్వమిదంజగత్ మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయం' 'నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః మాయయా పహృతజ్ఞానా ఆసురంభావమాశ్రితాః' అను భగవద్వాక్యము వినఁబడుచున్నది

4 అందువలన మాయా బంధ విముక్తికై పరమేశ్వరు నాశ్రయి ప
వులకు పరమేశ్వరతత్త్వము తెలియవలసియున్నది

5 పరమేశ్వరుని అస్తిత్వమే యెఱుంగనివా రాపరమేశ్వరు
యింపఁగలరు?

6 మానవుఁడు పరమేశ్వరతత్త్వమును చక్కఁగా గ్రహించిన
ఐస్తికుఁడై పరమేశ్వరాశ్రయమును పొందుచున్నాఁడు

7 పరమేశ్వరాశ్రయమును పొందినమానవుఁడు ఎప్పుడు పరమేశ్వ
గామును పొందుచున్నాఁడో అప్పుడు మాయామోహమునుండి
ొంది వివేకవంతుఁడై సాధనచతుష్టయ సంపన్నుఁ డనఁబడు

3 సాధనచతుష్టయ సంపన్నునకు మోహ ముపశమించిన పిమ్మట
నొక్క అజ్ఞానముమాత్రమే యగుటవలన ఈ యజ్ఞాననివృత్తి
త్మవిచారము మాత్రమే చేయవలసియున్నది

) అందువలన సాధనచతుష్టయసంపన్నునకు అజ్ఞాననివృత్తి
త్మతత్త్వము తెలియవలసియున్నది

) మాయామోహ నివృత్తిపూర్వకముగా హృదయమును భవబంధ
ందు నియమింపఁగల పరమేశ్వరు నాశ్రయించుటకై 'ఈశతత్త్వ'
ం, ఆత్మజ్ఞానాధికారమును పొందిన పిమ్మట అజ్ఞాననాశమునకై
) వివేకమును, తెలియవలసి యున్నందున వీనిరెంటిని సంగ్రహించి
నమును ఈ గ్రంథము నాచేఁజేయఁబడుచున్నది

---

శ్రీ రామాయనమః

# ఈశతత్త్వ వివేకము.

శ్లో॥ ప్రణమ్య జగదాధారం విశ్వాకారం నియామకం ।
ఈశతత్త్వ వివేకోయ మాస్తికేభ్యో విధీయతే ॥

1. అచింత్యరచనా స్వరూపమును, చేతనాచేతనాత్మకము నగు నీ ప్రపంచమునకు కర్తయొకఁ డుండితీఱును.

2. కర్తలేని కార్య మంగీకరింపఁ బడదు.

3 స్వభావముగనే భూతములనుండి జగత్కల్పనము జరుగునని యును కర్త నంగీకరింపఁ బనిలేదనియును జెప్పుట సరిగాదు

4 ప్రపంచమున పరస్పరవిరుద్ధములగు నుత్పత్తిలయములు రెండును గనఁబడుచున్నందున ఉత్పత్తి స్వభావజన్యమనిన లయమును స్వభావజన్య మనియే యంగీకరింపవలయును

5 ఒక వస్తువునందు పరస్పర విరుద్ధములగు రెండు ధర్మములు స్వభావముగ నుండుననుట సంభవింపదు

6 అందువలన నీ యుత్పత్తిలయములకు గారణముగ నొకచేతను నంగీకరించి తీరవలయును

7 జగత్కల్పనాసామర్థ్యము స్వభావమునకేగలదేని ఎచ్చటెచ్చట పృథివ్యాదులు గలవో అచ్చటచ్చట సృష్టి జరుగుచుండవలయును

8 ఈప్రకార మెందువలన జరుగుచుండుటలేదో అందువలన సృష్టి రచనాసామర్థ్యము జడములగు భూతములయందు స్వాభావముగఁ గలదని అంగీకరింపఁదగదు

) సృష్టిస్వభావము భూతములయందుఁ గలదేని బీజములతో పని
కార్యరూపములగు వృక్షాదులు జనించుచుండవలయును

10 అనంతములగు జాతులును ఒక్కొక్క జాతియం దనంతభేద
గల యీసృష్టియందు ప్రతియొక్కటియు తన జన్మమునకు
క్క కారణబీజమును కలిగియుండుట ప్రత్యక్షసిద్ధమైయున్నది

11 సృష్టిసామర్థ్యము భూతములయందు స్వభావసిద్ధమై యుండె
రణబీజములతో పనియుండదు

12 కారణబీజములు లేకయే భూతములనుండి స్వయముగా
సంభవించినట్లు తెలియఁబడనందున జగత్కల్పనకు భూతముల స్వ
) కారణమనుట యుక్తమైయుండదు

13 కొన్నింటియందు మాత్రము జన్మహేతువులగు బీజములం
క్షముగ గోచరింపకున్నను అన్నిటికిని కారణబీజములు సిద్ధమైయుండఁ
న్నిటికిమాత్రము లేకపోవు అను అనుమానముచే కారణబీజములు
నిశ్చయింపవలయును

14 భూతములనుండి సృష్టి రచనాబీజములు స్వభావముగ జనిం
ను ఆ బీజములనుండి కార్యరూప జగ ముత్పన్నమగుననియుఁ
సరిగాదు

15 జడములగు భూతములయందు కారణబీజముల నుత్పత్తి సేయు
ర్థ్యము స్వభావముగఁ గలదేని ఇప్పుడును పృథివ్యాదులనుండి బీజము
న్నమగుచుండ వలయును

16 అట్లు జరుగుచుండెనేని వృక్షాదులనుండి బీజము లుత్పన్నము
సేన యక్కఱయుండదు

17 బీజములనుండి యేర్పడిన కార్యరూప వృక్షాదికమునుండి
బీజాదిక ముత్పన్నమగుచుండుటయు, ఆ బీజములనుండియే వృక్షాది

కము జనించుచుండుటయు ప్రత్యక్షసిద్ధమై యుండుటచేతను పృథివ్యాదుల నుండి స్వయముగా బీజము లుత్పన్నమై యాబీజములనుండి వృక్షాదికము జనించుచుండినటుల ఎఱుఁగఁబడనందునను, భూతములయందు బీజముల నుత్పత్తిచేయు స్వభావము గలదని అంగీకరించుట కవకాశము లేదు

18 అట్టిస్వభావ మొకప్పుడుండెననియు, ప్రస్తుతము లేదనియుఁ జెప్పుట సరిగాదు

19 నిత్యమగు పదార్థమున కనిత్యమగు ధర్మము కలదనరాదు

20 పృథివ్యాదుల కనిత్యత్వము నంగీకరించిన వానికి జగత్కారణత్వము చెప్పుటకే యవకాశము లేదు

21 అట్లుగాక నిత్యమగు పదార్థమం దనిత్యమగు ధర్మ ముండ నగునని అంగీకరించినను పృథివ్యాదు లెప్పుడు తమస్వభావమును విడుచునో అంతకుపూర్వ మఁత్పన్నమైన బీజములనుండి కార్యరూప జగ మ్ముత్పన్నమై యంతతో సృష్టి ముగియవలసి యుండును

22 అట్లు జరిగినట్లు ఎందువలనఁగనఁబడలేదో అందువల్ల బీజముల నుత్పత్తిసేయు సామర్థ్య మొకప్పుడుండి ప్రస్తుతము లేదనుటగూడ అంగీకరింపఁదగినది కాదు

23 బండిచక్రమువలె బీజమునుండి కార్యము కార్యమునుండి బీజము సృజింపఁబడుట యనుభ్రమణము ప్రత్యక్షసిద్ధమై నియమముగ జరుగుచున్నందున ఇట్టినియమము నేర్పఱిచినకర్త నొకని నంగీకరించి తీరవలయును

24 అనంతభేద యుక్తములగు సృష్టివిశేషములను కారణబీజములను సృష్టినియమమును కల్పించుటకు చేతనుఁడు సర్వజ్ఞుఁడు నగునట్టివానికి మాత్రమే సాధ్యమై యున్నందున సృష్టికర్త చేతనుఁడును సర్వజ్ఞత్వము గలవాఁడునై యుండవలయునని అంగీకరింపవలయును

25 సృష్టిస్థితిలయ సామర్థ్యము భూతములయందు స్వభావసిద్ధమని వగియుండనందున భూతముల స్వభావమే జగత్కారణ [నిమిత్త] మనుట నిరాకరింపఁదగినది

26 'స ఈక్షత లోకాన్నుసృజా ఇతి' 'ఇదగ్ం సర్వ మసృజత' శ్రుతులును సృష్టికర్త నొకనిని నిర్దేశించుటచేత జగత్కల్పనాకర్త పరమేశ్వరుఁ డొకఁడు గలఁడని నిశ్చయింపవలయును

27 ఎవ్వఁడీప్రకార మెఱుఁగునో వాఁడు నాస్తికమతావలంబకులఁ జిక్కువడఁడు

ఆస్తికత్వనిర్ణయము
సమాప్తము

ఇది
శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచింపఁబడినది
ఓంతత్సత్



శ్రీరామాయనమః

# ఈశతత్త్వవివేకము

## జగత్కారణనిర్ణయము

శ్లో॥ ఆస్తికత్వం నిరూప్యాథ విశ్వకారణనిర్ణయః
ప్రోచ్యతే జానకీనాథం నత్వా మంగళదాయకమ్॥

1 ఏది కార్యమో దానికి కారణముండితీరును

2 అందువల్ల జగంబునకుఁగూడ కారణము మూహింపఁదగి యున్నది

3 కేవలము నిమిత్తకారణమువల్లఁగాని ఉపాదాన కారణమువల్లఁ గాని కార్యము కలుగనేరదు

4 ఆహేతువువల్ల ప్రపంచమునకు నిమిత్తకారణము నిర్ణయింపఁబడియున్నను ఉపాదాన కారణము నిర్ణయింపవలసి యున్నది

5 ఉత్పత్తివినాశముగల పదార్థమును కార్యవర్గములోని దానినిగ నిర్ణయింపవలయును

6 అందువల్ల కారణపదార్థమునకు ఉత్పత్తివినాశములు నిషేధింపఁదగినవి

7 ఏది ఉత్పత్తివినాశములు కలదియో అది సర్వకారణపదార్థముగ నిర్ణయింపఁదగినదికాదు

8 అందువల్ల కారణరహితమగు పదార్థమే ఉత్పత్తి వినాశవర్జితమును జగత్కారణమునునై యున్నదని నిశ్చయింపవలయును

9 అవయవములుగల పదార్థము వినాశము నొందితీరును

10 అందువల్ల వినాశరహితమగు జగత్కారణవస్తువున కవయవ నంగీకరింపరాదు

11 భూతముల కవయవములు లోకప్రసిద్ధములై యున్నందున నా ముల జగత్కారణముగ నిర్ణయింపరాదు

12 ఆకసము నిరవయవమైనను ఆత్మకు బాహ్య మందుండుట ఆత్మధర్మముల ధరించి యుండుటచేతను జడమగుటచేతను కల్పిత ము నందుచే వినాశవంతమనియు నిర్ణయింపవలయును

13 కల్పనారహితమగు నిరవయవ సద్వస్తు వేది కలదో అదియే రహితమని యంగీకరింపఁదగినది

14 భూతములకు జగత్కారణత్వ మేహేతువువల్ల నిరాకరింపఁ • ఆహేతువువల్లనే అనిత్యత్వముగూడ నిర్ణయింపఁదగినది

15 నిత్యత్వమువల్ల నిరవయవత్వము సిద్ధించిన జగత్కారణవస్తువు రవయవత్వమువల్ల అద్వయత్వ మంగీకరింపఁ దగియున్నది

16 నిరవయవ పదార్థము సర్వవ్యాపకమైనందున పరిచ్ఛేదరహి నిర్ణయింపవలయును

17 నిరవయవత్వమువల్ల సద్వస్తువు లనేకమనుట యుక్తమై నందున పరిచ్ఛేదరహితమగు సద్వస్తు వద్వయ మగుచున్నది

18 నిత్యత్వముగల పదార్థమున కద్వయత్వము నిర్ణయింపఁబడి వ అనిత్యములగుటచే భూతములకుఁగూడ ఈసద్వస్తువే కారణమని యింపఁబడుచున్నది

19 అందువల్ల నిరవయవము నిత్యము అద్వయమునగు సద్వస్తు భిన్నమైన దంతయు కల్పితమని నిర్ణయింపఁబడినది

20 ఈకారణమునుండి యీకార్యము జనించునను నియమము ప్రసిద్ధమై యున్నందున అభివ్యక్తముగాకపూర్వము కార్యము కార దస్పష్టముగ నున్నదని అంగీకరింప వలయును

21 అందువల్ల దృశ్యమానమగు సర్వజగత్తును సృష్టికిపూర్వమందు సర్వ కారణమును కారణపదార్థరహితము నగు సద్వస్తువునం దస్పష్టముగ నుండునని నిశ్చయింపవలయును

22 అవయవవంతమగు మృత్తికాదికము పరిణమించు స్వభావము గలదగుటవల్లను అన్యమగు నిమిత్తకారణ ముండుటవల్లను ఘటాది కార్యవర్గము కలుగుచున్నది

23 జగత్కారణవస్తువు నిరవయవమగుటచేత పరిణమించు స్వభావముగలది కాదు

24 అద్వయము పరిచ్ఛేదరహితము నగుటచే నన్యమగు నిమిత్త కారణము గలది కాదు

25 ఘటోత్పత్తికి పూర్వమందే కులాలాదు లున్నట్లు జగదుత్పత్తికి పూర్వమందు జగత్కల్పనాకర్తయగు నిమిత్తకారణుఁడు గలఁడనిన అతనిని సవికారుఁడుగఁ జెప్పవలయును

26 ఎందువల్ల నిర్వికారునకు కల్పనాశక్తి సంభవింపదో అందువలన

27 జగత్కల్పనాకర్తను సృష్టికి పూర్వ ముండున్నట్లు అంగీకరించిన సృష్టిలోఁ జేరినవాఁడు గామిచేత నతనిని నిత్యునిగఁ జెప్పవలయును

28 ఏది వికారముగలదియో అది వినాశమునొంది తీరునను న్యాయముచేత వికారికి నిత్యత్వము యుక్తమై యుండనందునను, నిరవయవమునకు వికారమును చెప్పఁగూడనందునను, జగదుత్పత్తికిపూర్వము జగత్కారణమగు సద్వస్తువునకు భిన్నముగ వికారియగు చేతనుఁ డొకఁడు గలఁడనియూహింప శక్యమైయుండదు

29 అందువల్ల నిర్వికారము నిరవయవము పరిణామ రహితము అద్వయము నగు సద్వస్తువునందు జగదుత్పత్తిని సమర్థింపఁదగిన హేతువులు కనుపింపవు

30 సద్వస్తువునకు పరిణామము లేనందునను సద్వస్తువందు జగ
ప్పనఁగావించెడి అన్యుఁడగు నిమిత్తకారణుఁడు నిత్యుఁడుగను వికా
ఉన్నట్లు నిర్ణయింప శక్యమై యుండవందునను, జగదుత్పత్తి నిరా
ఁదగియున్నది

31 ప్రత్యక్షప్రమాణ గోచరమగు జగత్సృష్టిని నిరాకరించుట
రింపరానిదై యున్నందున జగత్కల్పన నేదోయొకవిధముగ సమర్థింప
మున్నది

32 శ్రుత్యుక్తమార్గము నాశ్రయించిన వానికి సృష్టిని సమర్థించు
ఏవిరోధమును సంభవింపదు.

33 అందువల్ల జగత్కల్పనను శ్రుతిప్రోక్తమగు మార్గమున నిర్ణ
వలసియున్నది.

34 ఏది కార్యమో అది తన యుత్పత్తికి పూర్వమందు కారణమున
గలిగియుండునని అంగీకరింపక తప్పదు.

35 ఏ కార్యము అభివ్యక్తముగాక ఎంతవఱకు కారణమునందే స్థితిని
యుండునో, అంతవఱకు నది శక్తి శబ్దముచేతఁ బిలువఁబడుచున్నది

36 ఈశక్తి; కారణమునకు భిన్నముగఁగాని, అభిన్నముగఁగాని
కేనిదై కార్యరూపమున మాత్రము తెలియఁదగియున్నందున అనిర్వచ
ని చెప్పఁబడుచున్నది.

37 జగద్రూపముగఁ దోఁచెడి కార్యవర్గమెల్ల నేకరీతిగ నుండక,
చిత్రరూపములు గలదియై, అనిర్వచనీయమై, దుర్ఘటానేక కార్యరూప
మున్నందున, కారణమునందలి కల్పనాశక్తులును, ఏకరీతిగ నుండక
న ఘటనాసమర్థములై అనేకవిధములుగ నుండునని నిర్ణయింపఁదగి
ది.

38 వటవృక్షమువల్ల వటబీజశక్తియు, శరీరమువల్ల రేతశ్శక్తియు దుర్ఘట కార్య కారిణులని తెలియఁబడునటుల కార్యకల్పనాశక్తులందు ప్రతి యొక్కటియు దుర్ఘట కార్య కారిణులని వాని కార్యములఁబట్టి స్పష్టమగు చున్నది.

39 కార్యము నాధారముగఁగొని కారణము నూహించుటకు శక్యమైయున్నందున, జగంబులోని చిత్రవిచిత్ర కార్య కల్పనాశక్తుల నాధారముగాఁగొని జగత్కారణవస్తువునందు దుర్ఘటానేక కార్యరూప జగమును సృజించెడి ఒకానొక శక్తికలదని నిర్ణయింపఁబడుచున్నది.

40 జగత్కారణమగు సద్వస్తువు నిరవయవమగుటచే పరిణమించునది గామిచేత జగద్రూపపరిణామము శక్తికిమాత్రమే చెప్పఁదగియున్నది

41 జగత్తు జడస్వరూపమై యున్నందున. జగద్రూపముగ పరిణమించిన శక్తియు జడరూపిణియే యని నిశ్చయింపవలయును.

42 జీవులు జగత్తుచే మోహింపఁబడుచున్నందున, జగద్రూపపరిణామినియగు శక్తికి జడరూపమువలె మోహనరూపము గలదని అంగీకరింపవలయును.

43 ఇట్లని 'తదేత జ్జడం మోహాత్మకం' అని శ్రుతి చెప్పుచున్నది

44 ఈ జగత్కల్పనాశక్తియే శ్రుతియందు ప్రకృతి, మాయ యను శబ్దములచే పిలువఁబడుచున్నది

45 నిద్రావస్థయందు అవికారిగనున్న జీవునియందుఁగల నిద్రాశక్తి స్వప్నపదార్థముల సృజింపఁగలుగునట్లు నిర్వికారమగు సద్వస్తువునందుఁగల జగత్కల్పనాశక్తియు అసద్వస్తువునకు వికారమును గలిగింపకయే జగత్తును సృజించుచున్నది

46 మృచ్ఛక్తి జడమగు మృత్తికయందుండుటచే ఘటాది కార్యవర్గమును సృజించుటకు చేతనుఁడగు కులాలు నపేక్షించుచున్నది

7 మృచ్ఛక్తివలె నిద్రాశక్తి జడమైనను చేతనుఁడగు జీవునియం
న చైతన్యవంతమై స్వప్నపదార్థముల స్వయముగా సృజింపఁ
న్నది

8 నిద్రాశక్తివలె జడమైన జగత్కల్పనాశక్తియు, జగత్కల్పనఁ
మన్నందున జగత్కారణమగు సద్వస్తువు చైతన్యవంతమై యుండ
ని నిశ్చయింపవలయును

9 "నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానాం" అను శ్రుతిగూడ
రణానకు చేతనత్వమును ప్రతిపాదించుచున్నది

0 చేతనుని యందుఁగల జగత్కల్పనాశక్తియగు మాయ 'జ్ఞానే
కియాశక్తులు గలిగియున్నదని' - పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే
కీ జ్ఞానబల క్రియాచ' అను శ్రుతి ప్రతిపాదించుచున్నది

1 సద్రూపుఁడగు పరమాత్మ పరిణమింపకున్నను జగదుత్పత్తి
ములకు నాధారుఁడై యున్నందున నతనికి ప్రపంచ వివర్తోపాదన
్వము చెప్పఁబడుచున్నది

12 మాయాశక్తి జగద్రూపముగ పరిణమించునదై ఉత్పత్తి
ములకు హేతువై యున్నందున జగత్తునకు పరిణామోపాదాన
ని చెప్పఁబడుచున్నది

13 మాయాసహితుఁ డగుటవల్లనే, పరిణామరహితుఁడు అవికారి
యున్నను సద్రూపునందు జగత్కల్పనము నిర్ణయింపఁబడుచున్నది

14 బ్రహ్మవేత్తలు జగత్కారణమును నిర్ణయింప నుపక్రమించి
స్వభావము కర్మ యదృచ్ఛ భూతములు ప్రకృతి పురుషుఁడు
ప్రత్యేకముగఁగాని, అన్నింటి సంయోగముగఁగాని, జీవుఁడుగాని
-రణము కాఁజాలఁడని నిశ్చయించి ధ్యానయోగముచేత కాలము
యిన కారణముల నన్నింటిని నియమించునట్టి సద్రూప పరమాత్మ

యొక్క [సర్వజ్ఞత్వాది గుణములచే గూఢమైయున్న] జగత్కల్పనాశక్తి యగు మాయను జగత్కారణముగ నెఱిఁగినట్లు:— 'ఓం బ్రహ్మవాదినో వదంతి, కిం కారణం బ్రహ్మ? కుతస్మ్మజాతా? జీవామకేన? క్వచసంప్రతిష్ఠా? అధిష్ఠితాః కేన సుఖేతరేషు, వర్తామహే? బ్రహ్మవిదో వ్యవస్థామ్, 'కాల స్వభావో నియతిర్యదృచ్ఛా భూతానియోనిః పురుషఇతిచింత్యమ్ సంయోగ ఏషాం నత్వాత్మభావా దాత్మాఽఽప్యనీశః సుఖదుఃఖహేతోః, 'తే ధ్యాన యోగానుగతా అపశ్యన్ దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్, యః కార ణాని నిఖిలాని తాని కాలాత్మయుక్తా న్యధితిష్ఠత్యేకః' అని శ్వేతాశ్వతర శ్రుతియందు వినఁబడుచున్నది.

౫౫. ఎవ్వఁడీ ప్రకార మద్వితీయ నిత్య నిర్వికార సద్రూపసహిత మాయాశక్తిని జగత్కారణముగ నెఱుఁగునో వాఁడు కాలస్వభావాదికము నకు జగత్కారణత్వమును ప్రతిపాదించెడి భ్రాంతులగు వాదుల వలలోఁ జిక్కుకొనఁడు.

జగత్కారణనిర్ణయము

సమాప్తము

ఇది

శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే

రచింపఁబడినది

ఓంతత్సత్

శ్రీ రామాయనమః

## —: ఈశతత్త్వ వివేకము :—

## ఉత్పత్తి క్రమనిర్ణయము

అథ నిర్ణీయతే స్వామిన్ జగదావిర్భవ క్రమః
దేహి మే కృపయావిష్టః పరమార్థావబోధనమ్॥

1 క్రమసహితముగను క్రమరహితముగను గూడఁ దోఁచుచు
ంవంటి దగుటవలన, జగత్సృష్టి క్రమసహితముగను క్రమరహితముగను
లుగుచున్నదని నిర్ణయింపవలయును

2 అందువల్ల సృష్టిశ్రుతులు సృష్టి క్రమసహితముగను క్రమరహి
గూడఁ గలుగునని బోధించునవియై యున్నవి

3 స్వప్నమున ద్వివిధసృష్టులును గోచరించుచున్నందున పరమార్థ
బోధించుచున్నదగు శ్రుతిచే ప్రతిపాదింపఁబడు సృష్టిభేదము సంశ
వగినది కాదు

4 సద్రూప పరమాత్మయందుఁ గల మాయాశక్తినుండి జగత్కల్ప
షుప్తినుండి జాగరమువలెఁ గలుగుచున్నదని గ్రహింపవలయును

5 వటబీజమునందు వటమహావృక్షమును, సుషుప్తియందు జాగ్ర
విషయవాసనలును లీనములై యుండునట్లు, జగత్కల్పనాశక్తియగు
యందు సర్వజగద్వాసనలును లీనములై యున్నవని తెలియవలయును

6 బీజమునం దస్పష్టముగ నుండువృక్షము స్పష్టమగునట్లును, సుషు
దస్పష్టముగ నుండెడి జాగ్రత్స్వప్నవిషయవాసనలు జాగ్రత్స్వప్న
స్పష్టములగునట్లును అనిర్వచనీయమగు మాయాశక్తియం దస్పష్ట
ండెడి జగద్వాసనలు జగద్రూపముగ స్పష్టత్వమును బొందుచున్నవి

7 ప్రకృతి పరిణామమగుటచే జడమగు అంతఃకరణమునకు స్వకీయమగు వ్యవహార సామర్థ్యము లేమిచేతను, చేతనుఁడైనను నిర్వికారుఁడు నసంగుఁడు నగుటచే సద్రూపునకు వ్యవహారము సంభవింపనందునను, అన్యోన్యసాన్నిధ్యమాత్రముచే వ్యవహారము సిద్ధించుననిన అచేతనసృష్టియే యుండఁగూడనందునను, వ్యవహారముకొఱకు అంతఃకరణమునందు చిదాభాసు నంగీకరింపవలసి యున్నందున, స్వచ్ఛమగు జలమందలి సూర్యప్రతిబింబము నాధారముగఁగొని అస్వచ్ఛ మేఘజలమందు ప్రతిబింబము నంగీకరించునట్లు స్వచ్ఛమగు అంతఃకరణమందు చిదాభాసునంగీకరించుటచే, స్వచ్ఛముగానిదై అవిద్యారూపమున నుండెడిసుషుప్తినిష్ఠమగు అంతఃకరణమందును చిదాభాసు ననుమానప్రమాణముచే నంగీకరింప వలయును.

8. సుషుప్తియందు చిదాభాసుఁడు కలఁడని 'సుషుప్తిస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘనఏవ' అను శ్రుతి ప్రతిపాదించుచున్నది.

9. జీవుల యంతఃకరణములందు చిదాభాసుల నంగీకరింపవలసి యుండుటచేత సర్వ జీవాంతఃకరణ సమష్టిరూపమై ఈశ్వరాంతఃకరణముగ నుండెడి మాయయందు చిదాభాసుని యునికిని వేఱుగ నిర్ణయింప నక్కఱలేదు.

10. చిదాభాసుని ధరింపనియెడల జడమగు మాయయందు చైతన్యమును, జీవేశ్వరకల్పనమును సంభవింపనందున, జీవేశ్వర కల్పనాసిద్ధి కొఱకు మాయ చిదాభాసుని ధరించుచున్నది.

11. ఇట్లని, 'జీవేశా వాభాసేన కరోతి' అనుశ్రుతి చెప్పుచున్నది'

12. చిత్ప్రతిబింబధారిణియగు (మాయ ప్రకృతి) శుద్ధసత్త్వ మలినసత్త్వ భేదములచేత మాయ అవిద్య యని ద్వివిధముగఁ జెప్పఁబడుచున్నది.

13. ఇయ్యర్థము, 'మాయాచావిద్యాచ స్వయమేవచ భవతి' అనుశ్రుతివల్ల తెలియఁబడుచున్నది.

14. మలినసత్త్వ ప్రధానమగు అవిద్య దరియందలి సముద్రజలము
వ్నత్వము నొందుచున్నందున ప్రతిబింబమునకును విభిన్నత సిద్ధించు
.
15 శుద్ధసత్త్వ ప్రధానయగు మాయకు విభాగము సిద్ధింపనందున
ంబమునకును అఖండత్వము ప్రాప్తించుచున్నది.
16 ఎందువలన ఖండత్వాఖండత్వములు జగత్కల్పనాశక్తియందు
ంచుచున్నవో అందువలన ప్రతిబింబభూతులగు జీవేశ్వరుల కనేకత్వ
ములు సిద్ధించుచున్నవి.
17 మలినసత్త్వ శుద్ధసత్త్వములచేత నొప్పెడి యే కల్పనాశక్తి
అదియే జీవేశ్వరుల కానందమయకోశ మగుచున్నది.
18 ఖండత్వముగల అవిద్యయందు ప్రతిబింబరూపులై యుండుటచే
నేకులై ఆనందమయకోశములను ఒక్కొకని కొక్కొకటి వంతున
ముగ సిద్ధించుచున్నవి.
19 అఖండమగు మాయయందు ప్రతిబింబరూపుడై యుండుటచే
న కనేకత్వము సిద్ధింపక, ఆనందమయకోశమును అఖండముగ ప్రకా
ంన్నది.
20 పత్రపుష్ప ఫలాది భేదములచేత ప్రకాశించెడి వృక్షము
ీజమునందస్పష్టావయవములతో నేకరూపముగ నుండునట్లు జీవేశ్వ
ేదములతో ప్రకాశించెడి జగత్తు సృష్టికిపూర్వము కారణమగు
యందవ్యక్తావయవములతో ఏకరూపము గలదియై యున్నది.
21 బీజము పరిణమించు కొలఁదియు వృక్షము స్పష్టత్వమునొందు
ప్రకృతి పరిణమించు కొలఁదియు జీవేశ్వరాది జగద్భేదము స్పష్టమగు
.
22 ప్రకృతికి జీవుల కర్మఫలోన్ముఖత్వముచే పరిణామమును
న్ముఖ రహితత్వముచే పరిణామ రహితత్వమును గలుగుచున్నవి.

23 సుషుప్తియందలి స్వపరజ్ఞాన శూన్యత్వ మనుభవసిద్ధమై యున్నందున జీవున కానందమయకోశమునందు విజ్ఞానశూన్యత్వము నిశ్చయింపఁ బడుచున్నది.

24 ఇయ్యర్థము 'నాహం ఖల్వయమేవం సంప్రత్యాత్మానం జానాత్యయ మహ మస్మీతి నో ఏవేమాని భూతాని వినాశమేవాపీతో భవతి నాహ మత్ర భోగ్యం పశ్యామి' అనుశ్రుతివల్ల స్పష్టమగుచున్నది.

25 ఈశ్వరున కానందమయకోశమునందే సర్వేశ్వరత్వ సర్వజ్ఞత్వ జగద్యోనిత్వాంతర్యామిత్వాది ధర్మములున్నట్లు 'ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽన్తర్యా మ్యేషయోని స్సర్వస్య ప్రభవాప్యయౌహి భూతానామ్' అనుశ్రుతి చెప్పుచున్నది

26 ఆనందమయోపాధికులై విజ్ఞానశూన్యులగు జీవులకు విజ్ఞానమయమునందుగాని స్వపరజ్ఞానము కలుగదు

27 స్వపరజ్ఞానములేనిదే కర్మఫల మనుభవమునకు రాదు

28 అందువల్ల స్వపరజ్ఞాన పూర్వకముగా సాధనాంతరముచే ననుభవింప వలసిన కర్మఫల మనుభవించుటకు జీవులకు విజ్ఞానమయ మనోమయాది సాధనములు కావలసియున్నవి

29 చిత్ప్రతిబింబ ధారణారహితమగు ప్రకృతియందు చైతన్యము సంభవింపనందున జడమగు ప్రకృతికి కల్పనాసామర్థ్యము సంభవింపదు

30 అందువలన చిత్ప్రతిబింబ ధారణముచే చైతన్యమునొంది ప్రతిబింబ ప్రాధాన్యముచేత ఈశ్వరశబ్దముచే వ్యవహరింపఁబడు ఆనందమయకోశమునకే సృష్టికర్తృత్వము చెప్పఁబడుచున్నది

31 ఈ యానందమయకోశము సృజించెడి జాగ్రత్స్వప్నరూప ప్రపంచమును మరియొక విధముగఁ జేయుటకు ఎవ్వఁడును ఎందువల్ల సమర్థుఁడు గాఁడో అందువల్ల ఆనందమయకోశరూపుఁడగు ఈశ్వరునకు సర్వేశ్వరత్వము చెప్పఁబడుచున్నది

32 సమస్తజీవుల ఆనందమయకోశములను ఈశ్వరుని ఆనంద కోశమందు ఉన్నందున సర్వజీవుల బుద్ధివాసనలను ఆనందమయ కోశ ుడగు ఈశ్వరునకు తెలియఁబడుచుండుటచే నతనికి సర్వజ్ఞత్వము ిరింపఁబడుచున్నది

33 సర్వ జగత్సృష్టిప్రళయముల నెందువల్లఁ జేయుచున్నాఁడో వల్ల ఆ యీశ్వరునకే జగద్యోనిత్వము నిర్ణయింపఁబడుచున్నది

34 విజ్ఞానమయాది కోశములయందును భూమ్యాది భూతముల ను లోపల నున్నవాఁడై ప్రేరకుఁడుగ నున్నందున ఆనందమయ రూపునకు అంతర్యామిత్వము ప్రతిపాదింపఁబడుచున్నది

35 ఆనందమయకోశ రూపుఁడగు ఈశ్వరునకు అంతర్యామిత్వ అంతర్యామి బ్రాహ్మణమునందు 'యఃపృథివ్యాంతిష్ఠన్ పృథివ్యామంత మం పృథివీనవేద యస్యపృథివీ శరీరం యఃపృథివీమంతరో యమయ త ఆత్మాఽన్తర్యా మ్యమృతః 'అనెడిమంత్రముమొదలు' యోరేతసి రేతసోన్తరో యగ్ం రేతోనవేద యస్యరేతశ్శరీరం యోరేతోంత మయ త్యేష త ఆత్మాఽంతర్యామృతః, అను మంత్రము వఱకుఁ గల భాగము ప్రతిపాదించుచున్నది

36 సద్రూపుఁడగు పరమాత్మకు పరిణామము నిరాకరింపఁబడినందు ప్రతిబింబరూపుఁడై మాయాసహితుఁడుగ నున్న ఈశ్వరునకంటె జగ రముగ పరిణమింపఁదగినది వేరొకటి లేనందునను ఆనందమయకోశ లగు జీవులు ఈశ్వరునివల్లనే విజ్ఞానమయాదికము పొందవలసిన వార చేతను, జగదాకారపరిణామ మీశ్వరునకే చెప్పఁబడుచున్నది

37 'తదాత్మానగ్ం స్వయ మకురుత' అనుశ్రుతి ఈశ్వరునకే జగ ప పరిణామమును జెప్పుచున్నది

38 ప్రాజ్ఞుఁడు తైజసుఁడుగను, తైజసుఁడు విశ్వుఁడుగను, పరిణమించునటుల అవ్యాకృతుఁడగు ఈశ్వరుఁడు హిరణ్యగర్భుఁడుగను హిరణ్యగర్భుఁడు విరాట్స్వరూపుఁడుగను పరిణమించుచున్నాఁడు

39 అవ్యాకృతుఁడు హిరణ్యగర్భుఁడుగ పరిణమింపఁగనే సమస్త జీవులకును విజ్ఞానమయ మనోమయ ప్రాణమయ కోశములు గలుగుచున్నవి

40 హిరణ్యగర్భస్వరూపుఁడగు ఈశ్వరుఁడు విరాడ్రూపముగ పరిణమించుటచే సర్వజీవులకు నన్నమయకోశములును, అన్నపానాది సమస్త భోగ్యపదార్థములును ఏర్పడుచున్నవి

41 జీవేశ్వరులందు జీవుఁ డజ్ఞుఁడు ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు. జీవుఁడు నియమ్యుఁడు. ఈశ్వరుఁడు నియామకుఁడు నని „జ్ఞా జ్ఞౌ ద్వావజా వీశనీశౌ" అను శ్రుతి చెప్పుచున్నది

42 'తయోరన్యః పిప్పలం స్వాద్వ త్త్యనశ్న న్నన్యోభిచాకశీతి' అను శ్రుతి జీవేశ్వరులందు జీవుఁడు కర్మఫల మనుభవించు వాఁడనియు, నీశ్వరుఁ డనుభవింపక సాక్షిమాత్రుఁడుగ నుండు వాఁడనియుఁ జెప్పుచున్నది

43 'అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్, తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః' అను శ్రుతి జీవేశ్వరులందు మాయోపాధికుఁడగు ఈశ్వరుఁడు సృజించుచున్నాఁడనియు నన్యుఁడగు జీవుఁడు మాయచేత ఈశనిర్మిత జగమునందు బంధింపబడుచున్నాఁడనియు ప్రతిపాదించుచున్నది

44 ఎందుచేత ఈశ్వరునకు సర్వజ్ఞత్వము, సృష్టికర్తృత్వము సర్వసాక్షిత్వము, జీవున కజ్ఞత్వము, నసమర్థత్వము భోక్తృత్వము, మాయాబద్ధత్వము చెప్పఁబడుచున్నదో, అందుచేత ఈశ్వరునకు సర్వ స్వాతంత్ర్యము జీవున కస్వాతంత్ర్యము నిశ్చయింపఁ బడుచున్నది

45 జీవున కస్వతంత్రత్వ మంగీకరింపఁబడినందున ఇష్టార్థసిద్ధియఁ ఈశ్వరప్రేరణ మపేక్షింపఁబడుచున్నది

46 ఎవ్వఁడీప్రకార మెఱుఁగునో, వాఁ డిష్టసిద్ధికై సర్వనియామక ఈశ్వరుని యనుగ్రహము నపేక్షించుచున్నాఁడు

ఉత్పత్తిక్రమ నిర్ణయము

సమాప్తము

ఇది

శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచింపఁబడినది

ఓంతత్సత్



శ్రీరామాయనమః

# ఈ శ త త్త్వ వి వే క ము

# ప్రే ర క త్వ ని ర్ణ య ము .

శ్లో॥ ప్రేరకత్వ స్వరూపంచ తవప్రీత్యై మయోచ్యతే ।
చిత్తంప్రవిశ్య దేవేశ తత్వార్థే ప్రేరకోభవ ॥

1 ఆనందమయకోశరూపుఁడగు ఈశ్వరుఁడు సమస్త జగదాకార ముగ పరిణమించుటచేత ఈ సమస్తమును మాయికుఁడగు ఈశ్వరున కవయవ భూతమై యున్నది

2 ఇట్లని, 'మాయాంతు ప్రకృతింవిద్యా న్మాయినంతు మహేశ్వరం తస్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్' అనుశ్రుతి ప్రతిపాదించుచున్నది

3 అవయవభూతమై యున్నందువల్లనే సమస్త ప్రపంచమును ఈశ్వరునకు శరీరమగుచున్నది

4 శ్రుతిచేతను వ్యవహారముచేతను అన్నమయాదికమున కాంతరమని అంగీకరింపఁబడిన జీవుని యానందమయకోశమునకుఁ గూడా నాధారమై యున్నందున ఆనందమయోపాధికుఁడగు ఈశ్వరునకు సర్వాంతరత్వము చెప్పఁబడుచున్నది

5 సర్వాంతరుఁడగు నీ యీశ్వరుఁడే సర్వభూతములను యథాయోగ్యముగ ప్రేరించుచున్నందున నతనికే ప్రేరకత్వము చెప్పఁబడుచున్నది

6 ఈశ ప్రేరణమునకు లోనగు జీవుల విజ్ఞానమయాదిక మాయీశ్వర పరిణామముచేతనే ఏర్పడుచున్నది

7 ఆనందమయోపాధికుఁడగు ఈశ్వరుఁడు విజ్ఞానమయాది కోశ రూప పరిణామమును పొందుచుండఁగా జీవునకును విజ్ఞానమయాదికము కలుగుచున్నది

8 ఈశ్వరున కొక్కొక్క కోశరూప పరిణామము సిద్ధింపఁగనే
ను విజ్ఞానమయాది కోశములు ఒక్కొక్కటిగ నేర్పడుచున్నవి

9 ఈశ్వరున కన్నమయముతో నంతమైన కోశపంచకము సిద్ధింపఁ
వులకును ప్రత్యేకముగ పంచకోశములు కలుగుచున్నవి

10 ఎప్పుడు ఈశ్వరుఁడు తనవిజ్ఞానమయాదకము నుపసంహరించు
ో అప్పుడు జీవులకును విజ్ఞానమయాదికోశములు నశించుచున్నవి

11 అందువలన ఈశ్వరుని ఆనందమయకోశము నందు జీవుల
ందమయ కోశములును, ఈశ్వరుని విజ్ఞానమయకోశమునందు జీవుల
మయ కోశములును ఈశ్వరుని మనోమయ కోశమునందు జీవుల
మయకోశములును, ఈశ్వరుని ప్రాణమయకోశమునందు జీవుల ప్రాణ
ోశములను ఈశ్వరుని అన్నమయకోశమునందు జీవుల అన్నమయ
ులును స్థితినిబొంది యున్నవని గ్రహింపవలయును

12 జీవున కానందమయముచేత విజ్ఞానమయమును, విజ్ఞానమయము
నోమయమును, మనోమయముచేత ప్రాణమయమును, ప్రాణమయము
న్నమయమును, వాయువుచేత తిత్తివలెపూర్ణములైయున్నవని 'తస్మాద్వా
త్మ దన్నరసమయాత్ అన్యోఽన్తర ఆత్మా ప్రాణమయః తేనైష
తస్మాద్వా ఏతస్మా త్ప్రాణమయాత్ అన్యోఽన్తర ఆత్మా మనో
తేనైష పూర్ణః తస్మాద్వా ఏతస్మా న్మనోమయాత్ అన్యోఽన్తర
విజ్ఞానమయః తేనైషపూర్ణః తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞానమయాత్
ఽన్తర ఆత్మాఽఽనన్దమయః, తేనైషపూర్ణః' అనుశ్రుతి ఘోషించు
ది

13 ఈశ్వరుని ఆనందమయాది కోశములందు ఒక్కొక్కకోశ
దొక్కొకటి చొప్పున స్థితినిపొందియున్న జీవుని ఆనందమయాది
ములే క్రమముగా నొండొంటితో పూర్ణములైయుండ తద్రూపముగ

పరిణమించిన ఈశ్వరుని ఆనందమయాది కోశములను ఆ ప్రకారమే యొం దొంటితో పూర్ణములై యున్నాడునని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

14 విజ్ఞానమయోపాధికుఁడగు జీవుఁడు మనోమయాది కోశము లన్నిటియందును వ్యాపించి ఆయాకోశ వ్యవహారముల నెఱుఁగునట్లు ఆనంద మయోపాధికుఁడగు ఈశ్వరుఁడును తనయొక్క విజ్ఞానమయాది కోశము లన్నింటియందును వ్యాపించి ఆ యాకోశ వ్యవహారముల నెఱుఁగుచున్నాఁడు

15 తనయొక్క విజ్ఞానమయాదికమున వ్యాపించి యున్నందున సర్వవ్యాపకత్వమును ఆ విజ్ఞానమయాదికము యొక్క వ్యవహారముల నెఱుఁగుటచే సర్వ జగద్విషయ జ్ఞానమును ఆనందమయోపాధికుఁడగు ఈశ్వరునకు చెప్పఁబడుచున్నవి

16 తనకోశపంచకమునందే జీవుల కోశపంచకము స్థితినిబొంది యున్నందున అంతర్యామియగు ఈశ్వరున కాజీవుని పంచకోశ వ్యవహారములు తెలియఁబడుచున్నవి

17 జీవులు మాయాబద్ధులు అజ్ఞులునగుటచే తమ్మును తమయొక్క సర్వ వ్యవహారములనెఱింగెడి అంతర్యామిని ఎఱుఁగఁజాలరు

18 తా మనుభవింప వలసిన ప్రారబ్ధకర్మమే తమ కెందువల్ల తెలియదో అందువల్ల కర్మఫలానుభవమునకై కలుగవలసిన వ్యవహారములును జీవులకు తెలియవు

19 జడము లగుటచేత కర్మలకు ప్రేరకత్వమును చెప్పరాదు

20 అందువల్ల అజ్ఞులు మాయాబద్ధులు నగు జీవుల కర్మఫలానుభవమునకై విజ్ఞానమయాదికమును కల్పించిన అంతర్యామియే, కర్మ ఫలానుభవమునకై వలయు వ్యవహారములఁ జేయించుటకొఱకు కావిజ్ఞానమయాదికమును ప్రేరించుచున్నాఁడు

21 ఈ హేతువువల్ల జీవునకు విజ్ఞానమయాదికము నేర్పఱచు
టయందు స్వాతంత్ర్యము సిద్ధింప నట్లు విజ్ఞానమయాదికమును వ్యవహా
రము జేయుటయందును స్వాతంత్ర్యము సిద్ధింపదు

22 అందువల్ల ఆనందమయము మొదలు అన్నమయము వఱకుఁగల
ములైదును అంతర్యామి ప్రేరణముచేత స్వీయ వ్యవహారములయందు
ర్తించు చున్నవని నిశ్చయింపవలయును

23 సుషుప్తియం దానందమయకోశముఁ బ్రవేశించుటచే ఘటాదిక
లె విజ్ఞానశూన్యులగు జీవులకు మరల విజ్ఞానమయాదికమున ప్రవేశము
కముగా సిద్ధింపనందున అంతర్యామి ప్రేరకత్వ మపేక్షింపఁబడుచున్నది

24 విజ్ఞానమయకోశమున జీవులకు విజ్ఞానమున్నను వ్యవహార సాధన
ఆకోశమును వ్యవహారములయందు నియమించు సామర్థ్యము లేమిచేత
నమయమున జీవులకు స్వాతంత్ర్యముఁ జెప్పరాదు

25 విజ్ఞానమయము నందలి విషయములు తా మపేక్షించి ప్రయ
చినను స్ఫురింపక పోవుటయు, నపేక్షింపనపుడు అప్రయత్నముగ
రించుటయు, విజ్ఞానమయమున జీవుల అస్వాతంత్ర్యమునకు నిదర్శనము

26 విజ్ఞానమయము ముత్పత్తి వినాశములు కలదియగుటచే నిన
త్పత్తి వినాశములకు కారణుఁడగు నొక నియామకునకు లోఁబడి వ్యవహ
ంచదని అంగీకరింపఁదగి యున్నందునను, జీవులచేత ననుభవింపఁజేయు
కర్మఫలమును ఫలానుభవమునకై చేయఁదగిన వ్యవహారములను ఎఱుఁగ
యున్నందునను దానికిని స్వాతంత్ర్యమును చెప్పఁగూడదు

27 అందువలన జీవుల కర్మ ఫలానుభవమునకై సాధనముగ
హరింపవలసిన విజ్ఞానమయమునందు వ్యవహారసిద్ధికొఱకు అంతర్యామి
రకత్వ మపేక్షింపఁబడు చున్నది

28 మనోమయమునందును జీవులకా మనోమయమును నియమించు సామర్థ్యము లేమిచే నస్వాతంత్ర్యమే చెప్పవలసియున్నది

29 ఇచ్ఛయింప కున్నను సంకల్ప వికల్పములు గలుగుచుండు టయు, నిరోధింపఁ దలఁచినప్పుడు నిరుద్ధములుగాక [కర్మానుగుణముగ] నుండుటయు మనోమయమునందు జీవులకస్వాతంత్ర్యమును నిరూపించు చున్నది

30 మనోమయము విజ్ఞానమయమువలె నుత్పత్తి వినాశములు గలిగియున్నందున నియామకునకు లోబడియున్నట్లు స్పష్టమగుచున్నందునను తనయందు గలుగు వ్యవహారములు స్పష్టత్వము నొందువఱకు తనకే తెలియు నందునను మనోమయమునకును అస్వాతంత్ర్యమే చెప్పఁదగియున్నది

31 అందుచేత మనోమయ వ్యవహారములకును అంతర్యామి ప్రేరకత్వమే కారణమని నిశ్చయింపఁదగియున్నది

32 ప్రాణమయమునందు ప్రాణనాది క్రియలు జీవప్రేరణము నపేక్షింపకయే జరుగుచుండుట చేతను జడమగు ప్రాణమయము తనంతనే క్రియావంతమై యున్నదనుట యుక్తియుక్తముగా నుండనందునను ప్రాణ మయమునందుఁ గూడ జీవప్రాణమయముల కస్వాతంత్ర్యము నిశ్చయింపఁబడు చున్నది

33 అందువలన ప్రాణమయమునందును అంతర్యామి ప్రేరకత్వ మంగీకరింపఁబడుచున్నది

34 అన్నమయమునందలి షడ్భావ వికారములకు జీవప్రేరణము కారణముగా చెప్పఁగూడనందునను అచేతనమగు అన్నమయమునం దట్టి సామర్థ్యము సంభవింప నందునను అన్నమయమునందుఁగూడ అంతర్యామి ప్రేరణమును నిర్వివాదముగ నంగీకరింపవలయును

35 ఈ ప్రకారము కోశము లైదింటియందును అంతర్యామి ప్రేరకుఁడుగా నున్నాఁడనెడి యర్థము, 'యస్సర్వేషుభూతేషు తిష్ఠన్సర్వేభ్యో

తేభ్యో౽న్తరో యగ్ం సర్వాణిభూతాని నవిదు ర్యస్య సర్వాణి భూతాని
యస్సర్వాణిభూతా న్యన్తరో యమయ త్యేషత ఆత్మా౽న్తర్యా
మృతః, యః ప్రాణేతిష్ఠన్ ప్రాణాదన్తరో యం ప్రాణోనవేద యస్య
ణశ్శరీరం యః ప్రాణమన్తరో యమయ త్యేషత ఆత్మా౽న్తర్యా మ్యమృ
యోవాచి తిష్ఠ న్వాచో న్తరో యంవాఙ్నవేద యస్యవాక్శరీరం యోవాచ
రో యమయత్యేషత ఆత్మా౽న్తర్యా మ్యమృతః, యశ్చక్షుషి తిష్ఠగ్శ్చక్షు
న్తరో యం చక్షుర్న వేద యస్య చక్షుశ్శరీరం యశ్చక్షుర న్తరో యమయ
త ఆత్మా౽న్తర్యా మ్యమృతః, యశ్శ్రోత్రే తిష్ఠన్ శ్రోత్రాదన్తరో
శ్రోత్రం నవేద యస్య శ్రోత్రగ్ం శరీరం యశ్శ్రోత్ర మన్తరో
య త్యేషత ఆత్మాన్తర్యామ్యమృతః, యోమనసితిష్ఠగ్ న్మనసో న్తరో
మనో నవేద యస్య మనశ్శరీరం యోమనో న్తరో యమయ త్యేషత
త్మాన్తర్యా మ్యమృతః, యస్త్వచితిష్ఠగ్ స్త్వచో న్తరోయం త్వఙ్నవేద
స్య త్వక్శరీరం యస్త్వచ మన్తరో యమయ త్యేషత ఆత్మాన్తర్యా
మృతః, యో విజ్ఞానే తిష్ఠ న్విజ్ఞానా దన్తరో యం విజ్ఞానం నవేద యస్య
నగ్ శరీరం యోవిజ్ఞాన మన్తరో యమయ త్యేషత ఆత్మాన్తర్యా మ్యమృ
యోరేతసి తిష్ఠ న్రేతసో న్తరో యగ్ం రేతోనవేద యస్య రేతశ్శరీరం
రేతో న్తరో యమయ త్యేష త ఆత్మా౽న్తర్యా మ్యమృతః, అనెడి
తి వాక్యములచేత వినఁబడుచున్నది

36 చేతనులగు జీవులకే అంతర్యామి ప్రేరకత్వ మపేక్షింపఁ
బడుచుండ నచేతనములం దతని ప్రేరణము కలదని వేఱుగఁ జెప్పవలసిన
యే లేదు

37 అందువలన జీవకర్మానుభవము కొఱకు సృజింపఁబడిన సర్వ
పంచమందును అంతర్యామి ప్రేరకత్వము. నిర్వివాదముగ నంగీకరింపఁ
బడుచున్నది

38 బాహ్యాభ్యంతరముల యందంతటను అంతర్యామియే నియమకుఁడని ప్రతిపాదించెడి 'ఏతస్యవా అక్షరస్య ప్రశాసన ఇతి' 'అంతః ప్రవిష్ట శ్శాస్తాజనానామ్' అను శ్రుతులవల్ల నీయర్థమే బలపడుచున్నది

39 బాహ్యాభ్యంతరముల యందంతటను అంతర్యామి నియామకత్వ మంగీకరింపఁ బడినందున సర్వ మీశ్వరాధీనమని నిశ్చయింపఁబడినది

40 ఎవ్వఁడీ ప్రకార మెఱుంగునో వాఁ డీశ్వరునియందనపరణబుద్ధి నుంచఁడు

ప్రేరకత్వ నిర్ణయము
సమాప్తము
ఇది
శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచింపఁబడినది
ఓంతత్సత్



శ్రీ రామాయనమః

## —: రహస్యతత్త్వ వివేకము :—

## అనుగ్రహ క్రమనిర్ణయము

అంతర్యామి స్వరూపేణ యస్తిష్ఠతి హృదంబరే
స మాం కృతార్థం కురుతాన్నిజానుగ్రహ నిర్ణయే ॥

1 అన్నమయము ఫలోన్ముఖ కర్మానుభవ సాధనముగ జీవునకు ఁబడి యున్నందున అది కర్మలు ఫలంబిచ్చి నశించువఱకు మాత్రమే ొంది యుండును

2 అన్నమయము స్థితిని బొంది యుండునంతవఱకు ఫలోన్ముఖ ఒకటి వెంబడి నొకటి ఫలంబొసఁగుచునే యుండును

3 ఫలోన్ముఖకర్మఫలం బనుభవింపఁ జేయుటకొఱకు నుద్దేశింపఁ జ్ఞానమయాదిక మందుకుతగిన వ్యవహారములమాత్రమే చేయుచున్నది

4 విజ్ఞానమయాదికము యొక్క వ్యవహారములు తనవిగా భావిం నే జీవున కావ్యవహారములతో సంబంధ మేర్పడుచున్నది

5 విజ్ఞానమయాదికమే తానను భావము లేకున్న జీవున కాకోశ ములయందు 'నావి' యనునభిప్రాయ మేర్పడదు

6 జీవుఁడు విజ్ఞానమయముఁ బ్రవేశింపఁగనే విజ్ఞానవంతుఁడై ం భిన్నముగఁగాని అభిన్నముగఁగాని చెప్పరాని విజ్ఞానమయ నాత్మత్వాభిమానమును చేయుచున్నాఁడు

7 జీవుని యునికివల్లనే చైతన్యమునొంది వ్యవహరించెడి విజ్ఞాన వరుసగా మనోమయ ప్రాణ మయాన్నమయముల యందు ను చుండఁగ విజ్ఞానమయమే తన స్వరూపము భావించియుండిన మనోమయాదులను గూడ తన స్వరూపముగ భావించుచున్నాఁడు

8 వ్యవహార సిద్ధికొఱకు విజ్ఞానమయమును ప్రేరించిన అంతర్యామియే దాని వ్యవహారములు సంపూర్ణముగ నెఱవేఱుటకై విజ్ఞానమయ వ్యవహారానుకూలముగ మనోమయాదులను ప్రేరించుచున్నాఁడు

9 విజ్ఞానమయాదులు వేఱువేఱుగ తమతమ విధ్యుక్తధర్మము నెఱవేర్చుచున్నందున భిన్నస్వరూప స్వభావములు గలవిగ నిర్ణయింపఁబడుచున్నను. అన్నియు జీవ కర్మఫలానుభవమునకై నిర్వర్తింప వలసిన వ్యవహారములను ఒక్క నియామకుని చేత నియమింపఁబడిన ప్రకారము వ్యవహరించుచున్నందున వ్యవహారము పలువుర వ్యవహారమువలెఁ గాక ఒక్క వ్యవహారమువలెనే గన్పట్టుచున్నది

10 ప్రారబ్ధము ఇచ్ఛా అనిచ్ఛా పరేచ్ఛలని త్రివిధమై యున్నందున అంతర్యామియు త్రివిధ ప్రారబ్ధ కర్మానుసారముగనే జీవులకు వ్యవహారములఁ గల్పించుచున్నాఁడు

11 విజ్ఞానమయాదికమును ప్రేరించి వ్యవహారమునం దిచ్ఛఁ గలిగించి వ్యవహరింపఁజేసి ఫలానుభవము గూర్చునది ఇచ్ఛాప్రారబ్ధము

12 విజ్ఞానమయమునం దిచ్ఛను గలిగింపకయే పరులను ప్రేరించి పరప్రేరణానుసారముగా విజ్ఞానమయాదికమును ప్రేరించి వ్యవహారమ నడిపించి ఫల మనుభవింపఁ జేయునది పరేచ్ఛాప్రారబ్ధము

13 విజ్ఞానమయాదికమును వ్యవహారముకొఱకు ప్రేరింపక పరులచే ప్రేరింపఁబడఁజేయక ఈ క్రియవల్ల ఈ ఫలము కలుగునని తెలియనీయకయే వ్యవహారమును కల్పించి ఫలం బొసంగునది అనిచ్ఛాప్రారబ్ధము

14 త్రివిధ ప్రారబ్ధ కర్మానుభవముకొఱకు వలయు వ్యవహారముల నంతర్యామియే విజ్ఞానమయాదికము చేతఁ జేయించుచుండఁగా విజ్ఞానమయాదికమునం దాత్మాభిమానము సేయుచుండిన జీవుఁ డావ్యవహారములను తానే చేయుచున్నట్లు అభిమానించుటచేత జీవునకు కర్తృకర్మ లేర్పడుచున్నవి

.5 ఇచ్ఛాభేదముచేతనే కర్మకును హీన మధ్యమోత్తమ భేదములు న్నవి

.6 అందువల్ల ఉత్తరజన్మ కారకములుగ నేర్పడు కర్మలయం రతమ్యము కలుగుచున్నది

17 ఈ జన్మమున చేయఁబడిన పుణ్యపాపరూప కర్మలయొక్క ట్యమువలన ఫల మిచ్చుటనే యనుభవింపఁ బడునని 'అత్యుత్కటైః పైరిహైవ ఫలమశ్నుతే' అను ప్రమాణవాక్యము చెప్పుచున్నది

18 అంతర్యామి ప్రేరణద్వారా పూర్వజన్మ కర్మఫలానుభవ విజ్ఞానమయాదికముచే నాచరింపఁబడెడి కర్మలయందుఁ గనబడెడి సవిశేషము ననుసరించి నూతనముగ నేర్పడిన కర్మయు బలవత్తర న్నది

19 ఎప్పుడు, ఏమ్మట ఫలంబొసగుటకు సిద్ధపడియున్న కర్మకంటె నేర్పడిన కర్మ బలవత్తర మగునో అప్పుడు బలవత్తరమగు ఈకర్మ సఁగి నశించువఱకును ఫలంబొసఁగుటకు సిద్ధముగానుండిన పూర్వ లమిచ్చుటకు ప్రారంభింపదు

20 ఏ యభిమాన తారతమ్యముఁబట్టి కర్మకు బలాబలము లేర్పడు గే ఆయభిమాన తారతమ్యముఁబట్టియే ఫలమునందును అతిశయా ములు కలుగుచున్నవి

21 వ్యవహరించునది విజ్ఞానమయాదికమును, వ్యవహరింపఁ జేయు నంతర్యామియు, నైయుండ ఏ సామర్థ్యమును లేని జీవుఁడు తనయం ంచుకొనిన కర్తృత్వాభిమాన పూర్వకముగ వ్యవహారములయందుఁ డి యిచ్ఛయే పురుషప్రయత్న శబ్దార్థముగ చెప్పఁదగియున్నది

22 ఈజన్మమున నేర్పడిన కర్మ ఫలంబిచ్చుటకు సిద్ధపడువఱకును చుండు వ్యవహారములును తత్ఫలములును పూర్వకర్మానుగుణము లైన తెలియవలెను

23 ఈ జన్మకర్మఫలము పూర్వజన్మ కర్మఫలము అనెడిభేద మంతర్యామికిఁదక్క అజ్ఞుఁడగు జీవునకుఁ దెలియనందున ఇష్టప్రాప్త్యనిష్ట పరిహారములకొఱకు కర్మలపై నాధారపడియున్న వారికి ప్రయత్నముకన్న నన్యమైన శరణ్యములేదు

24 సమస్తజీవులయొక్కయు వారివారి కర్మానుగుణములైన యిష్టముల నీడేర్చుటవలన అంతర్యామికి సర్వేష్టజ్ఞాన మంగీకరింపఁబడుచున్నది

25 సర్వజీవుల యనిష్టముల నెఱిఁగి కర్మానుగుణ్యముగ నివర్తింపఁ జేయువాఁ డగుటవలన ఈ యంతర్యామికి సర్వేష్ట జ్ఞానమువలె సర్వానిష్టజ్ఞానమును కలదని చెప్పవలయును

26 సకలజీవులచే నాచరింపఁబడెడి సర్వకర్మలనొక్కఁ డాచరించుటకు సమర్థుఁడు గానందున కర్మలచేత జీవులకు సర్వేష్టప్రాప్తియు సర్వానిష్ట పరిహారమును కలుగఁజాలవు

27 కర్మసాధ్యముగాని సర్వేష్టప్రాప్తియును సర్వానిష్టపరిహారము నీశ్వరుఁ డీడేర్పఁగలిగియున్నందున వివేకియగు వాఁడు కర్మయంత్రమునఁ జిక్కపడక పరమేశ్వరు నాశ్రయింపవలయును

28 సమస్తజీవుల హృదయముల గుర్తెఱిఁగి కర్మానుగుణములగు ఫలముల నిచ్చెడి సర్వజ్ఞుఁడును సర్వేశ్వరుఁడు నగు అంతర్యామికంటె నధికుఁడును సముఁడును లేనందున ఇష్టసిద్ధికతఁడే సర్వజీవాశ్రయుఁడని నిశ్చయింపఁబడెను

29 కర్మల నాశ్రయించినవారల కాకర్మ లొసంగఁగల ఫల మొసంగునట్లు ఈశ్వరు నాశ్రయించిన వారి కీశ్వరుఁ డియ్యఁగల సర్వశుభముల నిచ్చుచున్నాఁడు

30 పూర్వజన్మ కర్మఫలానుభవ సిద్ధికై అంతర్యామి ప్రేరణచే
ంపఁబడవలసిన ఇష్టానిష్ట ఫలహేతుకములగు కర్మల విడుచుటకు శక్య
ుండనందున కర్మబంధమునుండి విడుదలఁగోరువాఁడు తానాచరించు
నిష్కామ్య బుద్ధిచే ననుష్ఠింపవలయును

31 పురుషున కీశ్వరానుగ్రహము బొందవలయునని ఇచ్ఛయు
హా సాధనములగు ఉపాసనాదులును పూర్వకర్మానురూపముగ
్యామి ప్రేరణచే కలుగుచున్నవి

32 ఫలోన్ముఖ పూర్వకర్మ ఫలంబిచ్చి నశింపఁగనే కర్మపరిపాక
తగినట్లుగ నంతర్యామిచే ననుగ్రహింపఁబడియుండిన పరమేశ్వరో
ాదులను తదనుష్ఠానమునం దిచ్ఛయు నశించుచున్నవి

33 అందువల్ల పురుషుఁడు ప్రమత్తుఁడుగాక ఫలోన్ముఖమై
పూర్వకర్మ నశింపక పూర్వమే ఈశ్వరానుగ్రహము నార్జించుటకు
్ఞింపవలయును

34 ఎవని యిచ్ఛ బలవత్తరమైయుండునో వానిచే నిచ్ఛటనే
్మమునవే] పరమేశ్వరానుగ్రహము పొందఁబడుచున్నది

35 సమస్త చేతనాచేతన ప్రపంచ మీశ్వరపరిణామమై యున్నం
ివస్తమును ఈశ్వరస్వరూపమై యున్నది

36 అన్నమయమునం దంతటను వ్యాపించియున్నందున విజ్ఞాన
ు నుద్దేశించి అన్నమయమునకు జరుగు దూషణ భూషణ
ా రాదుల విజ్ఞానమయుఁ డెఱుఁగునట్లు చేతనాచేతనాత్మక ప్రపంచ
ందంతటను వ్యాపించియున్నందున ఆనందమయుఁడగు నంతర్యామి
ంచి చేతనాచేతనములకుఁ జేయు పూజాతిరస్కారాదుల నంతర్యామి
కొనుచున్నాఁడు

37 విజ్ఞానమయుఁ డన్నమయున కాంతరుఁడై యున్నను అన్న
మునకు జరుగు నిందాస్తుతులఁ దనవిగా భావించునట్లు అంతర్యామియు

ప్రపంచమున కాంతరుఁడై యున్నను అవయవభూతమగు బాహ్యప్రపంచమున జరుగు పూజాధ్యానాదికమును తనవిగా భావించుచున్నాఁడు

38 విజ్ఞానమయుఁడు తన్నాశ్రయించినవారి యభీష్టముల నన్నమయావయవములద్వారా నిర్వహించునట్లు అంతర్యామియు తన్నాశ్రయించువారి కోర్కెల చేతనాచేతనముల ద్వారా సమకూర్చుచున్నాఁడు

39 చేతనాచేతన ప్రపంచమున నేపదార్థమును ఈశ్వరభావముచేత పూజించినను ఇష్టసిద్ధి కలుగునని 'ఈశసూత్రి విరాడ్బ్రహ్మా విష్ణురుద్రేంద్రవహ్నయః। విఘ్న భైరవమైరాళ మారికా యక్షరాక్షసాః॥ విప్రక్షత్రియవిట్ఛూద్రా గవాశ్వ మృగపక్షిణః। అశ్వత్థ వట చూతాద్యా యవ వ్రీహితృణాదయః॥ జలపాషాణ మృత్కాష్ఠ వాస్యా కుద్దాలకాదయః ఈశ్వరస్సర్వఏవైతే పూజితాః ఫలదాయినః॥' అను ప్రమాణవాక్యములును చెప్పుచున్నవి

40 ఈశ్వరు నేయేప్రకారముగ నుపాసించునో తత్తదనుకూలముగనే పరమేశ్వరుఁ డనుగ్రహించునని 'తం యథా యథోపాసతే తథైవ ఫలంభవతి 'అనునిత్యాది శ్రుతులును' యే యథా మాంప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్' అను మొదలగు స్మృతులును చెప్పుచున్నవి

41 అందువలన చతుర్విధ పురుషార్థములందును ఈశ్వరానుగ్రహమపేక్షింపఁదగియున్నది

42 స్వస్వరూప పదప్రాప్తికి ఏ యాత్మజ్ఞాన మవసరమో ఆ యాత్మజ్ఞానమునకును ఈశ్వరానుగ్రహ మవసరమైయున్నది

43 'శ్రవణాయాపి బహుభిర్యో నలభ్యః శృణ్వంతోపి బహవో యం నవిదుః' అను శ్రుతివల్లను ఇయ్యర్థమే బలపడుచున్నది

44 విజ్ఞానమయమును విజ్ఞానమయ వ్యవహారములును అంతర్యామియధీనములై యున్నందున విజ్ఞానమయమునం దుదయింపవలసిన ఆత్మజ్ఞానమును అంతర్యామి యధీనమందే గలదని ఎఱుఁగవలయును

45 అందువలన మోక్షశాస్త్రమును చక్కఁగా విచారించిన వారి ఆత్మజ్ఞానోదయమునకు ఈశ్వరానుగ్రహ మపేక్షణీయమైనదని కలెను

46 ఇయ్యర్థము 'యస్తన్తునాభఇవ తన్తుభిః ప్రధానజైః స్వభావతో ః స్వమావృణోత్ స నో దధాద్బ్రహ్మా ప్యయమ్, 'యో బ్రహ్మాణం పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై తగ్ం హ దేవ బుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే' అను శ్రుతులవల్ల చున్నది

47 ఈశ్వరానుగ్రహము నార్జింపనివారికి కర్మానుగుణమగు ఫల మాత్రమే పరమేశ్వరుఁ డనుగ్రహించును కాని తదన్యములగు మనో ల నెఱవేర్పఁడు

48 ఆహేతువువల్ల బ్రహ్మస్వరూపావస్థానమగు మోక్షముకొఱకు ఁ డవశ్య మంతర్యామి యనుగ్రహమును సంపాదింపవలయును

49 ఎవ్వఁ డీప్రకార మెఱుంగునో వాఁ డిష్టసిద్ధికొఱకు పరమేశ్వరు ఝించుచున్నాఁడు

అనుగ్రహక్రమ నిర్ణయము
సమాప్తము

ఇది
శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచింపఁబడినది
ఓంతత్సత్



ఓం

శ్రీరామాయనమః

# ఈశతత్త్వవివేకము

## —: వివేకసార నిర్ణయము :—

శ్లో॥ అథ వక్ష్యామ్యహం నత్వా విశ్వస్యాంతఃస్థితం విభుం
ఈశతత్త్వవివేకస్య సారసంగ్రహ ముత్తమం॥

1 చేతనాచేతనాత్మక ప్రపంచమున కంతకు నంతర్యామియే నియామకుఁడని నిశ్చయింపఁబడినందున జీవునకు కర్తృత్వము నిరసింపఁబడినది

2 సమస్తజీవుల హృదయముల యందును మణులయందు దారమువలె వ్యాపించి నియమించుచున్నందున ప్రతిజీవి వ్యవహారమును ఈశ్వరానుశాసనముననే గలుగుచున్నదని యెఱుఁగవలయును

3 మిత్రారి పక్షముల రెండింటియందును నియామకుఁడొక్కఁడగు నంతర్యామియే యని యెఱిఁగినవానికి రాగమెచ్చట? ద్వేషమెచ్చట?

4 శాత్రవునియందును మిత్రునియందును అంతర్యామిని దర్శించి సర్వసముఁడై అసంగుఁడును నిర్వికారియు నై యున్నవానికంటె నిజమైన జ్ఞానియెవ్వఁడు ?

5 ధర్మాధర్మముల నిర్ణయించి ధర్మమును ప్రతిష్ఠించుటకును అధర్మమును నాశనము చేయుటకును ఈశ్వరుఁడు సమర్థుఁడై శాసింపఁదగి యుండ, ఈశ్వరానుశాసనము ననుష్ఠించుట వినా స్వకీయసామర్థ్యము లేని మానవుఁడట్టి కార్యమందు నేను సమర్థుఁడనని కర్తృత్వము వహించుట పరిహాసాస్పదము

6 భూమియందు పాతిన విత్తైనను కాల మనుకూలించినపుడ మాత్రమే అంకురించుచున్నది

7 మానవుఁ డెంత ప్రయత్నించినను ఈశ్వరానుశాసనము నతిక్రమ
ింపసమర్థుఁడుగానందున వివేకియగువానికి ఈశ్వరానుగ్రహ సాధనమగు
ంకన్న మిన్నయగు కర్తవ్యములేదు

8 ఎప్పుడు హృదయము నిష్కళంకమై ప్రపంచసంబంధమునువిడిచి
పాసనాదికము నందు నిమగ్నమై సర్వమును [సర్వ వ్యవహారముల
పరమేశ్వరున కర్పింప సమర్థమగుచున్నదో అప్పుడు పరమేశ్వరాను
కలుగుచున్నది

9 సర్వజీవుల యందును జగన్నాటక సూత్రధారియగు నంతర్యా
ించి సర్వసముఁడై జగన్నాటకమునకు ద్రష్టగను విలక్షణుఁడుగను
్యమోహ రహితుఁడై యున్నవానికి కర్తవ్యములేదు

10 సర్వ మీశ్వరాధీనమై యుండ ఈశ్వరానుగ్రహముఁ బొం
కపచార మెవ్వనివలనఁ గలుగును?

11 ఎవ్వఁడీప్రకార మెఱిఁగి పరమేశ్వరు నాశ్రయించునో వాని
మముల నీశ్వరుఁడే వహించుచున్నాఁడు

హృత్పీఠస్థం తమచ్ఛన్నం మహాతేజస్వినం విభుం
భూమిజాసహితం వందే రాఘవం ద్విపదాంవరం॥

వివేకసార నిర్ణయము
సమాప్తము

ఇది
శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచింపఁబడినది.

శ్రీరామాయనమః

# ఆత్మతత్త్వవివేకము

శ్లో॥ నత్వా రామం మహాత్మానం వ్యాప్తం యేన చరాచరం
వక్ష్యామ్యహం ముముక్షూణా మాత్మతత్త్వ వివేచనం॥

1 తెలియనియర్థమును తెలియుటకు సాధనమైనది ప్రమాణ మనఁబడును

2 ప్రమాణములు ప్రత్యక్షము మొదలగు నాఱును బుద్ధిమంతులచే నిర్ణయింపఁబడినవి

3 ప్రత్యక్షాదులందు శాబ్ద మొకటియై యున్నది

4 ఇంద్రియ మింద్రియాంతరార్థమును వలె ప్రమాణ మన్యప్రమాణ గోచరార్థమును ప్రతిపాదింప నేరదు

5 ప్రతిపాదించెనేని అది ప్రమాణాభాసమనఁబడును గాని ప్రమాణ మనఁబడదు

6 యథార్థవాదియొక్క వాక్యముగాని అట్టి శాస్త్రముగాని శబ్ద ప్రమాణ మనఁబడును

7 'అస్యమహతోభూతస్య' అను శ్రుతివల్ల వేదము పరమేశ్వర కల్పితమని నిర్ణయింపఁబడుచున్నది

8 అందువల్ల వేదము భ్రమప్రమాదాది దోషయుక్తము గానేరదు

9 అన్యప్రమాణ గోచరముగాని యర్థమును ప్రతిపాదించుటచే వేదము శబ్దప్రమాణము

10 వేదశిరస్సు లగుటచే ఆత్మతత్త్వమును ప్రతిపాదించెడి యుపనిషత్తులును అట్టివే

11 ఉపనిషత్తులకు మాత్రమే ఆత్మతత్త్వము వేద్యము

12 'తంత్వౌపనిషద' మ్మను శ్రుతి ఇయ్యర్థమునే బలపఱుచుచున్నది

13 ఎందువల్ల ఆత్మతత్త్వము శబ్దప్రమాణ గోచరమో అందువల్ల
ప్రమాణమున కగోచరము

14 ఆత్మతత్త్వ మన్యప్రమాణ గోచర మంటివేని శ్రుతికి
ప్రామాణ్యము లేదు

15 ఉపనిషత్తు శబ్దప్రమాణ మగుటచే ఆత్మతత్త్వ మన్యప్రమాణ
రము గానేరదు

16 శ్రుత్యర్థ నిర్ణయమునందు యుక్తియు గ్రాహ్యము

17 ఉపక్రమాదిలింగ నిర్ణయరూప మగు యుక్తి ప్రధానము

18 శ్రుత్యనుకూల తర్కయుక్తియు గ్రాహ్యము

19 కుతర్క మగ్రాహ్యము

20 'నైషాతర్కేణ మతి రపనేయా', 'తర్కాప్రతిష్ఠానాత్' అను
సూత్రములు కుతర్కమును నిరసించుచున్నవి

21 శ్రుత్యర్థ మెఱుఁగరానిపట్ల వేదాంతసూత్రములు సాధనము

22 సంశయాస్పదమగు సూత్రార్థనిర్ణయ సందర్భమున స్వమత
పట్ల పరమతముల ఖండించుట కుపక్రమించిన కపిల కణాదాది శాస్త్ర
ర్తలచేఁ జేయఁబడిన వ్యాసానువాదము గ్రాహ్యము

23 వ్యాసానువాదము నాశ్రయించి వ్యాసతాత్పర్య నిర్ణయము
సందర్భమున పారిశేషికన్యాయ మాశ్రయణీయము

24 పారిశేషికన్యాయము నాశ్రయించుటచే వ్యాసతాత్పర్య
తమే యని సిద్ధాంతము

25 సులభముగఁ దెలియ సాధనమగుటచే "వ్యాస తాత్పర్య నిర్ణ
" పరమాదరణీయము

26 సూత్రతాత్పర్య మద్వైతమగుటచే శ్రుతితాత్పర్యమును అద్వైతమే

27 అందువల్ల సర్వశాస్త్ర తాత్పర్య మద్వైతమే

28 సూత్రతాత్పర్య మద్వైతమగుటచే శంకరసిద్ధాంతమే పరమాదరణీయము

29 శంకరసిద్ధాంతము కేవలాద్వైతమే

30 అందువల్ల ప్రత్యగ్బ్రహ్మైక్య జ్ఞానమే మోక్షసాధనము

31 దురవగాహమగు నాత్మతత్త్వము శ్రుత్యనుకూల తర్కముచే నిర్ణయింపఁదగినది

32 తర్కమునకు యుక్తిసాధనము

33 శ్రుతినివిడిచి యుక్తినిమాత్ర మాశ్రయించినవాఁడు ఇష్టార్థమును బొందకపోవుటయేగాక యనర్థమును బొందుచున్నాఁడు

34 అందువల్ల శ్రుత్యర్థమును నిస్సంశయముగ నెఱుఁగుట కొఱకు శ్రుతిసహిత యుక్తిసంగ్రహము నాచేఁ జేయఁబడుచున్నది

35 అవాంతరవాక్యము లన్వయ వ్యతిరేకములచేత ప్రత్యగాత్మను దేహాదికమునుండి విభజించి చూపును

36 మహావాక్యము లద్వైతాత్మయందు కల్పిత జడపదార్థముల నిశ్శేషముగ నిరసించి ప్రత్యగ్బ్రహ్మైక్యమును బోధించును

37 సర్వవాక్యములును అద్వైతాత్మను బోధించుటకొఱకు ప్రవర్తించుచున్నవి.

38 అందువల్ల శ్రుతిప్రతిపాదితాద్వైతాత్మ తత్త్వ మీక్రమమున నిర్ణయించి చెప్పఁబడుచున్నది

39 1 అహంకారార్థ నిర్ణయము 2 వాక్యతాత్పర్య నిర్ణయము 3 అద్వైత నిర్ణయము 4 ముక్తిస్వరూప నిర్ణయము అని

40 ఇందు ప్రతిపాదింపఁబడు అద్వైతాత్మతత్త్వమునం దాదర
రేకపోవుటకు హేతువులు లేనందున శ్రోత్యర్థంబగు నీయాత్మతత్త్వము
ఎన పరమాదరణీయమై యొప్పుఁగాక

41 నిరాదరణహేతువులు ఎందువల్ల లేవనిన చెప్పఁబడుచున్నది

42 అన్ని ప్రమాణములయందును అనాదరణకు నాలుగు హేతువు
)

43 మరియొక ప్రమాణముచే ప్రతిపాదింపఁబడు నర్థమును ప్రతి
చుట 2 విరుద్ధార్థమును ప్రతిపాదించుట 3 సందిగ్ధార్థమును ప్రతి
చుట 4 ఏయర్థమును ప్రతిపాదింప కుండుట అని

44 'నద్యాస్తీరే పంచఫలాని సన్తి' నదీతీరమందైదుపండ్లు గలవు
త్యాది కారికయును, వాయుర్వై క్షేపిష్ఠా దేవతా, వాయువు వేగముగా
మన్నట్టి దేవత అను నిత్యాది వేదవాక్యములును మరియొక ప్రమాణ
ప్రతిపాదింపఁబడు నర్థమును ప్రతిపాదించుచున్నవి

45 'అంబుని మజ్జం త్యలాబూని గ్రావాణః ప్లవంతే' సొరకాయ
నీటిలో మునుఁగుచున్నవి. రాళ్ళు తేలుచున్నవి అనునిత్యాది లౌకిక
ములును, 'ఆదిత్యో యూపః' సూర్యుఁడే యూపస్తంభము ఇత్యాది
క్యములును ప్రమాణాంతరములకు విరుద్ధమైన యర్థమును ప్రతిపా
మన్నవి

46 'స్థాణుర్వా పురుషోవా, స్థాణువా లేక పురుషుఁడా అను
ది లౌకికవాక్యములను' కోహి తద్వేద యద్యముష్మిన్ లోకేఽ
నవా, పరలోకమందేదిగలదో ఏదిలేదో దాని నెవఁడెఱుఁగును అను
ది వేదవాక్యములును సందిగ్ధార్థమును ప్రతిపాదించుచున్నవి

47 శంఖ భేరీ శబ్దములును వేదమునందలి 'హుంఫట్' వౌషట్
లును అర్థశూన్యములు

48 వీనియందు నిరాదరణబుద్ధి యుదయింపవచ్చును

49 వేదాంతములు ప్రమాణాంతరము ప్రతిపాదింపనేరని దుఃఖశూన్యమైన యాత్మను నిష్కళంకముగా ప్రతిపాదించు చున్నందునను 2 ప్రత్యక్షాదిక మహంసుఃఖీత్యాది లక్షణముగల దేహవిశిష్టాత్మను బోధించుచుండఁగా శ్రుతి తద్విరుద్ధ లక్షణ మగుపరమానంద స్వరూప ప్రత్యగాత్మను ప్రతిపాదించు చున్నందునను 3 నేతినేతీత్యాది శ్రుతియుక్తులచేత దేహాద్యహంకారాంత జడపదార్థములు నిరసింపఁబడుచుండఁగా పరిశుద్ధాత్మ స్వరూపము నిస్సంశయముగా తెలియఁబడుచున్నందునను 4 అథ యోవేదేదం జిఘ్రాణీతి సఆత్మా, కతమఆత్మేతి యోఽయం విజ్ఞానమయః ప్రాణేషుహృద్యంత ర్జ్యోతిః పురుషః అనునిత్యాది శ్రుతులను అన్వయవ్యతిరేకములచేత ఆత్మతత్త్వమును ప్రతిపాదించి 'తత్త్వమసి' 'అహంబ్రహ్మాస్మి' అనుశ్రుతులచే నఖండార్థమును విస్పష్టముగ ప్రతిపాదించు చున్నందునను పైదోషములు నాల్గును వేదాంతములయందుఁ గనుపింపవు

50 అందువల్ల ఆత్మతత్త్వము నిరాదరణచేయఁ దగినది కాదు

51 ప్రయోజనరహిత మగుటయే నిరాదరణబుద్ధి కివకాశమనెడి శంకకు సమాధానము చెప్పఁబడుచున్నది

52 సమస్తజీవులచేత నొక్కటియగు నేదుఃఖము ద్వేషింపఁబడుచున్నదో యేసుఖము ఇచ్ఛగింపఁబడుచున్నదో యా దుఃఖ నివృత్తియు, సుఖప్రాప్తియు నాత్మతత్త్వ మెఱుఁగుటవల్ల సిద్ధించుచున్నందున నాయాత్మతత్త్వము ప్రయోజన రహిత మని నిరసింపఁదగినది కాదు

53 అందువల్ల సర్వజనాదరణీయమగు నీయాత్మతత్త్వము చెప్పఁబడుచున్నది

54 అహమను శబ్దమునకు దేనిని ప్రతిపాదించుటయందు తాత్పర్యమో అది యాత్మయనుట సర్వవాది సమ్మతము

55 అహంశబ్దముయొక్క తాత్పర్యము దేనియం దన్వయింపదో అది యాత్మ కాదని పిండితార్థము

56 దేహము ఇంద్రియములు మనస్సు బుద్ధి అహంకారము
ములు నహంశభాగము లేమోయని సంశయింపఁదగియున్నవి
57 అందువల్ల సంశయ నివృత్తికొఱకు వివరింపఁబడు చున్నది
58 ఇంద్రియములకు దృశ్యమగు ఘట మేప్రకార మాత్మ కానే
ప్రకార మాయింద్రియ ములకే దృశ్యమగు దేహ మాత్మ కానేరదు
59 ఇంకను అనేకావయవ కల్పిత మగుటవల్లను, షడ్భావ వికార
లదగుటవల్లను, ఘటాదికమువలె ఆత్మీయమనెడి వ్యవహార ముండుట
స్వప్నముతో సంబంధింపక పోవుటవల్లను, ఘటాదికమువలెరూప
కము కలిగి యున్నందునను, దేహమున కాత్మత్వము నిరాక
గినది
60 తమకు దేహమువలె తాము మనస్సునకు దృశ్యములై యున్నం
శరీరమువలె సాధనరూపములుగ ఉన్నందువల్లను, 'మమ'యని
వ్యవహార ముండుటవల్లను, స్వప్నసుషుప్తులందు లేని వగుటవల్లను
ము లాత్మ కానేరవు
61 ఇంద్రియముల కాత్మత్వ మంగీకరించిన నివారింపశక్యముగాని
ప్రాప్తించును
62 సముదాయరూప మాత్మయా? ప్రత్యేకముగ నాత్మయా?
ప్పము
63 ఒకటి నశించినపుడు సముదాయమునకు వినాశము సంభ
దునను, ఒకటి యున్నపుడు అన్నియు నుండనందునను సముదాయ
గాత్మ కానేరదు
64 అంధునకు బధిరత్వము బధిరున కంధత్వము నుండక పోవుటయే
ము
65 ప్రత్యేకముగ నాత్మత్వము గలదనిన శ్రోత్రేంద్రియ వ్యవ
కును చక్షురింద్రియ వ్యవహారమునకును సంబంధ ముండఁగూడదు

66 క్రియలయం దానుకూల్యమేగాని ప్రాతికూల్య ముండనందు నను, అశ్వికునిచే నశ్వములవలె నొక నాయకునిచే పాలింపఁబడుచు పరస్పర సంబంధము గలిగియున్నందునను, ఒక్కొకయింద్రియమునకు ప్రత్యేకముగ నాత్మత్వముఁ జెప్పుట యుక్తముగాదు

67 ఇందువల్ల ఇంద్రియము లాత్మ కానేరవు

68 మనస్సు ఇంద్రియములవలె కరణమగుటవల్లను మదీయమనెడి వ్యవహారమువల్లను సుషుప్తియందు లేకపోవుటవల్లను అత్మ కానేరదు

69 ఈ న్యాయము బుద్ధియందును యుక్తమే

70 అహమ్మని దృశ్యమగుటచేతను మదీయమనెడి వ్యవహారము చేతను సుషుప్తియందు లేకపోవుటచేతను అహంకార మాత్మ గానేరదు

71 ప్రాణములకు సుషుప్తియందు విలయములేకపోయినను, అత్మీయ మనెడి వ్యవహారమువల్లను దృశ్యత్వమువల్లను అత్మత్వము నిరాకరింపఁ బడినది

72 అందువల్ల సంశయరూపములగు దేహాద్యహంకారాంత జడ పదార్థములం దాత్మత్వాభిమానము చేయఁదగదు

73 సుషుప్తికాలికమగు 'నేనేమియు నెఱుఁగ' ననెడి వ్యవహారము జడమగు నజ్ఞానమునకుఁ జెప్పఁదగనందున అజ్ఞానమునకును ఆత్మత్వము నిరాక రింపఁదగినది

74 ఘటముయొక్క జడత్వము ఘటమునకు వేద్యముగానట్లు జడ మగు నజ్ఞానముయొక్క, ఎఱుఁగననెడి జడస్వభావ మజ్ఞానమునకు తెలియదు

75 ఘటముయొక్క జడత్వము ఘటద్రష్టకుమాత్రమే వేద్యమగు నట్లు అజ్ఞానముయొక్క జడత్వము ద్రష్టయగు తత్సాక్షికిమాత్రమే వేద్య మనవలయును

76 సుషుప్తియందలి స్వపరజ్ఞాన శూన్యత్వము సుఖిత్వము జాగ్ర దవస్థయందు స్ఫురించుటవలన సుషుప్తిద్రష్టగలఁడనియును సుషుప్తిద్రష్టచే

గఁబడిన విషయమే జాగ్రదవస్థయందు స్మరింపఁబడుచున్న దనియు
రింపకతప్పదు

77 సుషుప్తిద్రష్ట కాంతరుఁడై సుషుప్తిదష్టను ప్రకాశింపఁజేసెడి
ఒక ద్రష్ట నంగీకరింపరాదు

78 సుషుప్తి స్మృతిప్రసిద్ధమై యున్నందున స్మృతినాశ్రయించి
మానముచే సుషుప్తిద్రష్ట అంగీకరింపఁబడెను

79 అనుమానము నాశ్రయించి మఱియొక యనుమానపదార్థము
రించిన అదిమఱియొక 'అదిమఱియొక' యని ఇట్లనవస్థ ఏర్పడును

80 అందువల్ల అనుమానముచే నిర్ణయింపఁబడిన పదార్థము నాశ్ర
) మఱియొక పదార్థము ననుమానించుట యుక్తము కాదు

81 ఈ హేతువువల్ల సుషుప్తిద్రష్టను ప్రకాశింపఁజేసెడి మరి
పదార్థ మంగీకరింపఁబడదు

82 అందుచే సుషుప్తిద్రష్టకే స్వప్రకాశత్వము నిర్ణయింపఁబడినది

83 అహంశబ్దార్థమగు పదార్థమును సుషుప్తిద్రష్టకంటె నన్యమైన
గా నూహింప నలవిగానందున సుషుప్తిద్రష్టకే ఆత్మత్వ మంగీకరింపఁ

84 'కతమఆత్మేతి యోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంత
పురుషః' అనుశ్రుతియు సుషుప్తిద్రష్టకే యాత్మత్వమును చెప్పు
ది

85 ఈ యాత్మకే ద్రష్టృత్వము, సర్వపదార్థ విలక్షణత్వము
'ద్రష్టా శ్రోత్రస్యద్రష్టా మనసోద్రష్టా వాచోద్రష్టాబుద్ధేర్ద్రష్టా ప్రాణ
ష్టా తమసోద్రష్టా తతస్సర్వస్మా దన్యో విలక్షణః అనుశ్రుతి చెప్పు
)

86 శ్రుతిప్రసిద్ధమగు నీయాత్మను ,అథయో వేదేదం జిఘ్రాణీతి
త్మ, అనునిత్యాది శ్రుతి అనుభవవేద్యమైన దానినిగా చెప్పుచున్నది

87 జ్ఞాతృత్వ స్వభావ ముండుటవలన నీయాత్మ జ్ఞానస్వరూప మని నిశ్చయింపఁబడుచున్నది

88 చక్షురాదీంద్రియ జ్ఞానములు ఇంద్రియముల వలెను ఇంద్రియార్థముల వలెను పరస్పర విభిన్నములై యుండక ఏకాకారత్వము గలిగియున్నట్లు జ్ఞాతృత్వ ధర్మమునుబట్టి తెలియఁబడు చున్నందున పంచేంద్రియ వ్యవహారకాలమగు జాగ్రదవస్థయందు జ్ఞానస్వరూపమున కేకాకారత్వము నిశ్చయింపఁబడుచున్నది

89 జాగ్రదవస్థయం దీజ్ఞానమున కెట్టిధర్మము నిశ్చయింపఁబడుచున్నదో అట్టి జ్ఞాతృత్వధర్మమే స్వప్నావస్థయందును ఉన్నటుల తెలియఁబడుచున్నందున స్వప్నకాలానుభవరూప మగు జ్ఞానమునకును జాగ్రదవస్థా కాలానుభవరూప మగు జ్ఞానమునకును పరస్పర విభిన్నత్వమును ప్రతిపాదించుట సమంజసముగా నుండదు

90 అందువలన జాగ్రత్స్వప్న కాలానుగతములగు జ్ఞానముల కేకత్వము నిశ్చయింపఁ బడుచున్నది

91 నిద్రనుండి లేచినవాని వ్యవహారమునుబట్టి సుషుప్తియందును జ్ఞాతృత్వధర్మము గల జ్ఞానముకలదని నిర్ణయింపఁదగియున్నది

92 జాగ్రత్స్వప్న కాలానుభవరూప మగు జ్ఞానమునకంటె సుషుప్త్యనుభవరూప మగు జ్ఞానమునకు విలక్షణత్వము తెలియఁబడనందున సుషుప్తికాలానుభవరూపమగు జ్ఞానమునకు జాగ్రత్స్వప్న కాలానుభవరూప మగు జ్ఞానముతో నేకత్వము నిష్కర్షింపఁబడుచున్నది

93 ఒకదినమునందలి జ్ఞానమువంటిదిగనే ప్రతిదినమును జ్ఞానము తెలియఁబడు చున్నందున ఒకదేహమునందలి జ్ఞానస్వరూపమునకు ఏకత్వము నిర్ణయింపఁదగియున్నది

94 ఒకదేహమందు జ్ఞానస్వరూపమునకు ఏకత్వము సిద్ధించినట్లు ప్రతిదేహమందును జ్ఞానమున కేకత్వము సిద్ధించుచున్నది

95 ఒక యవస్థయందలి జ్ఞానము వంటిదిగనే రెండవ యవస్థయం
జ్ఞానమును ఉండునట్లు ఒక దేహమునందలి జ్ఞానమువంటిదిగనే ప్రతి
కునందలి జ్ఞానమును అయియున్నది

96 అందువల్ల సర్వోపాధుల యందును ఏకాకారత్వము వహించి
౨ జ్ఞానవస్తువున కద్వయత్వము నిర్ణయింపఁదగియున్నది

97 ఈ హేతువువల్ల [సర్వోపాధులయందలి] ఆత్మయొక్క—టే
నిశ్చయింపఁబడుచున్నది

98 ఘటభేదముచే నాకాశభేదమువంటిదే అంతఃకరణభేదముచే
భేదమనుట శ్రుతిసమ్మతము

99 ఆకాశమువలె నాత్మ పరిచ్ఛేదరహిత మైనది

100 ఘటోత్పత్తి వినాశములచే నాకసమునకు ఉత్పత్తివినాశములు
ట్లు ఉపాధుల యుత్పత్తి వినాశములచే నాత్మకును ఉత్పత్తివినాశ
గలుగవని యెఱుఁగవలయును

101 ఆత్మకు నుత్పత్తివినాశములు గలవనిన సాక్షి యుండవల

102 సాక్షి లేనందునను, తనయుత్పత్తివినాశములకు తానే సాక్షి
అసంగత మగుటచేతను ఆత్మకు ఉత్పత్తి వినాశముల చెప్పఁగూడదు

103 అందువల్లనే; నిత్యత్వమును నిత్యత్వమువల్ల సత్యత్వమును
ంగీకరింపవలయును

104 అనుభవైక వేద్యమగు ఈ యాత్మకు నిత్యత్వ మంగీకరింపఁ
ఎన నిరవయవత్వము నంగీకరింపవలయును

105 అవయవములు గల పదార్థము పరిణామవంతమై వినాశము
చున్నందున దానికి నిత్యత్వము చెప్పఁదగినది కాదు

106 అందువల్ల ఆత్మకు నవయవముల నంగీకరించిన నిత్యత్వము
వని నిరవయత్వము చెప్పఁబడినది

107 శ్రుతియందును 'నజాయతేమ్రియతే' 'అజో నిత్యశ్శాశ్వతోయం' అను శ్రుతులచే నుత్పత్తి వినాశరహితత్వము నిత్యత్వము నంగీకరింపఁబడిన యాత్మకే 'ఆకాశవత్సర్వగతశ్చనిత్యః' అవికారీ వాఽరేయమాత్మా అను వాక్యములచేత నిరవయవత్వము పరిణామరహితత్వము చెప్పఁబడినవి

108 నిరవయవపదార్థ మాకసమువలె సర్వవ్యాపకము నపరిచ్ఛేద్యమును నై యున్నదగుటచే ఆత్మకు సర్వవ్యాపకత్వమును అపరిచ్ఛేద్యత్వమును నంగీకరింపవలయును

109 సర్వవ్యాపకత్వముచే నసంగత్వమును సిద్ధమే

110 ఆత్మకసంగత్వము 'అసంగోహ్యయంపురుషః' అను శ్రుతివల్ల తెలియఁబడుచున్నది

111 నిరవయవ పదార్థమునకు రెండు పరస్పర విరుద్ధములగు ధర్మములు గలవనుట అంగీకరింపఁ దగనందున జ్ఞానస్వరూపమగు ఆత్మకు జడత్వము ధర్మమని చెప్పఁదగదు

112 ఆత్మకాంతరమగు పదార్థ మొందుగలదని యూహింపనలవిగానందునను శ్రుతియందు ప్రతిపాదింపఁబడనందునను సర్వపదార్థముఁ కాంతరపదార్థము ఆత్మయొక్కటే యని నిశ్చయింపవలెను

113 అందుచే నాత్మయే సర్వాధారము

114 ఆత్మకు సర్వాధారత్వ మంగీకరింపఁబడినందున బాహ్యపదార్థము లన్నియు నుత్పత్తి వినాశవంతములని అంగీకరింపవలెను

115 ఆధారముగల పదార్థ ముత్పత్తివినాశవంతమై యుండుటచేత నిరాధారత్వముచే సర్వాధారమగు పదార్థమునకు నిత్యత్వము సిద్ధించుచున్నది

116 నిత్యత్వముగల పదార్థమున కవయవములు చెప్పఁగూడనందునను సర్వాధారమగు పదార్థమునకు నిరవయవత్వము అనివార్యమైనందునః

నువికి పరిచ్ఛిన్నత్వము చెప్పఁగూడదనందునను నిరాధారమగు పదార్థ
కనేకత్వము సిద్ధింపనందునను నిరాధారము సర్వాధారము నగుపదార్థ
కద్వితీయత్వము నిశ్చయింపవలయును

117 ఆత్మ ఏకము అద్వితీయము నని శ్రుతి వక్కాణించుచున్నది

118 సర్వాధారమగుటచే తన్ను ప్రకాశింపఁజేసెడి వేఱొక పదా
లేనందున ఈ యాత్మకు స్వయంప్రకాశత్వమును తనకు బాహ్యములగు
పదార్థములను ప్రకాశింపఁజేయుచున్నందున సర్వప్రకాశకత్వమును
ఁబడుచున్నవి

119 భోగ్యార్థములు మొదలహంకార పర్యంతముగల పదార్థ
ొకటికంటె నొకటి సమీపమున నున్నవగుచు సామీప్యాతిశయ
ట్టి ప్రీతివిశేషవిషయము లగుచుండ సర్వాంతరమగు నీయాత్మ నిరు
:క ప్రీతివిషయ మగుచున్నది

120 నిరుపాధిక ప్రీతివిషయమగుటచే నిరతిశయ ప్రీతివిషయత్వ
ం నిరతిశయప్రీతి విషయత్వముచే నిరతిశయ సుఖస్వరూపమును ఈయాత్మ
శ్చయింపఁదగినది

121 నిత్య నిరుపాధికంబగు నిరతిశయ సుఖస్వరూపాత్మయే
స్వరూపమైయుండియు పురుషుఁడు అనిత్యత్వ దుఃఖిత్వాది ధర్మములు
వానివలె భ్రమించుచున్నాఁడు

122 ఈభ్రమకు ఆత్మానాత్మల యన్యోన్యాధ్యాసమే కారణము

123 ఎందువల్లననిన చెప్పఁబడుచున్నది

124 ప్రతిపురుషుఁడును నేనుకర్తను నేనుభోక్తను, సుఖిని దుఃఖిని.
ఈ రూపముగ వ్యవహరించుచుండుట ప్రత్యక్షానుభవ సిద్ధమైయున్నది

125 జడమగు బుద్ధికిని నిర్వికారియగు నాత్మకును వ్యవహారము
ంపదు

126 సాన్నిధ్యమాత్రమున దేనికిని సంభవింపదు

127 అందువల్ల వ్యవహారసిద్ధికొఱకు ఆభాస మంగీకరింపఁదగినది

128 ఆదిత్యాభాసముచే జలమున కౌష్ణ్యమువలె ఆత్మాభాసముచే బుద్ధికి జ్ఞాతృత్వము సిద్ధించుచున్నది

129 ఈజ్ఞాతృత్వము తప్తాయఃపిండమునకు దాహకత్వమువలె బుద్ధికి సంభవించుచున్నది

130 బుద్ధివృత్తులకు జ్ఞాతృత్వము తప్తాయఃపిండమునుండి వెలువడెడి మిణుఁగురుల దాహకశక్తివలె నూహ్యము

131 వహ్నియొక్క దాహకత్వ మయఃపిండమునందువలె ఆత్మయొక్క జ్ఞాతృత్వము బుద్ధియం దధ్యసింపఁబడినది

132 జలచలనాదిక్రియ లాదిత్యునందువలె బుద్ధియొక్క కర్తృత్వమాత్మయం దారోపింపఁబడినది

133 అందువల్ల ఆత్మయొక్క సత్యత్వము జ్ఞాతృత్వము చిదాభాససహితాంతఃకరణముచే నపహరింపఁబడి బుద్ధిసంబంధములగు సర్వవ్యవహారములును ఆత్మయం దధ్యసింపఁబడుచున్నవి

134 అందుచే నహంత్వము దాని నాధారముగఁగొనిన మమత్వము జ్ఞానేచ్ఛా సుఖదుఃఖ ప్రయత్నాదులు ఆత్మధర్మములుగ వ్యవహరింపఁ బడుచున్నవి

135 ఈహేతువువల్లనే ఆత్మ కనర్థము సంభవించుచున్నది

136 మమత్వము జ్ఞానేచ్ఛా సుఖదుఃఖాదులు అహంత్వమే కారణముగాఁగలవియై యున్నందున అహంత్వము నివర్తింపగనే నివర్తించుచున్నవి

137 అందువల్ల సర్వానర్థనివృత్తికొఱకు అహంకార మాత్మధర్మము కాదని చెప్పఁబడుచున్నది

138 అహంత్వ మాత్మధర్మమనిన ఆత్మయందు కర్తృత్వ కర్మత్వములు రెండునుఁ గలవని చెప్పవలయును

139 కర్తృత్వకర్మత్వములు రెండును ఏకవస్తువునం దుండవు

140 ఉండుననిన లోకవిరుద్ధము

141 దాహకత్వస్వభావము గల అగ్నియందు దాహ్యత్వములేదు

142 ప్రకాశకుఁడగు ఆదిత్యునందు ప్రకాశ్యత్వము లేదు

143 జ్ఞాతకు జ్ఞేయత్వములేదు

144 అందువల్ల ఆత్మయందు కర్తృత్వ కర్మత్వములు రెండును ) చెప్పఁగూడదు

145 కలవనిన జ్ఞాతయగు నాత్మకు జ్ఞేయత్వమును చెప్పవలయును

146 జ్ఞాతయగు నాత్మకు జ్ఞేయత్వమును చెప్పిన తనవల్లననిగాని ంశమువల్లననిగాని తనధర్మమువల్లననిగాని చెప్పవలయును

147 ఇందు నేపక్షమును యుక్తముగాదు

148 ఎందువల్లననిన ఆత్మ నిరవయవము సర్వసమము అభిన్నము వందున

149 జ్ఞాతయగునప్పు డంతయు జ్ఞాతయే

150 అందువల్ల నప్పుడు జ్ఞేయత్వము సంభవింపదు

151 జ్ఞేయత్వమును జెప్పిన తత్కాలమందే జ్ఞాతృత్వమును క చెప్పఁగూడదు

152 జ్ఞాతయగునప్పుడు జ్ఞేయత్వము సిద్ధింపనందునను జ్ఞేయత్వ నంగీకరించిన తత్కాలమందే జ్ఞాతృత్వమును చెప్పఁగూడనందునను ృత్వ జ్ఞేయత్వములు రెండును ఆత్మకుచెప్పరాదు

153 జ్ఞాతయైనందున ఆత్మకు జ్ఞేయత్వములేదు

154 వ్యవహార మంతఃకరణమునకు సంబంధించిన దగుటచే వ్యవ ము నాశ్రయించి ఆత్మయందు జ్ఞాతృత్వజ్ఞేయత్వములు రెండునుఁ గల నిర్ణయింపఁగూడదు

155 జ్ఞాతయొక్క జ్ఞానమునకు జ్ఞేయత్వములేదు

156 అందువల్ల ఆత్మధర్మమున కాత్మకువలె జ్ఞేయత్వము లేదు

157 జ్ఞేయమగుధర్మము జ్ఞేయపదార్థమునకే సంబంధించియుండును

158 అగ్నిని ఉష్ణమువలె వస్తుధర్మము, వస్తువును విడిచి యుండదు

159 అందువల్ల పదార్థమునకు జ్ఞేయత్వము లేకపోవుచుండఁగా ధర్మమునకు జ్ఞేయత్వము లేదు

160 ఆత్మకును ఆత్మధర్మమగు జ్ఞానమునకును జ్ఞేయత్వము లేనందున జ్ఞేయమగు ధర్మము నాత్మకుఁజెప్పరాదు

161 అంతఃకరణము జ్ఞేయమైనందున జ్ఞేయమగు అహంత్వ మంతఃకరణ ధర్మముగా చెప్పఁదగియున్నది

162 వస్తుధర్మములకు భేదము లేనందున వికారములేని పదార్థము యొక్క ధర్మమునకు వికారము లేదు

163 అటువలెనే నిత్యమగు పదార్థముయొక్క ధర్మ మాగంతుకత్వమును పొందదు

164 పదార్థమునిత్యమైయుండ ధర్మమున కాగంతుకత్వము పరిణామముగల పదార్థములందు కనఁబడుచున్నను పరిణామములేనివాని యందు సంభవింపదు

165 వస్తుభిన్నముగ ధర్మముండనందున నిర్వికారాత్మయందు వికారవంతమగు ధర్మమును చెప్పఁగూడదు

166 అహంత్వ మాత్మధర్మమనిన ఆత్మకు నిర్వికారత్వము సిద్ధింపదు

167 వికారము నంగీకరించిన వినాశిత్వము నంగీకరింపక తప్పదు

168 సర్వాధారత్వాదులు గల యాత్మకు వినాశిత్వ మంగీకరింపఁదగదు

169 నిత్యము నిర్వికారము జ్ఞాతయగు నాత్మకు వికారియు జ్ఞేయము అగమాపాయియు నగు అహంత్వము ధర్మముగాఁజెప్పఁదగినది కాదు

170 అహంత్వము వలెనే జ్ఞేయత్వము అగంతుకత్వము విశేష ప్రకాశించుట యున్నందున మమత్వము జ్ఞానము ప్రయత్నము ర్మము అధర్మము మొదలగున వన్నియు నాత్మధర్మములు గావని దగినవి

171 సుఖదుఃఖములును జ్ఞేయత్వాదులవలన అహంకారము వంటి తను, ఏకవస్తువునం దుండఁదగని పరస్పర విరుద్ధధర్మములు గలిగి ందునను ఆత్మధర్మములు గావని పరిత్యజింపఁదగినవే

172 ఆత్మవలెను ఆత్మధర్మమగు జ్ఞానమువలెను గాక ఎయ్యవి ్వాదులను గలిగియున్నవో అవియెల్లను ఆత్మధర్మములుగ వ్యవహరింపఁ న్నను ఆత్మధర్మములు గావని పరిత్యజింపవలయును

173 ం ఆత్మకు అజ్ఞేయత్వమే ధర్మము

174 జ్ఞేయత్వాదులు లేని ఈయాత్మ జ్ఞేయమగు బుద్ధిని ప్రకాశిం ుట వలన జడమగు నీబుద్ధి చైతన్యవంతమై అహంకార మమకార త్నేచ్ఛా సుఖదుఃఖాది ధర్మములఁ బొంది ఆత్మవలె ప్రకాశించు ు

175 అందువల్ల జ్ఞేయములగు అహంకార మమకార ప్రయత్నే ధర్మములను జ్ఞేయమగు బుద్ధికిఁ జెప్పవలయునుగాని ఆత్మకు చెప్ప

176 స్వతః స్ఫూర్తిలేని బుద్ధ్యాదులకు స్ఫూర్తిని గలిగించుటవలన శక్రియ ఆత్మకు చెప్పఁదగియున్నందున ఆత్మకు నిర్వికారత్వ మెట్లం ప నగునను శంకకు సమాధానము చెప్పఁబడుచున్నది

177 ఘటాదికమున కాదిత్యునివలె బుద్ధ్యాదికమున కాత్మప్రకాశ గును

178 ఘటాదికము యొక్క భావాభావములం దాదిత్యునివలె ద్ధ్యాదికముయొక్క యునికిలేములయం దాత్మ యేకరీతిగనే ప్రకాశిం ున్నాఁడు

179 ఘటాదికమును ప్రకాశింపఁజేయుట యందు సూర్యునికి వలెనే బుద్ధ్యాదికమును ప్రకాశింపఁ జేయుటయం దాత్మకును వికారము గలుగనందున ప్రకాశకక్రియ గలదని ఆత్మయొక్క నిర్వికారత్వమును శంకింపరాదు

180 ఆదిత్యునకువలెనే ఆత్మకును ప్రకాశకక్రియ ఔపచారికమే

181 క్రమద్రష్టృత్వమువల్ల బుద్ధికి వికారమును, క్రమరహిత ఏక కాల సర్వద్రష్టృత్వమువలన ఆత్మకు నిర్వికారత్వమును సిద్ధించుచున్నవి

182 వికారవంతమగు బుద్ధిసంబంధమువలన ఆత్మకు వికారములు సంభవించుననుటయు సరికాదు

183 బుద్ధియొక్క వికారములకు ద్రష్టయై యున్నందున ద్రష్ట యగు నీయాత్మకు బుద్ధిసంబంధమువలన వికారములు సంభవింపవు

184 సుఖదుఃఖసంబంధముగల బుద్ధివృత్తులయందు వ్యాపించి యున్నను మాలిన్యాదు లాకాశము నంటనట్లు సుఖదుఃఖము లాత్మనంటవు

185 కేవల ద్రష్టృత్వముచేతనే యాత్మకు సాక్షిత్వము చెప్పఁబడు చున్నది

186 సర్వసాక్షియగు నీయాత్మయే అహంశబ్దార్థముగ నిర్ణయింపఁ దగియున్నది

187 అహంశబ్ద మహంకారవాచకమై యున్నను అహంశబ్దార మాత్మపరమై యున్నది

188 సుషుప్తియం దహంకారము లేకపోయినను అహంకారవాచ కమగు అహంశబ్దము సుషుప్తిద్రష్టయగు ఆత్మయందు; సుషుప్తినుండి మేలు కొన్నవానిచే ప్రయోగింపఁబడుచున్నందున అహంశబ్దార్థమాత్మ పరముగా దని యాక్షేపించుట కవకాశము లేదు

189 అహంశబ్దార్థముగ నిర్ణయింపఁబడిన ఈ యాత్మకు శబ్ద స్పర్శాదులు లేనందున ప్రత్యక్షాదిప్రమాణములు దానిని ప్రతిపాదింపనేరవు

190 శబ్ద ప్రమాణ మైనను ముఖ్యవృత్తిచేత బోధింపనేరదు

191 అందువల్ల అహంశబ్దార్థ నిర్ణయమునందు లక్షణావృత్తియే
శయింపందగినది

192 ఒకశబ్దముచేత ముఖ్యవృత్తిచే ప్రతిపాదింపంబడిన పదార్థమే
రియొకశబ్దముచేత లక్షణావృత్తిచే ప్రతిపాదింపంబడుచుండగా నేశబ్దము
తను ముఖ్యవృత్తిచే, ప్రతిపాదింపంబడనియాత్మ లక్షణావృత్తిచేత మాత్ర
ట్లు బోధింపంబడంగలుగునని సంశయింపనక్కఱలేదు

193 ఎయ్యది ముఖ్యవృత్తిచే ప్రతిపాదింపంబడు పదార్థముతో
ంబంధము గలిగియుండునో అయ్యది లక్షణావృత్తిచేత నిస్సంశయముగ
ధింపంబడును

194 అందువలన లక్షణావృత్తిచే ప్రతిపాదింపంబడిన పదార్థము
ఖ్యవృత్తిచేత బోధింపంబడినదిగా నుండవలయుననెడి నియమములేదు

195 శబ్దములు ముఖ్యవృత్తిచే బోధించెడి అహంకారముతోడి
దాత్మకు సంబంధ మున్నందున చిదాత్మను లక్షణావృత్తిచేత బోధించెడి
మర్థ్యము శబ్దములకు లేదనెడి శంక కవకాశములేదు

196 చిత్ప్రతిబింబమును ధరించియున్నందున చిదాత్మయే కాంబో
నని సంశయింపందగియున్న ఏయహంకారమందు ప్రయోగింపంబడెడి
హమాదిశబ్దములు గలవో ఆ యహమాదిశబ్దములచేతనే చిదాత్మ లక్షింపం
డును

197 'అయోదహతి' యనుశబ్దము ముఖ్యవృత్తిచేత నయఃపిండ
ను చెప్పుచున్నను లక్షణావృత్తిచే దాహకశక్తిగల అగ్నిని బోధించు
న్నట్టుల అహంశబ్దము ముఖ్యవృత్తిచేత నహంకారాదికమును బోధించు
న్నను లక్షణావృత్తిచేత జ్ఞాతృత్వ స్వభావముగల చిదాత్మను బోధించు
న్నది

198 అందువల్ల నహంశబ్దముయొక్క తాత్పర్యము చిదాత్మయే యని నిర్ణయింపఁబడినది

199 ఎవ్వఁడీప్రకార మెఱుఁగునో వాఁ డహంకారాదికమునం దాత్మత్వాభిమానముఁ జేయఁడు

అహంశబ్దార్థనిర్ణయము

సమాప్తము

ఇది

శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచింపఁబడినది

ఓంతత్సత్



శ్రీరామాయనమః

# ఆత్మతత్త్వవివేకము

## వాక్యతాత్పర్యనిర్ణయము

॥ అహంశబ్దస్య లక్ష్యార్థ ముక్త్వాత్వక్తంతమనుభ్రమం
జ్ఞాతుంస్వం సంప్రవక్ష్యామి వాక్యతాత్పర్యనిర్ణయః

1 స్వతఃజడములై అనుభవము నాశ్రయించి ప్రవర్తించెడి ప్రత్యను లనుభవస్వరూపుఁడైన యాత్మను ప్రతిపాదింప నేరవు

2 అందువల్ల ప్రత్యక్షాదులకు గోచరమగు సుఖదుఃఖాదిక మాత్మముగాదని నిరసింపఁబడినది

3 త్వమహ మిత్యాది ఆత్మబోధక పదములచేత లక్షింపఁబడెడి ప్రకు పరిపూర్ణాకారము ప్రత్యగభిన్న చైతన్యము వినా సిద్ధింపదు

4 తత్త్వమసివాక్యము త్వమహ మిత్యాది శబ్దలక్షితమగు ప్రత్యత్మకు బ్రహ్మచైతన్యముతోడి ఏకత్వమును ప్రతిపాదించుటకొఱకు ప్రవర్తించుచున్నది

5 త్వంపదమువల్ల ప్రత్యక్షాదులకు గోచరించు స్వరూప మొకటియు గోచరింపని స్వరూపమొకటియు తెలియఁబడునట్లు, తత్ పదమున్ను ప్రత్యక్షాదులకు వేద్యమగు సర్వజ్ఞత్వ పరోక్షత్వాది ధర్మముల స్వరూపమొకటియు వేద్యముగాని స్వరూపమొకటియు తెలియఁబడుచున్నవి

6 ప్రత్యక్షాదులకు వేద్యమగు స్వరూపమును శ్రుతి ప్రతిపాదింప నవసరము లేమిచేతను ప్రతిపాదించినః—అన్యప్రమాణ గోచరార్థమును ప్రతిపాదించిన దనెడి హేతువువల్ల ప్రామాణ్యమేకలది గాక పోవుటచేతను ప్రత్యక్షాదులు ప్రతిపాదింపనేరని ప్రత్యగభిన్న బ్రహ్మచైతన్యమునందే శ్రుతికి తాత్పర్యమని నిర్ణయింపఁదగియున్నది

7 ఇయ్యర్థమే ఉపక్రమాదులవల్ల నిశ్చయింపఁబడుచున్నది

8 రజ్జుసర్పభ్రాంతిగలవానికి భ్రాంతి నివృత్తికొఱకు రజ్జుస్వరూపము నెన్నిమార్లు బోధించినను సర్పస్వరూపము ననువదింపక పోయిన యెడల సర్పబుద్ధి నివర్తింపనట్లు, ఆత్మయందలి కర్తృత్వాది భ్రాంతి నివృత్తికొఱకు కేవలాత్మను బోధించెడి 'తదసి' యనువాక్యము నెన్నిమార్లు బోధించినను, భ్రాంతిమూలకమగు కర్తృత్వాది ధర్మములుగల స్వరూపము ననువదింపని యెడల భ్రాంతి నివర్తింపదు

9 అందువల్ల రజ్జుసర్పభ్రాంతి నివర్తింపఁజేయువాఁడు ముందుగా భ్రాంతిచే కనంబడెడి సర్పస్వరూపము ననువదించి పిమ్మట ఇదిసర్పము గాదని నిషేధించి రజ్జుస్వరూపమును బోధించునట్లు, ఉపనిషద్వాక్యములున ఆత్మ కనాదిసిద్ధములై యున్న కర్తృత్వాది ధర్మములను 'కర్తా బోద్ధా పిప్పలంస్వాద్వత్తి' అను మొదలగు వాక్యములచేత ననువదించి 'నేతి' నేతీత్యాది వాక్యములచేత నిషేధించి 'తత్త్వమసి' వాక్యముచేత ఆత్మయొక్క పరమార్థస్వరూపమును బోధించుచున్నవి

10 వాక్యమైనను, ఆరోపితధర్మముల ననువదించి నిషేధించని యెడల తాత్పర్యభూతమగు నర్థమును బోధింపఁజాలనందున తత్త్వమసి వాక్యార్థమును నిర్ణయించునపుడు తత్ త్వంపదార్థముల యందు ఆరోపిత ధర్మములు(ననువదింపఁబడిన వానిని,) నిషేధించి తాత్పర్యభూతమగు ఆత్మ యొక్క పరమార్థస్వరూపమును నిర్ణయింపవలయును

11 తత్ పద లక్ష్యార్థముతో త్వంపదలక్ష్యార్థమున కేకత్వము చెప్పునపుడు తత్ పద లక్ష్యార్థముతో కలియనికర్తృత్వ భోక్తృత్వాదికము త్వంపదవాచ్యార్థమును పరిత్యజింపవలయును

12 అటువలెనే త్వంపద లక్ష్యార్థముతో తత్ పదలక్ష్యార్థము కేకత్వమును నిశ్చయించునపుడు త్వంపద లక్ష్యార్థముతో కలియని సర్వజ్ఞత్వ పరోక్షత్వాదికమగు తత్ పద వాచ్యార్థమును విడువవలయును

13 'దశమ స్త్వమసి' యనువాక్యమువల్ల 'అహమేవదశమః' అను
ఁ కలుగునట్లు 'తత్త్వమసి' యనువాక్యమువల్లనే అహంబ్రహ్మాస్మియను
ఁకలుగును

14 ముందరగా తొమ్మండుగురను లెక్కించి వారివిషయమై
నము లేనివాఁడై, పదియవవాఁడెవఁడని విచారించువానికి ,నీవే పదియవ
'వను వాక్యమును వినఁగనే నేనే పదియవ వాఁడనను జ్ఞానము కలుగునట్లు
ఁగా త్వంపదార్థమును విచారించి దేహాద్యహంకారాంతము గల జడ
ముల నాత్మ కాదని నిషేధించి నేనెవఁడనని విచారించువానికి తత్త్వ
ాక్యము వాచ్యార్థ నిరసనపూర్వకముగా ,నీవాపరబ్రహ్మవే' యని
పఁగనే సకలాజ్ఞానము నశించి అహంబ్రహ్మాస్మి' యను జ్ఞానము
ను

15 త్వంపదార్థజ్ఞానము లేనివానికి తత్త్వమసి వాక్యార్థజ్ఞానము
దు

16 తొమ్మండుగురను లెక్కించి వానివిషయమై సంశయము లేని
ై యున్నను పదియవ వాఁడవు నీవే యనువాక్యమును వినఁడేని దశ
షయమైన యజ్ఞానము నశించి పదియవవాఁడను నేనే యనుజ్ఞానము
నట్లు, త్వంపదార్థమును విచారించియున్నను తత్త్వమసి వాక్యమును
ేని సకలాజ్ఞాన నివృత్తిపూర్వకమగు అహంబ్రహ్మాస్మియను జ్ఞానము
దు

17 ఒకసారి నేనే దశముఁడనను జ్ఞానము కలిగినవానికి మరల
ని విషయమై సంశయము కలుగనట్లు ఒకసారి, అహంబ్రహ్మాస్మి యను
ఁ కలిగినవానికి మరల నేను బ్రహ్మము నగుదునో కానో యను సందే
కలుగదు

18 అందువల్ల త్వంపదార్థమును చక్కఁగా విచారించి దేహాదిక
్మ గాదని నిషేధించినవానికి తత్త్వమసివాక్యమే విచారింప వలసి
ది

19 వాక్యార్థనిర్ణయమునందు సరిపడని జహల్లక్షణా అజహల్లక్షణల విడిచి జహదజహల్లక్షణయే గ్రహింపఁదగినది

20 'సోయందేవదత్తః' అనువాక్యమునందువలె పరిత్యాజ్యభాగమును విడిచి అనుకూలమగు భాగమును లక్షణావృత్తిచే గ్రహించువానికి తత్త్వమసివాక్యము సకలాజ్ఞానమును నశింపఁజేసి పరమార్థజ్ఞానమును బుట్టించును

21 ఎవ్వఁడీప్రకార మెఱుఁగునో వానికి ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞానము కరతలామలకము

వాక్యతాత్పర్య నిర్ణయము

సమాప్తము

ఇది

శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే

రచింపఁబడినది.

ఓం

శ్రీరామాయనమః

# ఆత్మతత్త్వవివేకము.

## అద్వైత నిర్ణయము

1 ద్వైతభ్రమనివృత్త్యర్థం మహాత్మా యద్విచారయేత్
తత్తత్త్వం పరమాద్వైతం శ్రుత్యర్థం కథయామ్యహమ్॥

1 ప్రత్యగాత్మయొక్క అసాధారణాకార మెఱుంగఁబడు వఱకు ప్రత్యగ్బ్రహ్మైక్య జ్ఞాన ముదయింపనట్లు బ్రహ్మముయొక్క అసాధారణాకార మెఱుంగఁబడు వఱకును ద్వైతభ్రమ నివర్తింపను

2 ప్రత్యగ్బ్రహ్మములకు భేదముఁ జూచినవానికివలె ద్వైతజ్ఞానము గలవానికిని పునర్భవమును శ్రుతిప్రతిపాదించుచున్నది

3 బ్రహ్మముయొక్క అసాధారణాకారమగు అద్వైతస్వరూప మెఱుంగఁబడువఱకును ద్వైతభ్రమ నివర్తింపను

4 అందువల్ల ద్వైతనివృత్తికొఱ కద్వైతము నిర్ణయింపఁబడుచున్నది

5 దేనికి ఉత్పత్తివినాశములు గలవో దానికి, ఘటమునకు వలెనే కారణవస్తు వొకటి యుండుటచేత, ఉత్పత్తివినాశములు గల ప్రపంచమునకును కారణవస్తు వొకటి యూహింపఁదగియున్నది

6 ఏది కారణవస్తువును కలిగియుండునో అది కార్యమని చెప్పఁబడుచున్నందున జగత్కారణముగ నూహింపఁబడెడి పదార్థము మరియొక కారణవస్తువును కలదియై యుండకూడదు

7 కారణవస్తువును కలిగియుండెనేని దానినిఁగూడ కార్యవర్గములో చేరనదానినిగనే నిశ్చయింపవలయును

8 అందువల్ల కారణరహితమగు పదార్థమునకే జగత్కారణత్వమును చెప్పవలయును

9 సర్వకారణమగు పదార్థము కార్యవర్గములో చేరని దగుట వలన దానికి నుత్పత్తివినాశములం జెప్పంగూడదు

10 ఉత్పత్తివినాశములు గల పదార్థము తనయుత్పత్తివినాశముల కాధారమగు పదార్థమును కలిగియున్నందున దానికి సర్వకారణత్వము చెప్పంగూడదు

11 అందువలన సర్వకారణత్వముచే కారణరహితమైన జగత్కారణ వస్తువునకు నుత్పత్తివినాశములు అంగీకరింపందగినవి కావు

12 ఉత్పత్తివినాశములులేని పదార్థమునకు నిత్యత్వమును నిత్యత్వముచే సత్యత్వమును అంగీకరింపం దగియున్నందున జగత్కారణ వస్తువునకు సత్యత్వము సిద్ధించుచున్నది

13 ఏది సద్వస్తుభిన్నమో అది యసద్వస్తు వనంబడును

14 'అసత్' అను శబ్దమునకు 'లేనిది' అనునర్థము సర్వలోక ప్రసిద్ధమగుటవలన సద్వస్తుభిన్నముగ మరియొకపదార్థమే లేదని నిశ్చయింప వలయును

15 ఉత్పత్తివినాశములు లేనిపదార్థమున కవయవములు చెప్పంగూడనందున జగత్కారణమగు సద్వస్తువునకు అవయవములు నిషేధింపంబడినవి

16 నిరవయవ పదార్థమునకు పరిచ్ఛిన్నత్వ మంగీకరింపరానందున సద్వస్తువులు రెండనిగాని అనేకములనిగాని చెప్పంగూడదు

17 సద్వస్తుభిన్నమైనది అసద్వస్తువైనందునను సదసద్వస్తువొకటి యుండనందునను సద్వస్తువు లనేకములనుట అంగీకార్యము గానందునను జగత్కారణమగు సద్వస్తువునకు అద్వితీయత్వము నిశ్చయింపందగియున్నది

18 'అస్తి' యను సద్వస్తుధర్మ మవయవములుగల పదార్థములందును గనంబడుచున్నందున అవయవములుగల పదార్థములందు నిత్యత్వమును శంకించి సద్వస్తువుయొక్క అద్వితీయత్వమును సంశయింపందగదు

19 'అస్తి' యనుధర్మము నాధారముగఁగొని పదార్థములకు త్వము నంగీకరించితిమేని 'అస్తి' యనుధర్మమును ధరించిన రజ్జుసర్ప కును సత్యత్వమును చెప్పవలసి వచ్చును

20 ఇది లోకవిరుద్ధమగుటవలన అస్తియనుధర్మమున్నంత మాత్ర నే పదార్థములకు సత్యత్వ మంగీకరింపరాదు

21 ఏది సర్వకారణము కారణపదార్థరహితము నైయున్నదో హాత్రమే సద్వస్తువని నిర్ణయింపఁదగియున్నది

22 అవయవములుగల పదార్థమునకు సర్వకారణత్వము యుక్త నందున అది సద్వస్తువని చెప్పఁబడదు

23 సర్వకారణత్వము సిద్ధింపనందున అవయవములుగల పదా లకు కల్పితత్వమే నిశ్చయింపఁదగియున్నది

24 కార్యరూపమగు పదార్థమునకు కారణభిన్నముగ సత్యత్వము పనందున నది కారణమందలి సత్యత్వమునుధరించి సత్యముగ నున్నటుల శించుచున్నది

25 ఘటమునకు మృద్భిన్నముగ సత్యత్వములేనందున నది మృత్తి ర్మముల ధరించి మృత్తికవలె సత్యముగనున్నటుల ప్రకాశించుచున్నది

26 ఘటధర్మములుగ ప్రకాశించుచుండెడి శబ్దస్పర్శాదులును ంతములయందు మృద్భిన్నములుగ లేనందున మధ్యకాలమగు ఘటస్వ స్థితియందును నవి మృద్భిన్నముగ లేవని నిశ్చయింపవలయును

27 అటువలెనే కార్యరూపమగు పదార్థమునఁ దోఁచెడి ధర్మ యఁదు ఏది ఆద్యంతములయందు కారణపదార్థమున కభిన్నమై న్నదో అది మధ్యకాలమందును ఆ కారణ పదార్థమున కభిన్నమై న్నదనియే అంగీకరింపవలయును

28 అందువలన అవయవవంతములగుటచే కార్యరూపములని నిశ్చ పఁబడిన పదార్థములందు పదార్థమునశించినను ఏధర్మము నశింపక

కారణవస్తువువలెనే నిత్యమైయుండునో అది సద్వస్తుధర్మమని నిర్ణయింపవలయును

29 ఈ హేతువువల్ల సర్వము వినాశము నొందినను వినాశము నొందక ఏ'యస్తి' యనుధర్మము సద్వస్తువువలె నిత్యమైయున్నదో అది సద్వస్తుధర్మమనియే యంగీకరింపవలయును

30 అస్తియనుధర్మ మవయవములుగల పదార్థములయందున్నను అది కారణవస్తువగు సద్వస్తుధర్మమని నిర్ణయింపఁబడినందున సత్యత్వము సిద్ధింపని అవయవములుగల పదార్థములవల్ల జగత్కారణమగు సద్వస్తువునకు అద్వైతభంగములేదు

31 ఆకాశము నిరవయవమైనను కల్పితమగుటవలన అవయవవంతములగు పదార్థములవలెనే సద్వస్తువు కాదని యంగీకరింపవలయును

32 జగత్కారణమగు సద్వస్తువు నిరవయవమైనందున మృత్తికాదికమువలె పరిణమించునది గామిచేత జగత్కల్పనము రజ్జుసర్పమువంటిదానినిగా నిశ్చయింపవలయును

33 అందువల్ల రజ్జుసర్పమునందువలె జగత్తునందు సత్యత్వబుద్ధిని విడిచి అధిష్ఠానమగు రజ్జుస్వరూప జ్ఞానమువంటి జగదధిష్ఠాన సద్వస్తు యాథార్థ్య జ్ఞానము పొందఁదగినదై యున్నది

34 యుక్తిచేత ప్రతిపాదింపఁబడిన ఇయ్యర్థమే శ్రుతిచేతను ప్రతిపాదింపఁబడియున్నది

35 ఏది జగత్కారణముగ నిశ్చయింపఁబడెనో అదియే శ్రుతియందు బ్రహ్మశబ్దముచేత వ్యవహరింపఁబడుచున్నది

36 బ్రహ్మమునకు ఉత్పత్తివినాశరాహిత్యము నిత్యత్వము నిరవయవత్వము అపరిచ్ఛిన్నత్వము అద్వయత్వము, ద్వైతమునకు మిథ్యాత్వము శ్రుతులయందువిశేషముగ ప్రతిపాదింపఁబడియున్నవి

37 యుక్తిచేత నేయద్వైతము సిద్ధించెనో అదియే ద్వైతనిషేధశ్రుతులవల్లను ద్వైతనిందాశ్రుతులవల్లను ద్వైతమునకు మాయామయత్వమును ప్రతిపాదించు శ్రుతులవల్లను అద్వైతశ్రుతులవల్లనుసిద్ధించుచున్నది

38 పరమప్రమాణమగు శ్రుతి ప్రత్యక్షానుమానాది ప్రమాణములచే ఖండింపరాని బ్రహ్మస్వరూపమును విశేషముగ ప్రతిపాదింపఁగలిగియున్నం ముముక్షువులకు శ్రుతికంటె నన్యమైన శరణ్యములేదు

39 ఘటమునకు మృత్తికామయత్వమువలె జగమునకు బ్రహ్మమయము సిద్ధించుచున్నది

40 ఘటమునకు మృద్భిన్నముగ సత్యత్వము సిద్ధింపనట్లు జగత్తునకు హ్మభిన్నముగ సత్యత్వము సిద్ధింపదు

41 మృత్తికాదర్శన పూర్వకముగ ఘటసత్యత్వబుద్ధి నశించునట్లు హ్మదర్శనపూర్వకముగ జగత్సత్యత్వబుద్ధి నశించుచున్నది

42 అందువలన ఘటమునందు మృద్దర్శనమువలె జగత్తునందు హ్మదర్శనము వివేకబుద్ధితో చేయఁదగియున్నది

43 మృద్దర్శనముచే ఘటబుద్ధి నశించునట్లు బ్రహ్మదర్శనముచే ద్భ్రాంతి నశించుచున్నది

44 మృద్దర్శనముచే ఘటబుద్ధినశించినవానికి అంతయు మృత్తి నే ప్రకాశించునట్లు బ్రహ్మదర్శనముచే జగద్భ్రాంతి నశించినవానికి తయు బ్రహ్మముగనే ప్రకాశించుచున్నది

45 మృద్దర్శనముఁ జేసినవానికి మరల ఘటబుద్ధి యుదయింపనట్లు హ్మదర్శనము చేసినవానికి మరల జగద్భ్రాంతి కలుగదు

46 ఎవ్వఁడీప్రకారమెఱింగి 'సర్వమును బ్రహ్మమే' యను అద్వైత నమును పొందుచున్నాఁడో వానికిమాత్రమే శ్రుతిచే మోక్షమంగీకరింపఁ నది

అద్వైత నిర్ణయము
సమాప్తము
ఇది
శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచింపఁబడినది
ఓంతత్సత్

ఓం

శ్రీరామాయనమః

# ఆత్మతత్త్వవివేకము

## ముక్తిస్వరూప నిర్ణయము

శ్లో॥ బ్రహ్మాత్మజ్ఞానినో వేదైరుక్తం ముక్తేః క్రమం యథా
తథైవ ప్రోచ్యతే నత్వా దేవం తం విశ్వతోముఖం ॥

1 'బ్రహ్మైవసన్‌బ్రహ్మాప్యేతి' 'విముక్తశ్చ విముచ్యతే' అను శ్రుతులవల్ల స్వస్వరూపావస్థానమే మోక్షమని నిర్ణయింపఁబడినందున మోక్షము గంతవ్యమనుట నిరాకరింపఁబడినది

2 ఏది యప్రాప్తమో అది గ్రామాదికమువలె పొందఁదగి యున్నది

3 కంఠహారమువలె ప్రాప్తమయ్యు ఏది యప్రాప్తమైయున్నదో అది భ్రమనివృత్తిచేత పొందఁబడుచున్నది

4 ఏది సర్పాదికమువలె పరమార్థమో అది క్రియామూలమున పరిహరింపఁదగినది

5 ఏది నూపురమునందు సర్పమువలె అపరమార్థమో అది భ్రమనివృత్తిచేత పరిహరింపఁబడుచున్నది

6 ఆత్మవస్తువు కంఠహారమువలె ప్రాప్తమయ్యు అప్రాప్తమువలె నున్నందున ముక్తికి అవిద్యానివృత్తిమాత్రమే యపేక్షింపఁదగియున్నది

7 దుఃఖిత్వాదికము నూపురమునందు సర్పమువలె చూడఁబడుచున్నందున అవిద్యానివృత్తిచేత పరిహరింపఁబడుచున్నది

8 అద్వయ బ్రహ్మాత్మజ్ఞానముచేతఁగాని, అవిద్యానివృత్తి సంభవింపదు

9 'నతస్య ప్రాణా ఉత్క్రామన్తి' 'అత్ర బ్రహ్మ సమశ్నుతే' అను
లు బ్రహ్మవేత్తకు ఉత్క్రాంతిని నిషేధించి బ్రహ్మస్వరూప
ప్తిని ప్రతిపాదించుచున్నవి

10 'భిద్యేతే తాసాం నామరూపే పిహాయ పురుష ఇత్యేవం
ప్యతే, 'స ఏషోఽకలోఽమృతో భవతి' అను శ్రుతులు అవసానవేళయందు
ఘని షోడశకళలును నామరూపతిరస్కారముఁబొంది బ్రహ్మమా
లగుచుండ బ్రహ్మవేత్త బ్రహ్మమే యగుచున్నాఁడని చెప్పుచున్నవి

11 బ్రహ్మభిన్నమైన ప్రదేశమే లేనందున తనకన్యమైన ప్రదే
కల దనెడి భ్రమ నివర్తించినవానికి శ్రుతి ఉత్క్రాంతిని నిషేధించు
ది

12 తన కన్యమైన ప్రదేశముకల దనెడి భ్రాంతిజ్ఞానముచేతనే
మరణభయము కలుగుచున్న దనెడి యర్థము 'మృత్యోస్స మృత్యు
మ్నోతి య ఇహ నానేవ పశ్యతి' అను శ్రుతివల్ల తెలియఁబడుచున్నది

13 అంతయు నాత్మయే యను జ్ఞానముగలవానికి భేదదర్శన ముం
'యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్', అను శ్రుతి
చున్నది

14 అందువల్ల మోక్షమునకు బ్రహ్మాత్మజ్ఞానమువంటి సర్వాత్మ
మవసరమై యున్నది

15 సర్వాత్మజ్ఞానము గల పురుషునకు ప్రాణము లుత్క్రమింపక
చుండఁగా సముద్రమునుండి లేచినతరఁగలు సముద్రజలమునఁ గలియ,
ము సముద్రమే యగునట్లు బ్రహ్మమునందు కల్పితములైన షోడశకళలును
రూప తిరస్కారముఁబొంది బ్రహ్మమగుచుండ నతఁడును బ్రహ్మమే
చున్నాఁడు

16 ధనుర్విముక్త శరము లక్ష్యము చేరువఱకును నిలువనట్లు ఫలోన్ముఖమైన కర్మలు ఫలంబియ్యక నశింపని వగుటచే బ్రహ్మవేత్త ప్రారబ్ధకర్మము నశించినపిమ్మటనే మోక్షమును పొందుచున్నాఁడు

17 ఇయ్యర్థము 'తస్యతావదేవచిరం యావన్నవిమోక్ష్యే ఽథసంపత్స్యే' అనుశ్రుతివల్ల తెలియఁబడుచున్నది

18 ఎవ్వఁడీప్రకారమెఱుఁగునో వాఁడిచ్చటనే బ్రహ్మమగుచున్నాఁడు

ముక్తిస్వరూపనిర్ణయము
సమాప్తము

ఇది
శ్రీరామకృష్ణసోదరుఁడగు శ్రీనివాసునిచే
రచింపఁబడినది
ఓంతత్సత్



౭౦

శ్రీరామాయనమః

# ఆత్మతత్త్వవివేకము

## వివేకసార నిర్ణయము.

వివేక స్యాత్మ తత్త్వస్య సారమద్వైతసంగ్రహం
సిద్ధాంత రత్నమాలాఖ్యా గ్రంథేస్మిన్ కథ్యతేమయా॥

1 తనయొక్క స్వరూపముగఁగాని ధర్మముగఁగాని యుండనిది నిత్యమై యుండదు

2 తనయొక్క స్వరూపధర్మములు తనచేతఁగాని తనయంశముగాని తెలియఁబడవు

3 తనచేత తెలియఁబడునది తనకు స్వరూపముగఁగాని ధర్మముగఁ యుండదు

4 ఆధేయత్వముగలది ఆధారవంతమై యుండును

5 నిరాధారమగు ఆధారమే సర్వాధారము

6 సర్వాధారమగుపదార్థము అహమాదిశబ్దములచేత లక్షింపఁ బడున్నది

7 అందువల్ల నదియే యాత్మ

8 ఆత్మనెఱిఁగినవాఁ డహమాదిశమునం దాత్మత్వాభిమానముఁ ...ఁడు

ప్రథమ చరణము

సమాప్తము

ఇది

శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచింపఁబడినది

ఓంతత్సత్



శ్రీరామాయనమః

## —: ఏకసార నిర్ణయము :—

## ద్వితీయచరణము

వివిచ్య త్వంపదస్యార్థం తత్పదార్థవివేచనం
క్రియతే సుఖబోధార్థం యత్ జ్ఞేయం వీతరాగిణాం॥

1 పరిణామముకలది నిత్యమైయుండదు

2 నిత్యమైయుండున దవయవములు గలదియై యుండదు

3 అవయవములుఁకలది ఆధారవంతమై యుండును

4 ఏదినిరాధారమో అదియే సర్వాధారము

5 నిరాధారము సర్వాధారము నగువస్తువు ఏకము అద్వితీయమును

6 నిరవయవమునందలి కల్పన రజ్జుసర్పము వంటిది

7 అందువల్ల స్థితియును స్వప్నప్రపంచము వంటిదే

8 ఈహేతువువల్ల అద్వైతమే పరమార్థమని నిశ్చయింపఁబడినది

9 ఇట్లెటిఁగినవాఁ డద్వైతమునందు నిరాదరణబుద్ధి నుంచఁడు

ద్వితీయచరణము

సమాప్తము

ఇది

శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచింపఁబడినది



శ్రీరామాయనమః

# వి వే క సా ర ని ర్ణ య ము

## తృతీయచరణము

శ్లో॥ వాచ్యార్థయోః పరిత్యాగాదైక్యం తత్త్వంపదార్థయోః
నిరూప్యతే ముముక్షూణా మజ్ఞాన మలమోచకం॥

1 ఆత్మయందు నానాత్వ ముపాధిభేదముచేత జూడంబడుచున్నది

2 ఉపాధిద్వయ నిరసన పూర్వకముగా నఖండత్వము నిశ్చయింపఁబడుచున్నది

3 ఆత్మయొక్క పరమార్థస్వరూపము వాక్యముచేత తెలియఁబడుచున్నది

4 అందుచేత ఆత్మాన్వేషికి వాక్య మాదరింపఁదగినది

5 ఆప్తవాక్యమువలె నుపదేశవాక్యమును పరమార్థజ్ఞానమును బుట్టించును

6 అందుచే నజ్ఞాననాశము, దుఃఖనివృత్తియు వాక్యమువల్లనే

7 ఈప్రకార మెఱిఁగినవాఁ డనర్థమును పొందఁడు.

తృతీయచరణము
సమాప్తము

ఇది
శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచింపఁబడినది
ఓంతత్సత్

ఓం

శ్రీరామాయనమః

# —: వి వే క సా ర  ని ర్ణ య ము :—

## చ తు ర్థ  చ ర ణ ము

శ్లో॥ జీవస్యోత్క్రమణంతావత్ యావత్ స్యాద్వైతదర్శనం
యావ దుత్క్రమణం తావత్ జన్మబంధం న ముచ్యతే
తస్మా దుత్క్రాంతి రాహిత్యాత్ ముక్తిస్స్యాత్ జ్ఞానినామిహ
తత్వమేవం ప్రవక్ష్యామి ముక్త్యర్థం జ్ఞానమార్గిణాం॥

1 పరిపక్వమతికిఁగాక పరమార్థజ్ఞానము కలుగదు
2 ముందటిబుద్ధిని బాధింపక తద్విరుద్ధమగు బుద్ధి జనింపదు
3 బ్రహ్మాత్మజ్ఞానికిఁగాని అద్వైతజ్ఞానము కలుగదు
4 అద్వైతజ్ఞానములేక స్థలాంతరజ్ఞానము నశింపదు
5 స్థలాంతరజ్ఞానము నశింపనిదే ఉత్క్రాంతిరాహిత్యము లేదు
6 ఉత్క్రాంతిరహితత్వము వల్లఁగాని అమృతత్వము సిద్ధింపదు
7 ఈప్రకార మెఱిఁగినవాఁ డమృతస్వరూపుఁ డగుచున్నాఁడు

శ్లో॥ విశ్వస్యాంతస్థితం దేవం హృదయస్య నియామకం
ఆపన్నార్తిహరం రామం వందే దశరథప్రియం

వివేకసార నిర్ణయము
సమాప్తము

ఇది
శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచింపఁబడినది

ఓంతత్సత్

శ్రీరామాయనమః

# తత్త్వదర్శనము

## —॥ కర్తవ్యనిర్ణయము :—

॥ వివేకాద్వా నిరూప్యాథ ఈశత త్త్వాత్మతత్త్వయోః
తయోర్వివేకయుక్తస్య కర్తవ్యం ప్రోచ్యతేమయా॥

1 హృదయమును బంధమోక్షములయందు నియమించువాఁడు మేశ్వరుఁ డగుటవలన ఆయన యనుగ్రహము లేనినాఁడు అస్వతంత్రుఁ ు జీవుఁడు మోక్షమును పొందజాలఁడు

2 అందువలన మానవుఁడు బంధవిముక్తికొఱకు పరమేశ్వరాను హమును సంపాదింపవలసియున్నది

3 వాక్యార్థజ్ఞాన ముండియు నెవనికి దేహేంద్రియాద్యభిమానము ుపదో వానికి ఆత్మజ్ఞానమునకై యుండవలసిన హృదయపరిపాకమును మేశ్వరుఁ డనుగ్రహింపలేదని నిశ్చయింపవలయును

4 అందువలన మానవుఁ డప్రబుద్ధుఁడై దేహేంద్రియాదికమునం మానమును గలిగియున్నవఱకును పరమేశ్వరాశ్రయమును విడువకూడదు

5 ఇట్లని, యావదప్రతిబుద్ధ స్త్వ మనాత్మజ్ఞతయా స్థితః కచ్చతుర్భుజాకార, దేవపూజా పరోభవ' అనువాక్యము ప్రతిపాదించు ్నది

6 మానవుఁ డెంతవఱకు త్వంపదవాచ్యార్థమును నిరసింపఁజాలఁడో, తవఱకును తత్ పదవాచ్యార్థమును నిరసింపఁగూడదు

7 త్వంపదవాచ్యార్థమును నిరసింపలేనివాఁడు తత్ పదవాచ్యా ును నిరసించినయెడల, హృదయనియామకుని ఆశ్రయమును కోల్పో ుచేత, ఆయన యనుగ్రహముచేఁ గాని దాఁటరానిదగు మాయామోహము క్రమింపఁజాలక సంసృతిగర్తమున మునుఁగుచున్నాఁడు

8 అందువలన త్వంపదవాచ్యార్థమును 'నలికిపాఁ అవేయఁబడిన హస్తమును వలె' నిరపేక్షకముగ చూడఁగలిగి, హృదయనియామకుని యనుగ్రహము నపేక్షింపవలసిన యవసరము తీరినపుడుమాత్రమే సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వాది ధర్మములుగల తత్పదవాచ్యార్థమును నిరసింపవలయును

9 అప్పుడు మాత్రమే అకృత్రిమమగు ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞానము గలుగుచున్నది

10 నియమ్య నియామక స్వభావములు అజ్ఞానకల్పితులగు జీవేశ్వరులందుఁ గలవుగాని ప్రత్యగ్బ్రహ్మమునందు లేవు

11 అందువలన ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞాని, తాను నియమ్యుఁడుగాఁడని యెఱిఁగినపిమ్మట మరల నియామకుని ఆశ్రయమును కోరఁడు

12 జ్ఞానావస్థయందు జీవేశ్వరాదిభేదములు భ్రాంతిసిద్ధములై గన్పట్టుచున్నందున జ్ఞానియగువాఁడు జ్ఞానమునకుఁబూర్వమువలె భ్రమయందేలపడును ?

13 నిత్యముక్తస్వరూపుఁడనని యెఱింగిన జ్ఞానికి ఈశ్వరాశ్రయముచే సాధింపఁదగిన దేమియు లేనందున ఈశ్వరోపాసనాది వ్యవహారములుఁగూడ వానిచే విడువఁబడుచున్నవి

14 జ్ఞానానంతరము పరమేశ్వరానుగ్రహమునకై చేయవలసిన ఉపాసనాదులుగాని ఆత్మజ్ఞానమునకై వలయు శ్రవణాదులుగాని లేనందున జ్ఞానియగువాఁడు, సర్వత్రాద్వైతబుద్ధితో, నిత్యతృప్తుఁడై యుండుటకన్న చేయఁదగిన దెద్దియును లేదు

15 ప్రారబ్ధజన్యమగు శరీరము కర్మానుగుణముగ నెట్లెట్లు సంచరించు చున్నను జ్ఞాని దానివిషయమై విచారింపఁడు

16 నిత్యముక్తుఁడగు జ్ఞానికి మోక్షముకొఱకు దేహపాత మపేక్షితముగాదు

17 పండుటాకుంబోలె శరీర మెప్పుడైనను నశించుఁగాక తత్త్వ మ దానింగూర్చి విచారింపఁడు

18. ఎవ్వఁడీప్రకార మెఱుఁగునో వాఁడు భవబంధ విముక్తుఁడై నిరతిశయానంద స్వరూపుఁ డగుచున్నాఁడు.

యస్యానుశాసనాదేవ వ్యవహర్తుంసమర్థతా
జీవస్యతు భవేత్తస్మై హ్యాద్యంతర్యామినే నమః ॥

కర్తవ్యనిర్ణయము
సమాప్తము

ఇది
శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచింపఁబడినది.
సమాప్తోఽయం గ్రంథః
ఓం తత్సత్.



అనుష్ఠానదర్శనమను ఈ గ్రంథమును ముద్రింపించి ప్రకటించిన చి॥ పాటూరు నాగభూషణం (M. A, D. H. M.) నాకు సోదరుఁడును గురువును అయిన కీ॥ శే॥ పాటూరు రామకృష్ణయ్యగారి కుమారుడు. హైదరాబాదులో డాక్టరు జయసూర్యా గవర్నమెంటు హోమియోపతిక్ మెడికల్ కాలేజీలో ప్రిన్సుపాలుగా పనిచేయుచున్నారు.

హైదరాబాదులో అశోకనగరులోని 'క్షీరోదజ' ఈయన స్వగృహము. ఆస్తికుఁడు. పారమార్థిక చింతన గలవాఁడు. పెద్దలయందు గురుభావము గలవాఁడు. అమానిత్వాది గుణసంపన్నుఁడు.

తండ్రిగారి స్వవిరచితమైనఁ వేదాంతపంచదశిసారసంగ్రహమును, ముద్రింపించి ప్రకటించి వెలుగులోనికి తెచ్చి తనకుగల ఆధ్యాత్మిక చింతనాసక్తికిని, పితృభక్తికిని నిదర్శనముగా నిలిచిన ఉదాత్తగుణశోభితుఁడు.

ఈ చిరంజీవికి పరమేశ్వరుండ చిరకాలములోనే సత్సంతానమొసంగి ఆయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించునుగాక!

శ్రేయోభిలాషి,
గ్రంథకర్త.
25-9-1976.

# అనుష్ఠాన దర్శనము

## విషయ సూచిక

ఓం.

# అనుష్ఠాన దర్శనము

## హృదయ నివేదనము

సదమలగుణగణ్యా
జానకీరమణ
హృదయపీఠమువీడి
కదలకు మోయి. 1

అజ్ఞానతమమున
న్నావరించినది
ప్రజ్ఞానఘనుఁడ! నే
పతితుండనైతి. 2

చెడిపోపనున్నది
చెనటినామనము
పెడదారిబట్టింది
విడిచి నీపదము. 3

కననైన, విననైన
మనసుతో నిన్ను
అనుకొననైనను
మనసురాదోయి. 4

మోహాంధకారంబు
        ముసిరెనామదిని
ఓ హృదయేశ్వరా!
        యెందుంటివోయి. 5

విసికివేసారితి
        విషయ వాంఛలను
అసిధారవ్రతమయ్యె
        నవని నాబ్రతుకు 6

కనికరించుము స్వామి
        కరుణాసముద్ర!
మనసులో మనసువై
        మసలుము దేవ! 7

ఎదవీడి నీవెందు
        యేగకుమయ్యా
మదిజేరనున్నవి
        మదమత్సరములు. 8

అలముకొన్నవి మది
        మలిన వాసనలు
తొలగించు మార్గంబు
        దోపదు నేడు. 9

[illegible]

నలిన నేత్రుఁడ! రమ్ము
నాదు చిత్తమున
వెలిగింపవోయి నీ
వెలుగులో వెలుఁగు. 10

హృదయ పీఠమునందు
యున్నచో నీవు
ఎద కెల్ల వెలుగయి
ముదముగూర్చెదవు. 11

నీదగు తేజంబు
నిండినచోట
ఓ దయామయ! లేవు
మోదఖేదములు. 12

దేవ! నామది నీ వ
ధిష్ఠించువఱకు
భావింప నేరదు
భావము నిన్ను. 13

దూరంబు సేయకు
నే రమెంచినను
కారుణ్యమయదృష్టి
గావుమా తండ్రి! 14

నీవులేని మనంబు
నిగమగోచరుఁడ!
తావిలేని సుమంబు
కోవలోఁ జేరు. 15

నీవున్న చోమది
నీదువిస్ఫూర్తి
భావంబులోపల
భాసించుచుండు. 16

భావింపనేరదు
పరము నామనము
భావవిదూర! భా
వమున నీవుండ. 17

మనసు నీచేతిలో
మసలినగాని
కనిపింప దీభవ
మునకు నంతంబు. 18

సర్వజ్ఞుఁడవు నీవు
సర్వేశ్వరుఁడవు
సర్వసముండవు
సర్వాంతరుఁడవు. 19

సర్వజగత్సృష్టి
సంహారములను
సర్వకారణ! నీవు
నిర్వహించెదవు. 20

నీదు శాసనేమున
నిఖిలలోకములు
పాదుదప్పిచరింప
బడవు యెన్నఁడును. 21

ఇంద్రాదులకును బ్ర
హ్మాదులకైన
నీదు శాసనమును
కాదనరాదు. 22

ధీమనః ప్రాణముల్
దేహేంద్రియములు
నీ మహాశాసన
నియతి చరించు. 23

సర్వభూతంబుల
స్వాంతంబులందు
సర్వేశ! నీవుండి
శాసింతువోయి. 24

సారవిహీన సం
సారముదాట
నీరజాతాక్ష! నీ
నియతి కావలయు, 25

శాసింపు మోయియో
శాసనకర్త!
భాసింప నామనః
పంకేరుహాంబు. 26

నిన్నుఁజింతింపంగ
నీరూపుఁగనగ
సన్నుతశీల! నన్
శాసింపు మోయి. 27

నాది నేననెడియ
నాదియౌభ్రమల
భేదించి నామనః
ఖేదమ్ముఁబాపు, 28

నిరతంబు నామది
నిలిచియో దేవ!
పరతత్త్వ సాధనా
పరుఁజేయునన్ను. 29

నేనె నీవయి నీవె
వేనయి వెలుఁగ
జ్ఞాన ప్రబోధ మొ
సంగుమో దేవ! 30

శ్రీనివాసువి మనో
సీమవసించి
భానువంశజ! మనో
వాంఛితమిమ్మా. 31

ఇదె శ్రీనివాసుని
యీప్సితార్థంబు
హృదయ నియంత! నీ
కిదె నివేదనము. 32

హృదయ నివేదనము సమాప్తము.
శ్రీ రామకృష్ణ సోదరుఁడగు
శ్రీనివాసునిచే రచియింపఁబడినది.

---

శ్రీరామాయ నమః

# అనుష్ఠాన దర్శనము

## ఉపోద్ఘాతము

శ్రీరామచంద్రు నా
శ్రితజనరతు
కారుణ్యానిధిని శ్రీ
కరుమదిదలంచి. 1

సర్వజ్ఞు శంకరు
సంస్మరించిమది
నిర్విఘ్నముగ కృతి
నెరవేయుకొఱకు. ౨

శ్రీరామకృష్ణుని
చిదుపదేశకుని
సూరిజనస్తుత్యు
సోదరుఁ దలంచి. ౩

వైదికాచార సం
పన్నులకఖిల
వేదాంతవిదులకు
వినతులొనర్చి. ౪

తత్త్వదర్శనమందు
తత్త్వార్థికోఱకు
తత్త్వమెల్లను జెప్పి
తత్జ్ఞులు మెచ్చ. 5

ఆస్తికత్వంబు స
దాచారపరత
శాస్త్ర విశ్వాసంబు
సద్ధర్మనిరతి. 6

ఆచార్య గురుదేవ
తాతిథిపూజ
లాచరించుటగల
యట్టి యార్యునకు. 7

సాధనకోఱకను
ష్ఠాన దర్శనము
సాధనానుష్ఠాన
బోధరూపకము. 8

విరచింతునేడు వి
వేకులకిదియ
పరవస్తు సిద్ధికి
బాటయగానరయ. 9

మునుముందు తత్త్వ ద
ర్శనమందు బుద్ధి
కొనిపి తత్త్వంబును
మనసులో నిలిపి. 10

కొనియష్ఠాన ద
ద్శనము నూతగను
మనసును తత్త్వసా
ధనలతో నింపి. 11

విసువకనుష్ఠింప
వివిధ సాధనల
నసదృశమైన బ్ర
హ్మాను భూతియగు. 12

సాధకుఁడీ రహ
స్యం బెంచి; మదిని
బోధసాధనలచే
బూరింపవలయు. 13

తత్త్వజిజ్ఞాసువుల్
దర్శనద్వయిని
తత్త్వానుభూతికై
తలఁదాల్చిగాక. 14

ఓం.

# అనుష్ఠాన దర్శనము

## 1 విజ్ఞాన విష్ఠాప్రకరణము

ఇంద్రియేచ్ఛలనున్న
నెవ్వానికైన
దీంద్రియంబులు పరా
ధీనములగును. 1

ధీమనంబులు పరా
ధీనములైన
నే మనుజుండైన
నిడుమలఁబొందు. 2

ధీమానసముల కిం
ద్రియములకెన్న
నేమాత్రమును స్వేచ్ఛ
నివ్వంగరాదు. 3

కామరోషాదులు
గల మానవునకు
ధీమానసములు స్వా
ధీనముల్ గావు. 4

మనసు స్వస్థతఁదప్పు
మమతలంజిక్కు
మనుజుఁ డింద్రియముల
మరలింపకున్న. 5

మమత లెచ్చుటనుండు
మనముందునచట
మమతలడంగిన
మనసుస్వస్థమగు. 6

మనమింద్రియేచ్ఛల
జనకుండెకేవి
మనసు స్వస్థతనుండు
మమతలడంగు. 7

తలఁపులు మదినుండి
దొలగింపఁబడిన
దొలఁగును నింద్రియే
చ్ఛలు దమరయంత. 8

మనసు స్వస్థతమున్న
మనుజుఁడొక్కండె
తనకలరూపును
గననర్హుఁడగును. 9

స్వస్థచిత్తంబొందె
సౌఖ్యదాయకము
స్వస్థుఁడుగాదేని
సౌఖ్యంబులేదు. 10

చిత్తంపు స్వాస్థ్యంబు
చెడకుండబుధుఁడు
చిత్తసంరతుణ
చేయంగవలయు. 11

జ్ఞాననిష్ఠనుదీవి
శ్రీనివాసుండు
మానవులందఱి
మంచికై పలికె. 12

విజ్ఞాన నిష్ఠాప్రకరణము సమాప్తము.
శ్రీ రామకృష్ణ సోదరుఁడగు
శ్రీనివాసునిచే రచియింపఁబడినది.

శ్రీరామాయ నమః.

# అ ను ష్ఠా న ద ర్శ న ము

## 2. వివేక నిష్ఠాప్రకరణము

తన్ను గెల్చుకొనుట
కన్న నెన్నంగ
మిన్నయౌ కార్యంబు
మేదిని లేదు. 1

పంచేంద్రియమ్ముల
వంచింపఁబడక
సంచరించుట యొండె
సరియైన దారి. 2

ఆత్మోద్ధరణ మార్గ
మగు విజ్ఞాన
మాత్మవేత్తలలోన
నది ప్రకాశించు. 3

ధ వి
నిర్మలమ్మగును
ధర్మబద్ధంబైన
తనకు లోఁబడును.

సర్వభూతములను
సమదృష్టిఁ జూడ
సర్వేశ్వరుడు మెచ్చు
సమకూర్చు శుభము. 5

ఈశ్వరుండీ లేని
దెద్దియు లేదు
శాశ్వతానంద ప్ర
సాదకుఁడతఁడు. 6

ఉల్లమందున భక్తి
యును నార్జవంబు
ఉల్లసిల్లన నీశుఁ
డుండు నచ్చోట. 7

ఆర్జవభక్తుల
యందే యొకటి; వి
వర్జితమైన నీ
శ్వరుఁడుగన్పడఁడు. 8

సాకల్యముగ దృష్టి
సారించి వెదుక
నేకాంత భక్తున
కీశుండు దొరకు. 9

దేవతార్చన; మను
దినము సేయుఁగ
భావ మీశ్వరునకు
పరతంత్రమగును. 10

పురుష ప్రయత్నంబు
పరమేశు కృపయు
పరిపూర్ణమైననే
బంధమ్ముదొలఁగు. 11

ఇది వివేకము; నిష్ఠ
హృదయ భద్రతకు
సుధయని శ్రీనివా
సుఁడు జెప్పెదిని. 12

వివేక నిష్ఠాప్రకరణము సమాప్తము.

శ్రీ రామకృష్ణ సోదరుఁడగు
శ్రీనివాసునిచే రచియింపఁబడినది.

ఓం.

# అనుష్ఠాన దర్శనము

## 3. అకర్తృత్వనిష్ఠా ప్రకరణము

సర్వభూతములకు
శాసకుండొకఁడు
సర్వాంతరుండయి
బగతిలోఁగలఁడు. 1

శాసన బద్ధమీ
సర్వ; మీశుండు
శాసించి నట్టుల
భాసించుచుండు. 2

నరులు సేయంగనె
వ్వరు? నీశునాజ్ఞ
జరుగుచు నుండు వి
శ్వమున సర్వంబు. 3

వినుము; కుశారపా
ణి నిబోలునీశు
డనయమ్మును కుశార
మునుబోలునరుఁడు. 4

పురుషు పురాపురుషు

పరశువు మాడ్కి
నరుఁడు సాధనమగు
పరమేశ్వరునకు. 5

పరశువుంబట్టిన
పురుషునియట్లు
పరమేశ్వరుఁడె కర్త
నరుఁడుగాఁడెన్న. 6

కర్త నేననుకొన్న
గలుగు క్లేశంబు
కర్త యీశ్వరుఁడని
కనుగొన్న తొలఁగు. 7

మానసిక క్లేశ
మాలిన్యమతుల
కీనిష్ఠ తగుననె
శ్రీనివాసుండు. 8

అకర్తృత్వ నిష్ఠాప్రకరణము సమాప్తము
శ్రీరామకృష్ణ సోదరుఁడగు
శ్రీనివాసునిచే రచియింపఁబడినది.



శ్రీరామాయ నమః.

# అనుష్ఠాన దర్శనము

## 4. భావనిష్ఠా ప్రకరణము

మనమున సంకల్ప
　　మును వికల్పంబు
తనయంత దోఁచును
　　తనయంత నడఁగు. 1

జలబుద్బుదములట్లు
　　జనియించి యడఁగు
తలఁపు లీశ్వ్రపేరి
　　తము లస్థిరములు. 2

తలఁపుల తనవిగా
　　తలపోసెనేని
కలుగు క్లేశములువి
　　ర్మలునకునైన. 3

భావాస్థిరత్వంబు
　　భావించి నరుఁడు
భావములకు పర
　　వశుఁడు గారాదు. 4

జనియింప; నశియింప
సంకల్ప వితతి
మనుజుఁడు తనదిగా
దనిద్రోయనగును. 5

తలపుల కెల్లను
దాసీన బుద్ధి
తొలఁగి చరించుటే
దొడ్డతనంబు. 6

తలఁపు లుత్పన్న మౌ
స్థలమున దృష్టి
నిలిపిన; తలఁపుల
కలియదు మనసు. 7

తలఁపులం జిక్కక
మెలఁగెడి నరుఁడు
కలతఁ జెందఁడు క్లేశ
ములఁబొందఁ డెపుడు. 8

భావా స్థిరత్వంబు
భావించు కొఱకు
భావనిష్ఠను శ్రీని
వాసుఁడు బలికె. 9

భావనిష్ఠా ప్రకరణము సమాప్తము
శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచియింపఁబడినది.

---

ఓం.

శ్రీరామాయ నమః

# అనుష్ఠాన దర్శనము

## 5. శాంతి నిష్ఠాప్రకరణము

ఎయ్యది కానున్న
దయ్యదెట్టులను
నయ్యాయి వేళల
నయితీరు నిజము. 1

వినుపు రాకృత కర్మ
మున గల్గు ఫలము
లను నెట్టు దప్పించు
కొనలేడు నరుఁడు 2

తొలిమేని కర్మల
ఫలము లీమేన
గలఁగుచు నుండును
క్రమము దప్పకను. 3

వలయు నన్నను రావు
వలదన్న బోవు
ఇలలోన సుఖదుఃఖ
ములు యేరికైన. 4

సమయమైనను చెట్లు
సుమఫల శోభి
తములైన యటుతమం
తనె వచ్చు నవియ. 5

గడువంగరా నట్టి
కర్మఫలంబు
గుడువక తప్పదు
కోవిదుకైన. 6

తనచేతగానట్టి
పనికినై నరుఁడు
మనమున గుందిన
మంచి లేదందు. 7

వగపున శోషించు
వపువును మనము
వగపులేమి మనంబు
వపువు శోభించు. 8

ఈ శునా దేశంబు
నెవఁడు తప్పింప
ఈ శునాజ్ఞను ధిక్క
రించువాఁడెవఁడు. 9

వ్యవహార్తనని నరు
వ్యవహారమున్న
వ్యవహార కర్త యీ
శ్వరుఁడు నిక్కంబు. 10

కానున్న దెట్టులు
కాకమానదను
జ్ఞానమున్న నరుండు
జంక డెన్నఁడును. 11

యేది యెట్టులనైన
నేమికానున్న
మోద భేదములతో
మునుగఁడు బుధుఁడు. 12

శాంతి మంతుండగు
సమదర్శనుండు
స్వాంతమాతనిద్రప
శాంతమైయుండు. 13

పరమ రహస్య మీ
ప్రాజ్ఞుల పల్కు
పురుషుండు యెదలోన
బొడిపి గుప్తముగ. 14

కలుషములలోన
కష్ట సుఖముల
కలతనొందకనున్న
దొలఁగు క్లేశములు. 15

చిత్త వైకల్యంబు
చేగుందు నరుని
చిత్తశాంతికిఁ జెప్పె
శ్రీనివాసుఁ డిటు. 16

శాంతినిష్ఠా ప్రకరణము సమాప్తము

శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచియింపఁబడినది.



ఓం.

శ్రీరామాయ నమః

# అనుష్ఠాన దర్శనము

## 6. తృప్తి నిష్ఠాప్రకరణము

ఆశాపరుని దుఃఖ
మావరించెడిని
ఆశావిముక్తుని
కబ్బు సౌఖ్యంబు. 1

కోరికలను కడు
దూరమైయున్న
నేరదాతని చెంత
జేర దుఃఖంబు. 2

వినుపురుషారంభ
ముననె కోరికలు
తన కనుకూలమౌ
నమకొనఁదగదు. 3

తేరకయుండంగ
జేరు విత్తములు
తేరగాబోలియు; వి
ధియధీనములవి. 4

నలనగరంభనాకైన
నళినాక్షుకైన
తలవ్రాత దప్పింపఁ
గలవాఁడు లేడు. 5

జరుగనున్న దెట్లు
జరిగి యే తీరుఁ;
పరితపించెడివాని
ప్రజ్ఞ నాశమగు. 6

దైవమే గతినిచ్చు
దానఁబోదునని
భావమందున నెంచు
వాఁడె ప్రాజ్ఞుఁడు. 7

దొరకున్న పొందుచు
దొరకొనకున్న
దురపిల్లకుండఁ; ని
ర్భరుఁడౌట యొప్పు. 8

ఉన్నను లేకున్న
నున్న పోలికను
యున్న మానవునకు
నొదవు సంతృప్తి. 9

అనుపమమగు సుఖం
బును గూర్చునట్టి
ఘననిష్ఠ శ్రీనివా
సుని వాక్కుయిద్ది. 10

తృప్తి నిష్ఠాప్రకరణము సమాప్తము
శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచియింపఁబడినది.

ఓం.

# అనుష్ఠాన దర్శనము

## 7. విషయవైతృష్ణ్య నిష్ఠాప్రకరణము

అర్థముల్ దుఃఖదో
షాకరంబులవి
వ్యర్థముల్ నరునకు
వ్యసనహేతువులు. 1

ఏమిటి కైనాశ
లేమి జేసిబుధుఁ
డేమిటదుఃఖంబు
నెఱుఁగఁడెన్నఁడును. 2

కామభోగంబుల
గలుగదు మేలు
క్షేమంకరపథంబు
జేర్ప నేరవవి. 3

కామంబులు దొలంగ
గలిగెడి సుఖము
కామభోగంబుల
గలుగ దెన్నటికి. 4

మునులు కాయలు నాకు
లును గాలి నీరు
యనుభవించుట తెలి
యమిచేతనగునె? ౫

వెతలఁగూర్చెడివని
విషయకాంతులను
మతిమంతులగు బుధుల్
మది జేరనీరు. ౬

విషయములు జొరంగ
వెరవివ్వ మనసు
విషయభారమ్ముచే
విశ్రాంతిగనదు. ౭

మనసుకు భారమై
కనుపించువాని
కొనసాగనివ్వమి
మనసు తేలికగు. ౮

మనమునకు సుఖంబు
వొనగూడగోరు
జను డింద్రియార్థంబు
లను జేరజనదు. ౯

విషయతృష్ణను ద్రుంప
వెతలుండవన్న
ఋషివాక్కులనుబల్కె
శ్రీనివాసుఁడిటు. 20

విషయవైతృష్ణ్య నిష్ఠాప్రకరణము
సమాప్తము.
శ్రీరామకృష్ణ సోదరుఁడగు
శ్రీనివాసునిచే రచియింపఁబడినది
ఓం తత్సత్.

---

ఓం.

శ్రీరామాయ నమః.

# అనుష్ఠాన దర్శనము

## 8 కర్మనిష్ఠాప్రకరణము

చిత్తవిక్షేపంబు
జెడుటఁగర్మలను
చిత్తశుద్ధికిఁ గర్మ
సేయంగవలయు. 1

కర్మలనఁగ లౌకి
కంబులుగావు
కర్మశబ్దము వైది
కముల కన్వయము. 2

జనకాది పూర్వులు
గనిరి సంసిద్ధి
చనికర్మ మార్గమం
దున పూర్వులట్లు, 3

విధివిహితంబుల
విడువక సేయు
మది విశుద్ధతనొందు
మలినమ్ము వాయు. 4

స్నాన సంధ్యా ధ్యాను
ష్ఠానాదికమున
మానసమ్మునుబాయు
మలినవాసనలు. 5

క్రమబద్ధములునగు
కాయవాఙ్మాన
సములఁగర్మలసేయ
సత్ఫలమబ్బు. 6

కర్మకు నియమంబు
ఘనతరాంగంబు
మర్మమియ్యది దీని
మరువంగరాదు. 7

సత్య శౌచాహింస
శమదమ తపము
లత్యంత ముఖ్యంబు
లన్నికర్మలకు; 8

కర్మాధికారంబు
గలుగు శౌచమున
కర్మకు శౌచమే
ఘనతవొసఁగు. 9

శౌచము వైదికా
చారమూలంబు
శౌచమునకు సదా
చార మర్ధంబు, 10

శాస్త్రోక్తముగ సదా
చారము నడుప
శాస్త్రబద్ధున కది
సచ్ఛీల మొసఁగు. 11

భగవదర్థము జేయు
బడు కర్మకన్యా
మగు కర్మసంసృతి
కగు నంకురంబు. 12

ఈశ్వరార్థము కర్మ
నీడేర్చుటొకఁడె
శాశ్వతముక్తికి
సరియైన దారి. 13

చేయించు వాఁడీశు
డేయని నమ్మి
చేయు; కర్మఫలంబు
చెందదు నరుని 14

కర్మనిష్ఠనుగల
మర్మమెఱింగి
కర్మల సేయంగ
గలుగు సత్ఫలము. 15

శ్రీనివాసుఁడు రచిం
చిన కర్మనిష్ఠ
మాననీయము మనో
మలినహారంబు. 16

కర్మనిష్ఠాప్రకరణము
శ్రీరామకృష్ణ సోదరుఁడగు
శ్రీనివాసునిచే రచియింపఁబడినది
ఓం తత్సత్.

ఓం.

శ్రీరామాయ నమః.

# అనుష్ఠాన దర్శనము

## 9. సాధు నిష్ఠాప్రకరణము

మనసు హృషీకముల్
మంచి చెడ్డలకు
మనుజుని జీవిత
మున సాధనములు. 1

ఇచ్ఛ జరించెడి
యింద్రియాదికము
రచ్చకెక్కించి ప్ర
రాభూతు జేయు. 2

విచ్చలవిడి జన
నిచ్చిన మనసు
మచ్చునకైనను
మాటను వినదు. 3

మనసు హృషీకముల్
మనుజుని మాట
వినకున్న నతనికెం
దును లేదు సుఖము. 4

ఇంద్రియ మనముల
నిచ్చబోనీక
బంధించు వాఁడొందు
పరమ సుఖంబు. 5

వలయు నింద్రియ మనో
వ్యాప్తి నిగ్రహము
ఇలలోన గల మాన
వులకు నందఱకు. 6

సచ్చరిత్రమునందు
సాగిన మదిని
మచ్చికపరు పంగ
వచ్చును బుధుఁడు. 7

శాస్త్రబద్ధంబైన
సాధు జీవితమె
శాస్త్రకర్తల మేటి
సచ్చరిత్రంబు. 8

చేటొనగూర్చు వ్యా
షికేచ్ఛలంచు
చోటివ్వరవి యెంద
ఱౌర సాధుజనము. 9

విధిగ పాటింపంగ
విధి నిషేధముల
నదుపులోనికి వచ్చు
నారింద్రియములు. 10

శాస్త్ర విశ్వాసంబు
సజ్జన సేవ
శాస్త్ర నియమములు
సత్పథాంగములు. 11

శాస్త్ర మొక్కటె నరు
శాసింప నేర్చు
శాస్త్రబద్ధునకుండు
శాసనభయము. 12

భయమున్న నరునకే
నియమమబ్బెడిని
నియమబద్ధునకిల
నిలుచును నిష్ఠ. 13

సాధుజీవితమును
సరిదిద్ద నేర్చు
సాధనలెల్లను
శాస్త్రమందుండు. 14

శాస్త్రసంగతినున్న
సాధు పుంగవుఁడు
శాస్త్రబద్ధంబుగా
జరుపు జీవితము. 15

సాధు జీవితమున
సత్త్వంబు; సత్త్వ
సాధనమున గల్గు
శమ దమాదులును. 16

శమదమములు శుద్ధ
సత్త్వసారంబు
శమియించు చిత్తదో
షంబు లీరెంట. 17

శుద్ధ సత్త్వమున; వి
శుద్ధమైయున్న
బుద్ధిరాగాదుల
బద్ధముగాదు. 18

చిత్తదోషములు; న
శించిన సాధు
సత్తము బుద్ధిప్ర
శాంతమై యొప్పు. 19

శాంతిమంతుండైన
సాధు పుంగవుని
స్వాంతమాతనికి వ
శంబయి యుండు. 20

స్వాంతము వశమైన
సాధు పుంగవుండు
స్వాతంత్ర్య వీధిలో
సాగిపోనేర్చు. 21

సాధు జీవిత మిటు
స్వాతంత్ర్య వీధి
బోధ సాధనముగా
బొదలుట జేసి. 22

రెచ్చిన మనమును
మచ్చిక పరుప
సచ్చరిత్రులు సేయు
సాధు నిష్ఠలను. 23

పరతత్త్వ సాధనా
పరులకై కోరి
పరమార్థమిటు శ్రీని
వాసుండు బలికె. 24

సాధునిష్ఠాప్రకరణము సమాప్తము
శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచియింపఁబడినది.

---

ఓం.

శ్రీరామాయ నమః

# అనుష్ఠాన దర్శనము

## 10. సన్నిష్ఠా ప్రకరణము

అదుపు దప్పిన బుద్ధి
చెదరి పోకుండ
నదను తప్పకముందె
యరికట్టవలయు. 1

మనసును నరికట్టి
ముమకొను బుధుఁడు
మనసుపై పెత్తనం
బును జేయనొప్పు. 2

తన పెత్తనము క్రింద
మనముండునటుల
ననునయమున దాని
జను; మందలింప 3

మనసు వ్యాపకముల్
జనినట్టు జనుచె
మనసు నీయదు పున
జనని కారణము

గంధరసాదుల
కాంతుయే మనసు
నింద్రియంబులవెంట
నేగంగఁజేయు. 5

వెలివిషయంబులఁ
దొలఁగనాసక్తి
వలబడ్డశకునమ్ము
వలెజిక్కు మనసు. 6

మనమరిగెడి తెఱం
గును గుఱుతింప
మనమదియున్నచో
టున నెయడంగు. 7

మానసమా! విని
ర్మలముగనుండ
సౌనని గద్దింప
నదివిశుద్ధమగు. 8

మనమున సంకల్ప
మును వికల్పంబు
జనియింప; నదలింప
మనమట్టెనిలుచు. 9

మనమునస్థైనిల్పి
చననీయకున్న
తనకుఁదానై లోఁబ
డును నరునకది. 10

మనసెట్టులైనను
తనకులోఁబడిన
మనుజుఁడు జననేర్చు
మంచిమార్గమున. 11

అదుపుదప్పినబుద్ధి
నదుపులోఁ బెట్ట
సదమల పథముగా
సన్నిష్ఠనిట్లు. 12

శ్రీనివాసుఁడు జెప్పె
చిత్తోపరతికి
మాన్యచరిత్రుల
మహిత మార్గమిది. 13

సన్నిష్ఠాప్రకరణము సమాప్తము
శ్రీరామకృష్ణ సోదరుఁడగు
శ్రీనివాసునిచే రచియింపఁబడినది

ఓం.

శ్రీరామాయ నమః

# అనుష్ఠాన దర్శనము

## 11. మనోనిష్ఠా ప్రకరణము

కలరాఱు గురుశత్రు
వులు డెందమందు
తలఁపులఁగలుషి త
మ్ముల జేయుఖలులు. 1

అరి వర్గమున్నంత
వఱకంతరంగ
మరుగనేరదు సరి
యైన మార్గమున. 2

విడదీసి ప్రజ్ఞను
పెడత్రోవ బెట్టు
కడునేర్పుగలవి యీ
కామాదులెన్న. 3

కామంబు క్రోధంబు
గలవాని మనము
క్షేమంకర పథంబు
జేరదెన్నటికి. 4

చెడుదారి జనుచున్న
చిత్తముష్కరున
కిడులోభ మోహాముల్
కడునిండు దనము 5

మదమత్సరమ్ములు
మదిబాడుకొన్న
చెదరిపోయినబుద్ధి
స్థిమితంబు గనదు. 6

దాదిదప్పి చరింప
దలపడ్డమనము
నేరదు సరియైన
దారిలో జనగ. 7

మనసును పెడదారి
నసుపు కామాదు
లను రూపుమాపంగ
మనసు స్వస్థమగు, 8

సంకల్పమును విస
ర్జనసేయ కామ
మంకురింపదు మది
నడఁగుతనంత. 9

పరుఁ దోషము లెన్న
ప్రభవించుఁ గ్రోధ
మరయ క్షమాయుక్తి
నదియును బోలియు. 10

భూతాస్థిరత్వంబు
బొడగన్న విబుధు
పూతమానసమున
బోలియు మోహంబు. 11

ఆవహిల్లును మోహ
మజ్ఞానమునను
భావమధర్మంబు
బాయునది జెడు. 12

ఘనుఁడ నే ననుకొన్న
గలుగు మదంబు
ఘనతయ స్థిరమని
గనుగొన్నఁ దొలఁగు. 13

మనసు సత్త్వముగాఁ మి
మాత్సర్య మొదవు
జనితమయ్యును నది
సాధుసేవఁ జెడు. 14

కామాదులను ద్రుంప
గలిగినవాఁడు
క్షేమంకర పథంబు
జేరగా నేర్చు. 15

అరి వర్గమును ద్రుంచు
పరమరహస్య
మెఱిఁగి వర్తించిన
మరిలేదు భయము. 16

తలఁపులలోపల
తలదూర్పకుండ
మెలఁగ; కామాదుల
గలుగు విముక్తి. 17

డెందమందీ వైరు
లుండచోటివ్వ
కుండుటొక్కటె యుత్త
మోత్తమ పథము. 18

ఇది శ్రీనివాసుండు
యెఱిఁగి చెప్పినది
పదిలమైన పథంబు
వరమనోనిష్ఠ. 19

మనోనిష్ఠా ప్రకరణము సమాప్తము
శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచియింపఁబడినది.

శ్రీ రామాయ నమః.

# అనుష్ఠాన దర్శనము

## 12. దైవ నిష్ఠాప్రకరణము

జనవిభుండుండని
జనపదమట్లు
గనుపట్ట దీసృష్టి
క్రమవిరుద్ధముగ. 1

జనవిభుఁడున్న రా
జ్యంబునఁబోలి
గననౌను బ్రహ్మాండ
మున నియమంబు. 2

క్రమసూత్ర బద్ధమై
గన్పట్టు నీ; ని
యమము నేర్పరచు ని
యామకుఁడెవఁడు! 3

సృష్టి నియమమును
స్థితినియమమ్ము
స్రష్టనురూపింప
జాలు హేతువులు. 4

శాసించువాఁడు శా
సనము లేకున్న
భాసింప నేర్చునే
బ్రహ్మాండమిట్లు. 5

అనిబుద్ధి తోడ ని
యంతను వెదకి
గనలేక; ధ్యానయో
గంబున నిల్చి. 6

తనగుణములు గప్ప
గనరానిదాని
గనిరి; దేవాత్మ శ
క్తిని పూర్వమునులు. 7

దేవాత్మ శక్తియే
దేవుని మాయ
ఈ విశ్వసృష్టికి
నిదియె కారణము. 8

మాయతో గూడంగ
మాయికుఁడనుచు
సేయంగబడె నామ
ధేయ మీతనికి. 9

మాయికుఁడే తన
మాయచే సృష్టి
చేయించి తానందు
జేరెపాలింప. 10

క్రమముదప్పని నియ
మమ్ము నేర్పరచి
క్రమమున సృష్టికా
ర్యము జేసె నితఁడు, 11

సూర్యచంద్రగ్రహా
తారలీశ్వరుని
కార్యములోనివి
కర్తయీశుండు, 12

సర్వభూత వ్యావ
హారజ్ఞుఁడగుట
సర్వేశ్వరుం డొప్పు
సర్వజ్ఞుఁడనగ. 13

సత్యసంకల్పుండు
సత్యకాముండు
సత్య స్వరూపుఁ డీ
సర్వేశ్వరుండె. 14

ఇతఁడెయంతర్యామి
యితఁడెనియంత
సతతమితఁడె జీవ
తతికిఁ బ్రేరకుఁడు. 15

జననంబు మరణంబు
సర్వేశునియమ
మునకులోఁబడి భూత
ములకుఁ బ్రాప్తించు. 16

మెలఁకువ నిద్దుర
కలల నీశుండు
గలిగించుచుండు జీ
వులకు నెల్లపుడు. 17

బుద్ధిలోపలనుండి
బుద్ధిని లేపి
బుద్ధికి నీశుండు
బోధను గఱపు. 18

మనసులోపలనుండి
మదిని బ్రేరించి
మనసున కీశుండు
పనిని గల్పించు. 19

ప్రాణనాది క్రియలఁ
బరమేశునాజ్ఞ
ప్రాణమయంబు; ప్ర
వర్తించుచుండు. 20

అన్నమయంబు నం
దున్న యీశుండు
అన్నకార్యంబుల
నన్ని జేయించు 21

హృద్దేశముననున్న
యీశునాదేశ
మెద్దియో యదె జీవుఁ
డీ డేర్ప నేర్చు. 22

ఇచ్ఛయ నిచ్ఛవ
రేచ్ఛల ఫలము
వచ్చు జీవులకు దై
వ ప్రేరణమున. 23

దైవనిర్ణయమును
దప్పింపనోప
డీవసుంధర నెవ్వ
డెట్టివాఁడైన. 24

కదలదు మెదలదు
కడకు చీమైన
హృదయనియంత తా
నిడకున్న నాజ్ఞ. 25

ఇక్కట్టులను బాప
మక్కువగూర్ప
నిక్కముగా నీశుఁ
డొక్కడే కర్త. 26

జీవుల నుద్ధరిం
చెడి మార్గమొక్క
దేవుఁ డెఱుంగును
దెలియ లేఱోరులు. 27

ఏకాలమున కెయ్యి
దెట్టులజరుగు
నాకాల కార్యము
లాయీశుఁడెఱుగు. 28

మాయా విమోహిత
మానవుండెపుడు
మాయావి నెఱుఁగడు
మాయనెఱుఁగడు. 29

మమతయ హంకృతుల్
మాయచే గలుగ
కుమతియౌ నరుడంత
గ్రుంకు మోహమున. 30

దైవభీతి యొకటె
ధర్మ బీజంబు
దైవభక్తియె మాయ
దాటుసాధనము. 31

దైవశాసనము నౌ
దల దాల్చి బుధుడు
జీవింపనగుతోడి
జీవులంగూడి. 32

భగవంతుడన్ననో
భయభక్తులెవని
కగునగ్గలం బతం
డగు కృతార్థుండు. 33

మాయ దొలంగిన
మనుజు డీశ్వరుని
మాయగా జగమును
మదిని భావించు

మాయా వినర్శించు
మార్గ మొక్కటియె
మాయా విముకి కి
మహిత మార్గంబు

మాయకు నెర్చించు
మనుజు సన్నిధికి
డాయంగ వేరదు
మాయ యెన్నడును. ౩౬

మనసు సమర్పించి
మమతల విడిచి
మనుజుం డీశుని గొల్వ
మును కొనవలయు. ౩౭

ఎవని నీశుండనుగ్ర
హింప నెంచెడినొ
అవని నాతనికాతం
డగు రక్షకుండు ౩౮

ఏ యవస్థను జీవి
కెయ్యది వలయు
నాయవస్థను దాని
నతండె యొసంగు. ౩౯

ఎవ్వఁడంతర్యామి
ఈ విశ్వమునకు
నవ్విభునకు విశ్వ
మగు శరీరంబు. 40

ఈ విశ్వమునగల
యే వస్తువైన
నా విశ్వమూర్తికి
నవయవంబయగు 41

ఏ సదార్థమునైన
నీశ్వరబుద్ధి
తో పూజసేయ సం
తుష్టుఁడౌ నతఁడు 42

దేవుని పేర ప్ర
తీకమునుంచి
సేవింపనీశుండు
సేవలందుకొను 43

ఖగమృగ పశుజంతు
నగనరతరుల
నగపడు నీశ్వరుం
డర్చనసేయ 44

పిలిచిన పిలుపెల్ల
విను నీశ్వరుండు
పిలుపు నిజంబైన
పలుకునతండు 45

కరమహం వృత్తికా
కరుడయియున్న
పలుకీశ్వరుఁడు వాని
మొర వినబోఁడు 46

ఆ కొన్న శిశు వెట్టు
లమ్మకై యేడ్చు
నా కై వడిని నెవ్వఁ
డార్తుఁడై యీశు 47

సందర్శనాపేక్ష
నొందునాభక్తుఁ
సందేహమెడల నీ
శ్వరుఁడు గన్పట్టు. 48

విశ్వశరీరుఁడౌ
విశ్వేశ్వరునకు
విశ్వాసపాత్రుఁడై
వెలయు భక్తునకు. 49

శాశ్వతమగు శాంతి
సౌభాగ్యములను
ఈశ్వరుండిడ సంశ
యింపఁడు నిజము 50

ఎవని సంరక్షింప
నీశుండుదలఁచు
నవని నాతనిభార
మతఁడువహించు. 51

భగవదనుగ్రహ
ప్రాప్తికై నరుఁడు
జగదీశు నర్చింప
దగు బుద్ధివొడమ, 52

మానసమున నెంచి
జానకీరమణు
శ్రీనివాసుఁడు రచిం
చెను; దైవనిష్ఠ. 53

దైవనిష్ఠా ప్రకరణము సమాప్తము
శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచియింపఁబడినది.



ఓం.

శ్రీరామాయ నమః.

# అనుష్ఠాన దర్శనము

## 13. పరమార్థ నిష్ఠాప్రకరణము

వైదికధర్మంబు
భక్తియు దపము
సాధనంబులు నాల్గు
సాధనలకును. 1

జ్ఞానమొక్కఁడె మోక్ష
సాధనంబరయ
దాని కాచార్యుండు
తగిన సాధనము. 2

శ్రుతులు బోధించెడి
హితబోధవిన్న
మతిమంతుఁడే మోక్ష
మార్గముఁద్రొక్కు. 3

వినివి విరక్తుఁడై
వెదకినగాని
పసలేని సంసృతి
కొసగానరాదు. 4

ప్రవిమల వైరాగ్య
ప్రాభవంబొందె
భవసాగరముదాట
భటువైననావ. 5

నావను నడిపించు
నావికునట్లు
భావింప మోహేచ్ఛ
భవముదాటించు, 6

ఘనతరమగు వివే
కము త్రోవజూప
జననేర్చు నౌక ప్ర
శస్త మార్గమున. 7

సాధనంబులు నాల్గు
సమకూడినపుడె
వేదాంత వినువీధి
విహరించుబుధుఁడు. 8

శమదమంబులతోడి
శ్రవణాదికంబు
క్రమము దప్పక సేయ
కలుగు జ్ఞానంబు. 9

ప్రారబ్ధమునకు; శ
రీర మర్పించి
యారంభ శూన్యుఁడై
యలరు బుధుండు. 10

జీవభావంబు న
శించిననాఁడు
భావమందీశుండు
బ్రహ్మమై వెలుఁగు 11

సమయ ననాత్మ భా
వము మానసమున
శమియించు భేద భా
వములు తమంత. 12

జీవేశ్వరులు మాయ
చేత కల్పితులు
జీవుఁడు నిజమైన
దేవుఁడు నిజము. 13

జీవభావంబు; న
శించెడివఱకు
భావమందీశును
పాసింపవలయు. 14

ఈశుని కృపలేక
నెవ్వండును భవ
పాశవిముక్తిని
బడయంగలేడు. 15

పరమార్థమిది; శ్రీని
వాసుఁడీ నిష్ఠ
పరతత్త్వ సాధనా
పరులకై బలికె, 16

పరమార్థ నిష్ఠాప్రకరణము సమాప్తము
శ్రీరామకృష్ణ సోదరుఁడగు
శ్రీనివాసునిచే రచియింపఁబడినది

ఓం.

శ్రీరామాయ నమః

# అనుష్ఠాన దర్శనము

## 14. తత్త్వనిష్ఠా ప్రకరణము

పంచభూత వికార
మెంచగా తనువు
వంచింపఁబడి నరుఁ
డెంచుతానెయని, 1

సారథ్య మొనరించుఁ
సత్త్వాదికంబు
కార్యనిర్ణయమున
కరణమౌ మనము 2

కార్యభారము మోయఁ
కాయంబును; వ్యవ
హారమునకు నింద్రి
యములు బూనుకొను. 3

కర్మానుగుణముగ
గలుగు నీ యఖిల
నిర్మాణమునగర్త
నిఖిలేశ్వరుండు. 4

అజ్ఞానియగు నరుం
డఖిలంబు ను తన
ప్రజ్ఞా జనితమంచు
ప్రబలగర్వియగు. 5

ప్రాజ్ఞునిదైనట్టి
ప్రజ్ఞకీశ్వరుని
యాజ్ఞ కారణమని
యరయుటే యొప్పు. 6

తన దేహ నిర్మాణ
మునకు దాగర్త
నని చెప్ప నొప్పునే
యజునకైన. 7

తన కల్పనముగాని
తనువునందున్న
మనసుమాత్రం బెట్లు
తన కల్పనయగు. 8

దేహనిర్మాణంబు
దేహవర్తనము
దేహచ్యుతియు; దేవ
దేవునాజ్ఞనగు. 9

మనసు యహంబుద్ధి
తనువాది సకల
మునుబనిసేయు నీ
శుని; నియమమును. 10

జరుగుచుండెడి దాని
నెఱుఁగుటొక్కటియె
నరయ జీవునిచేత
నైనకార్యంబు, 11

కాని; యజ్ఞానంబు
గప్ప జీవుండు
తానె కర్తనటంచు
దలపోయుచుండు. 12

వినుము; విక్షేపమ
విద్య యావరణ
మనునివి; తనరూపు
గనుపింపనీవు. 13

స్పష్టముగానుండ
ద్రష్టతదనకు
ద్రష్టతానుటలో
తగదు సంశయము. 14

తెలియు వాఁడు తనను
దెలియంగ లేడు
తెలియు వానికి వేఱు
తెలియఁబడు వది. 15

తనకు దోచున దెల్ల
తానుగఁ బోదు
తనకు తా నెన్నఁడు
ద్రష్టగా బోఁడు. 16

దృశ్యములగు మనో
దేహేంద్రియములు
దృశ్యములను జూచు
దృక్కుకన్యములు. 17

నిజమరసితి వేని
నీకుదోచెడిది
నిజముగా నెన్నఁడు
నీవుగా బోవు. 18

తనకు దృశ్యములగు
మనసును బుద్ధి
తనువు నింద్రియములు
తానవదగవు. 19

తనకు గోచరమగు
ధర్మమేదైన
తనదిగా దనుటయే
తత్త్వసారంబు 20

దృశ్యములను విశో
ధింపఁగా మిగులు
దృశ్యభిన్నంబైన
దృక్కె చిదాత్మ. 21

నేనను వృత్తిని
తానుగా నెఱుఁగు
ఆ నేనె దృశ్యము
గాని తానగును. 22

ధీతమముల మనో
దేహేంద్రియముల
నాత్మగా మదినెంచు
నజ్ఞుఁడౌ నరుఁడు, 23

తనువు నింద్రియములు
తమ మహాఁకృతియు
మనసును గాను ; ధీ
యును నేనుగాను. 24

జననంబు మరణంబు
జరయును రుజయు
తనువునకేగాని
తనకు లేవరయ. 25

జ్ఞానయత్నేచ్ఛల
జ్ఞానమోహములు
మానావమానముల్
మనసు ధర్మములు. 26

కర్తృత్వమగు నహం
కార ధర్మంబు
భోక్తృత్వమును నహం
బుద్ధి ధర్మంబె. 27

తనదు ధర్మములుగా
గనుపించెడి సుఖ
మును దుఃఖమును నహ
మునకు ధర్మములు. 28

దృశ్యములను నిషే
ధింపఁగా మిగులు
దృశ్య విలక్షణు
దెలియుటే నిష్ఠ. 29

పరమ రహస్యంబు
పరమోత్తమంబు
పరతత్త్వమిది శ్రీని
వాసకృతంబు. 30

తత్త్వ నిష్ఠాప్రకరణము సమాప్తము
శ్రీరామకృష్ణ సోదరుఁడగు
శ్రీనివాసునిచే రచియింపఁబడినది

---

ఓం.

శ్రీరామాయ నమః

# అనుష్ఠాన దర్శనము

## 15. జ్ఞాననిష్ఠా ప్రకరణము

అహమను పదముచే
నరయగా తన్ను
తన రూపమై సత్తు
తప్పకదోచు, 1

నీవను మాటకే
నిశ్చితార్థంబో
అదియను పదమున
కదియె యర్థంబు. 2

అగ్న్యాదులకుబోలె
యాత్మయందునను
ధర్మి ధర్మంబులు
తామభిన్నములు. 3

తాము భిన్నములౌట
ద్రష్టృ దృశ్యములు
ద్రష్టయగా యాత్మకు
తగదు దృశ్యతయు, 4

ఆత్మకభిన్నంబు
యై ప్రకాశించు
ఆత్మ ధర్మము దృశ్య
మై యుండదెపుడు. ౫

ఆత్మ స్వరూపంబు
నాత్మ ధర్మమును
ఆత్మ తదంశంబు
లరయంగ లేవు. ౬

ఆత్మధర్మము దృశ్య
మై యుండరామి
దృశ్యమౌ ధర్మమా
త్మీయేతరంబు. 7

సత్ స్వధర్మంబులు
చిత్తును సుఖము
సత్తుకభిన్నముల్
స్వగతాభిదములు. 8

పరమ సుఖ స్వరూ
పంబయ్యుసత్తు
ఆవరించెడి దుఃఖ
మన్యభావనల. 9

ఆత్మదర్శనమున
నాత్మ సుఖంబు
స్వస్థచిత్తముచేత
సాధకుండొందు. 10

అహాము దయింపంగ
నయ్యో సంసార
మహాము నశించిన
నదియు నశించు. 11

చిత్తును జడమును
జేరనేకముగ
జని మృత్తులాత్మ సం
జని తమ్ములయ్యో. 12

చిజ్జడంబులు రెండు
జేరనొక్క యెడ
నాత్మ బింబంబహ
మందు దోచుటయె. 13

చిత్ప్రతిబింబంబు
జేరగతన్ను
ఆత్మకై వడి బోధ
నహాము భాసించు. 14

చిత్తవృత్తులు సదా
చిత్సమంబులుగ
భాసించుచున్నవి
ప్రతిబింబముననె. 15

తెలియువాఁడను పేరు
గలదియై యహము
కర్తనేననుచు దా
గను ననాత్మకము. 16

చిత్తవృత్తులచేత
జేర్పఁగబడిన
స్వాదుపిప్పలము నా
స్వాదించునహము. 17

నేను; నే ననుటచే
యేనేనుదోఁచు
నదియె భాసించు దా
నహము లేనపుడు. 18

అహములయించిన
నలయసత్తగుచు
యే నేనుదోఁచెడు
నానేనె తాను. 19

ఏ నేను దృశ్యమో
నా నేనె జడము
ఘటపటాదికమట్లు
గనదగుదాని, 20

బుద్ధియూ; నహామును
బోలి దృశ్యంబె
ఆహేతువున నయ్యు
దగునుజడంబు, 21

ప్రాణమింద్రియములు
వపువునుమనము
వేద్యతజడములై
విలసిల్లుచుండు. 22

చిత్తుసత్తేయగు
సత్తెయా ప్రియము
తద్విరుద్ధములుగా
దనరు నన్యములు. 23

తన రూపముగ చిదా
త్మను జూడవలయు
విడువనో నితరము
ప్రియమసజ్జడము. 24

రుద్ధమౌ మదిచేత
శ్రద్ధతో జేయ
నాత్మచింతనకబ్బు
ననురూపఫలము. 25

ఆత్మ సంస్థితి మది
నభ్యసింపనగు
చెదరెనేని మనంబు
చేరు బాహ్యంబు. 26

కారణాత్మనువీడి
కదలిబాహ్యమున
కరుదెంచుధీ జేయు
నన్యచింతనము. 27

ఆత్మనుండి వెలికి
నరుగు చిత్తమును
మరలించి యాత్మలో
మరలజేర్పనగు. 28

కామభోగములందు
యేమనంబునకు
వ్యాప్తియుండునో దాని
వారింపవలయు. 29

కామమటు లయంబు
కడు పనర్థకము
కాన చిత్తలయంబు
గానీయరాదు. 30

చిత్తము; లయమును
జెందు సుషుప్తి
అది నిగ్రహంబున
నలయమైయుండు. 31

అలయసిద్ధికి మది
నభ్యసింపనగు
నలయమనంబున
కాత్మగమ్యంబు. 32

లయమునుండి మదిని
స్వయముగా లేపి
ఆత్మయందున జేర్చ
నగు దానినంత. 33

ఆత్మదర్శనమున
నాత్మలోనున్న
స్థిరమైనమనమది
చెదరదెన్నటికి. 34

అహాములేనిది విల
యంబునొందనిది
యైన చిత్తమెసంవి
దైక్యంబుగలది. 35

స్వప్న నిద్రలులేని
స్వస్థచిత్తంబె
సర్వోత్తమంబైన
సత్తపః ఫలము. 36

స్వప్న సుషుప్తులు
జననంబులేని
మనమదిబొందును
తన నిజ రూపు. 37

స్వాత్మబోధకసూక్తి
జాలకమిద్ది
శ్రీనివాస కృతంబు
చిదుపదేశంబు. 38

జ్ఞాననిష్ఠా ప్రకరణము సమాప్తము
శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచియింపఁబడినది.

---

ఓం.

శ్రీరామాయ నమః

# అనుష్ఠాన దర్శనము

## 16. ఆత్మనిష్ఠా ప్రకరణము

నేను నేననిదోఁచు
నే నెవ్వఁడనని
తాను తన్వేదుకంగ
తనరూపుదోఁచు. 1

దృష్టికి ద్రష్టయౌ
దృక్కె చిదాత్మ
దృష్టి సాధనమున
దృక్కుగన్పట్టు. 2

బుద్ధీంద్రియంబుల
పోఁకడనుడుప
శ్రద్ధాన్వితునకబ్బు
శుద్ధాత్మదృష్టి. 3

చిత్తంబు నిలుపక
జేజేలకైన
చిత్తునఁ జిత్తంబు
జేర్పంగరాదు. 4

జ్వరపీడితుండిల
శర్కరనట్లు
విరతి విహీనుండు
విమలునివిడుచు. 5

శుద్ధదర్పణమట్లు
శోభిల్లకున్న
బుద్ధికంతర్దృష్టి
బొదలదెన్నటికీ. 6

సూక్ష్మమౌ మదిమను
సూక్ష్మదర్శనులు
సూక్ష్మాతి సూక్ష్మమౌ
శుద్ధాత్మగనిరి. 7

బుద్ధి సూక్ష్మాకృతి
బొదలదేని పరి
శుద్ధమౌ నీయాత్మ
శోధింపఁబడదు. 8

నిద్రయు స్మరణంబు
నిత్యాత్మనిష్ఠ
భద్రతకునుగూర్చు
భయమునిజంబు. 9

ఉహామపేతకమగు
యాత
మోహానిద్రాజ్ఞాన
మూఢాదులడ్డు. 10

ఆత్మాచలంబెక్క
నరుగుటకొక్క
స్వాత్మప్రబోధ వి
జ్ఞానమే మెట్టు. 11

వినుతాత్మనిష్ఠను
విసువులేకుండ
మనుజుఁడనుష్ఠింప
మునుకొనుకొఱకు. 12

మాననీయంబైన
మహితాత్మనిష్ఠ
శ్రీనివాసుఁడు జెప్పె
చిత్తు సాధనము. 13

ఆత్మ నిష్ఠాప్రకరణము సమాప్తము
శ్రీరామకృష్ణ సోదరుఁడగు
శ్రీనివాసునిచే రచియింపఁబడినది

---

ఓం.

శ్రీరామాయ నమః.

# అనుష్ఠాన దర్శనము

## 17. సహజ నిష్ఠాప్రకరణము

తాను లేకున్న దా
ద్రష్ట యెట్లగును
తా నెన్న తనరూపు
దాస్వస్థుఁడగును. 1

తనువుకు ద్రష్టయై
తానున్న యెడల
తను తాపమెన్నఁడు
తనకుండబోదు. 2

మనసుకు ద్రష్టయై
మరువకయున్న
మనసు చలించదు.
తన తావునుండి. 3

నేనను వృత్తిని
నిష్ఠతోనరయ
నేననునదియె న్వ
స్థానమునబడు. 4

మరపును నిద్రను
మరువక యున్న
స్థిరమైన నిలుకడ
జేకురు నిజము ॥ 5

దృష్టిత బుట్టునా
స్థానము వెదుక
స్వస్థలంబున గల్గు
సంస్థితి దనకు 6

స్వస్థితిగనియుచ్చ
సంస్థితియందు
స్వస్థతం బడసిన
బనిలేని వాఁడు ॥ 7

సహజసంస్థితికి నీ
సాధనక్రమము
మహి శ్రీనివాసుండు
మహితమార్గమనె ॥ 8

సహజనిష్ఠాప్రకరణము సమాప్తము
శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచియింపఁబడినది.

---

ఓం

శ్రీరామాయ నమః.

# అనుష్ఠాన దర్శనము

## 18. అనుభూతి నిష్ఠాప్రకరణము

నేను దేహముగాను
కానింద్రియములు
నేను సద్రూపుండ
నేను చిద్ఘనుండ ॥ 1

నేను ప్రాణముగాను
నేబుద్ధి ను
నేను సద్రూపుండ
నేను చిద్ఘనుండ ॥ 2

నేనహంకృతిగాను
నేగాన విద్య
నేను సద్రూపుండ
నేను చిద్ఘనుండ ॥ 3

నేను కర్తనుగాను
నే భోక్తగాను
నేను సద్రూపుండ
నేను చిద్ఘనుండ ॥ 4

నాకు జన్మము లేదు
నాకు లేదు స్మృతి
నాకు లేదు భయంబు
శోకము లేదు, 5

నాకు మోహము లేదు
నాకు లేదు రుజ
కాదు పిపాస లే
దాకలి లేదు!॥ 6

నే నిర్వికారుండ
నే నిశ్చలుండ
నేను నిర్గుణుండను
నే నసంగుండ ॥ 7

నే నవ్యయుండను
నేను వ్యాపకుండ
నేను నిర్మముండను
నేను నిర్మలుండ॥ 8

నే నిరవద్యుండ
నేను నిత్యుండ
నే నఖండుండను
నే నిరంజనుండ ॥ 9

నే నద్వితీయుండ
నే ననంతుండ
నే నిత్యసత్యుండ
నే నిరామయుండ ॥ 10

నేనె పరంజ్యోతి
నే పరాత్పరుండ
నేను నిర్దుఃఖుండ
నే చిన్మయుండ ॥ 11

నిరతిశయసుఖుండ
పురుషోత్తముండ
పరమాత్ముండను నేను
ప్రత్యగాత్ముండ ॥ 12

సర్వకారణుండ నే
సర్వసముండ
సర్వసాక్షిని నేను
సర్వగతుండ ॥ 13

అప్రమాణుండ నే
నద్వితీయుండ
అప్రమేయుండ నే
నాగమోక్తుండ ॥ 14

నేను నిర్ద్వంద్వుఁడ
నేను నిష్క్రియుఁడ
నేను నిర్ముక్తుండ
నే జ్ఞానఘనుఁడ ॥ 15

తన నెఱిఁగినవాని
యనుభూతి నిష్ఠ
యని శ్రీనివాసుండు
వినిపించెనేని ॥ 16

అనుభూతి నిష్ఠాప్రకరణము సమాప్తము
శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచయింపఁబడిన అనుష్ఠానదర్శనము సమాప్తము

ఓం తత్సత్

---

# పరిశోధనపత్రము (తప్పొప్పుల పట్టిక)

| పేజీ | పద్యసంఖ్య | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | 3 | 1 | చెడిపోప | చెడిపోవ |
| 9 | 6 | 2 | వరత | పరత |
| 10 | 11 | 1 | కొనియష్టా | కొనియనుష్టా |
| 11 | 1 | 3 | సరా | పరా |
| 11 | 3 | 1 | ధీమావస | ధీమానస |
| 12 | 6 | 2 | మనముందు | మనముంతు |
| 12 | 8 | 4 | దమరయంత | దమయంత |
| 13 | 10 | 1 | చిత్తంగొందె | చిత్తంబొందె |
| 13 | 10 | 3 | స్వస్థుఁడుగాదేని | స్వస్థుఁడుగాడే |
| 17 | 1 | 4 | బగతి | జగతి |
| 53 | 33 | 1 | భగకుంతు | భగవంతు |
| 58 | 2 | 1 | జ్ఞానమొక్కడె | జ్ఞానమొక్కటె |
| 65 | 16 | 2 | తానుగ | తానుగా |
| 71 | 10 | 4 | సాధకుటొందు | సాధకుఁడొందు |
| 75 | 30 | 2 | సనర్ధకము | ననర్థకము |
| 79 | 10 | 2 | యాత్మసంస్థి | యాత్మసంస్థితికి |
| 83 | 6 | 3 | కామపిపాస | నాకుపిపాస |
| 83 | 8 | 4 | నేచు | నేను |

ఓం

శ్రీ రామాయ నమః

# ఇష్ట దేవతా ధ్యానము

ధరణిజాపతే భువనభూపతే
త్వమసిహృత్పతే హృదయభైవమే ౧

ఓ సీతారమణా! జగత్ప్రభూ! హృదయపరిపాలకా! నా హృదయ ప్రకాశమే నీ స్వరూపమైయున్నది.

త్వత్ప్రవేశతో హృత్తమోఽగలత్
సహజభైవతే లసతిమేహృది ౨

ఓ సీతారమణా! నీవు నా హృదయమును ప్రవేశించుట వలన హృదయమందలి అజ్ఞానమనెడి చీకటినశించినది. నీ సహజప్రకాశమే నా హృదయమునఁ బ్రకాశించుచున్నది.

కరుణయాహి తే విగతసంశయ
స్త్వనుభవామిభో విమలచిత్సుఖం ౩

ఓ స్వామీ! నీ కరుణచేత (నాస్వరూపమునుగూర్చిన) సంశయము పోఁగొట్టఁబడిన వాఁడనై పరిశుద్ధమగు చిత్సుఖము ననుభవించు చున్నాను.

ఓం

శ్రీ రామాయ నమః

# ఇష్టదేవతాధ్యానము



ధరణిజాపతే భువనభూపతే
త్వమసిహృత్పతే హృదయభైవమే 1

ఓ సీతారమణా! జగత్ప్రభూ! హృదయపరిపాలకా! నా హృదయ ప్రకాశమే నీ స్వరూపమైయున్నది.

త్వత్ప్రవేశతో హృత్తమోఽగలత్
సహజభైవతే లసతిమేహృది 2

ఓ సీతారమణా! నీవు నా హృదయమును ప్రవేశించుట వలన హృదయమందలి అజ్ఞానమనెడి చీకటినశించినది. నీ సహజప్రకాశమే నా హృదయమునఁ బ్రకాశించుచున్నది.

కరుణయాహితే విగతసంశయ
స్త్వనుభవామిభో విమలచిత్సుఖం 3

ఓ స్వామీ! నీ కరుణచేత (నాస్వరూపమునుగూర్చిన) సంశయము పోగొట్టఁబడినవాఁడనై పరిశుద్ధమగు చిత్సుఖము ననుభవించు చున్నాను.

రఘుపతేహృది స్ఫురతిభైవమే
సదహమోర్భిదా సంవిదాఽగలత్. ౮

ఓ రఘువంశశ్రేష్ఠా! హృదయమందిప్పుడు నాయొక్క ్రకాశమే స్ఫురించుచున్నది. జ్ఞానముచేత నేననుదానికిని కనుట) సత్పదార్థమునకును భేదము జారిపోయినది.

మమహృదిస్థిత స్త్వంకృపామయ
సహజసంస్థితౌ ఘటయపూర్ణతాం ౯

(ఓ రామా!) కృపామయుఁడవైన నీవు నా హృదయ మన్నవాఁడవై (ఆత్మను గూర్చిన) సహజ నిష్ఠయందు పరిపూర్ణత్వమును గలుగజేయుము.

స్తుతిరియంకృతా భవభయాపహా
శ్రీనివాసనామ్నా ముముక్షుణా. ౧౦

సంసారభయమును పోగొట్టునదగు ఈ స్తోత్రము మకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసుఁడను ముముక్షువుచే ంబడినది.

ఇష్టదేవతాధ్యానము

సమాప్తము.

ఓం

# సహజనిష్ఠ



ద్రష్ట్రితాకృత — తాను లేకున్నదా
స్వాయమసన్యది — ద్రష్టయెట్లగును ?
స్వస్వరూపవిత్ — తానెన్న దనరూపు
స్వస్థితో భవేత్ ॥ ౧ — దా స్వస్థుఁడగును॥ ౧

శ్రోత్రాదీంద్రియ వ్యవహారములును వాగాదుల క్రియలును మనోబుద్ధి చిత్తాహంకారములను అంతఃకరణ చతుష్టయ వ్యవహారములును ప్రాణాదుల చేష్టలును సుషుప్త్యవస్థా సంబంధములగు సుఖిత్వాజడత్వాదులును తనకు తెలియఁబడుచున్నవిగదా! తాను చూచువాఁడు కానియెడల ఈ సర్వవ్యవహారములును తనకెట్లు తెలియును ?

తాను లేనియెడల చూచుటమాత్ర మెట్లు సంభవించును ? కావున ఆత్మ లేదనువారి వాదము నిరాధారమైనది.

ద్రష్టయగు తనయొక్క స్వరూపమేదియని విచారించి తెలిసికొనిన వాఁడు తనయందే నిలుకడ గలవాఁడగుచున్నాఁడు.

ద్రష్టృతాఽఽత్మనో | తనువుకు ద్రష్టయై
యదితనోః పృథక్ | తానున్న యెడల
తనుగతజ్వరా | తనుతాపమెన్నఁడు
న్నాను సంజ్వరేత్ ॥ 2 | తనకుండబోదు॥ 2

తెలియఁబడుదానికంటె తెలియువాఁడు వేఱను వివేక
ము చేత తెలిసికొనువాఁడగు తాను తెలియఁబడునదగు
ముతో కలియక (అనగా తెలియఁబడునదగు శరీరమున
టె తెలిసికొనువాఁడగు తాను వేఱను నిశ్చయజ్ఞాన
తో) తన శరీరము నన్యుని శరీరమునువలె వేఱుగ
త్రించుచున్న యెడల శరీరసంబంధములగు తాపములు
న్న తపింపఁజేయఁజాలవు.

మనస ఆగమాఽ | మనసుకు ద్రష్టయై
నాగమాస్వయం | మరువక యున్న
పశ్యతోమనః | మనసు చలించదు
స్వస్థతాం వ్రజేత్ ॥ 3 | తనతావు నుండి॥ 3

మనస్సు, మనస్సుయొక్క వ్యవహారములు తనకు
లియఁబడుచున్నందున, తాను మనస్సును దాని వ్యవహార
ములను చూచువాఁడేగాని, మనస్సుగాని మనోవ్యవహార
ములతో సంబంధము గలవాఁడుగాని కాదని నిశ్చయించు

కాని తన సహజద్రష్టృత్వమును మరువక మనస్సుతోగాని మనో వ్యవహారములతోఁగాని కలియక వేరుగ నిలచి మనస్సుయొక్క రాకపోకలను నిలుకడతో గుర్తించుచున్న యెడల అది తనంతనే నెమ్మతినొందును.

అహమ ఆగమం
పశ్యతస్స్వయం
స్వస్థలేహ్యహం
పతతిచధ్రువం॥ ౮

నేనను వృత్తిని
నిష్ఠతో నరయ
నేననునదియె స్వ
స్థానమునఁబడు॥ ౮

(వ్యవహార కాలములయందు సైతము మనస్సుతో కలియక విలక్షణముగనుండి మనోవ్యవహారములకు ద్రష్టయై యుండఁగల నిలకడ సిద్ధించిన పిమ్మట నేనను వృత్తికి ద్రష్టయై నిలచి, దానితో కలియక వేరుగ నున్నవాఁడై అయహం వృత్తిని నిలుకడతో గుర్తించుచున్నయెడల అదియు తన స్థానమందే పడిపోవును.

స్వస్యవిస్మృతే
స్వమనసఆవృతేః
ద్రష్టృతాఽస్తిచే
ద్భవతిసంస్థితిః॥ ౯

మరపును నిద్రను
మరువక యున్న
స్థిరమైన నిలుకడ
జేకురు నిజము॥ ౯

మనస్సునకును నేనను వృత్తికిని ద్రష్టృత్వము నభ్యసించు కాలమున నేనుద్రష్టననెడి జ్ఞానమును మరచుటగాఁ

ప్పుటగాని సంభవించును. అట్టి సమయమున తన్నావ
మరపునకును నిద్రకును ద్రష్టయై నిలచి వానిని నిలు
గుర్తించుచున్నయెడల అవి రెండును నశించి మంచి
త సిద్ధించును.

ద్రష్టృతాకుతో ౽ — ద్రష్టృతబుట్టు నా
స్త్రీతిచిన్వతః — స్థానము వెదుక
స్వేప దేస్థితి — స్వస్థలంబున గల్గు
ర్భవతిచాత్మనః॥ ౯ — సంస్థితి దనకు॥ ౯

మనస్సునకును అహంవృత్తికిని నిద్రకును మరపున
ద్రష్టృత్వము సాధించిన మీదట) నేను ద్రష్టనని వ్యవహ
దృశ్యమగు నంతఃకరణావృత్తికి ద్రష్టయై యా
కరణావృత్తికి ద్రష్టృత్వమును ప్రసాదించిన దృశ్యరహిత
రూపాత్మ యుండుచో టెక్కడయని మరపునకును
ప లోనుగాని సహజద్రష్టృత్వముచేత నన్వేషించిన
మనస్సు, అహంవృత్తి, మరపు, నిద్ర, లేని సహజ
రూపాత్మయందు విశ్రమించుచున్నాడు.

కృత్యమస్తి కిం — స్వస్థితిగని యుచ్ఛ
స్వస్థితేర్విదః — సంస్థితియందు
స్వేచ్ఛసంస్థితౌ — స్వస్థతంబడసిన
నస్తతాంవినా॥ ౭ — బని లేనివాడు॥ ౭

ద్రష్టయగు తాను ద్రష్టనని వ్యవహరించెడి అంతః కరణవృత్తిగాక ఆయంతఃకరణవృత్తికి ద్రష్టృత్వము ననుగ్రహించిన దృక్స్వరూపాత్మ యని నిశ్చయించి గొప్ప నిలుకడతో అందే విశ్రమించి యున్నవానికి అంతకన్న చేయఁదగినది మరేమియును లేదు.

స్వస్థలేస్వయం　　స్వస్థలంబున నున్న
తిష్ఠతో మునేః　　సన్మౌని కెపుడు
సంసృతేర్భయం　　సంసృతిర్భయము లే
నహి కదాచన॥ ౮　　శంబైన లేదు॥ ౮

భేదమును భావించుటచే నుత్క్రాంతియు తన్మూలమున మరల దేహధారణమును గలుగుచున్నది. స్వస్వరూపమందు భేదభావనారహితమగు మౌనముతో విశ్రమించి యున్నవానికి ఒకప్పుడును జననమరణ భయము లేదు.

సహజసంస్థితే　　సహజసంస్థితికి నీ
రయమహాక్రమః　　సాధనక్రమము
శ్రీనివాసనా　　మహి శ్రీనివాసుండు
మ్నాప్రచోదితః॥ ౯　　మహితమార్గ మనె॥ ౯

స్వస్వరూపమును గూర్చిన సహజనిష్ఠ నభ్యసించుటయందు ఈపద్ధతి చాలమంచిది. ఇది శ్రీనివాసునిచేత చెప్పబడినది.

స్వస్థచేతసం నమ్రచేష్టితం
సోదర౯విదం నౌమితంగురుం॥

సహజనిష్ఠా సమాప్తా
శ్రీరామకృష్ణస్య సోదరేణ
శ్రీనివాసేన విరచితా

ఓం తత్సత్.

శ్లో॥ వంశేతు పొన్నలూర్ నామ్ని సంభవాశ్రీమతాంగృహే
రమణాఖ్యస్యయాపత్నీ వివేకవిభవస్యచ॥ ౧

శ్లో॥ కొండూరువంశవారాశే రమృతాంశోశ్చయస్యచ
మాతాచ వేంకయాఖ్యస్య సౌహార్ద్రిహృదయాన్వితా॥

శ్లో॥ యుక్తాయుక్త వివేకజ్ఞా ప్యుదారగుణశోభితా
ఆస్తిక్యభావసంయుక్తా వరాసుందరమాంబికా॥ ౩

శ్లో॥ లఘుగ్రంథమిమంకర్తుం ముద్రణం స్వయమేవసా
ద్రవ్యం ప్రాదాన్నపృష్టాఽపి బ్రహ్మార్పణమనీషయా॥ ౪

ఓం తత్సత్.



ఓం

శ్రీ రామాయ నమః

సద్గురుభ్యో నమః

# ప్రబుద్ధగీత

ధీంద్రియముల కెవఁ డధీశుఁడై జీవుని
బంధమునకు మోక్ష పదమునకును
కారణుండు నయ్యె ఘనునా రఘూద్వహుఁ
భవభయంబుఁ బాపఁ బ్రస్తుతింతు. 1

చిన్ననాఁటనుండి చిత్తమెవ్వానిపాద
పద్మమున్నఁ బూర్ణ భక్తి నెఱపు
నమ్మహాత్ము నాదునగ్రజు శ్రీరామ
కృష్ణగురుఁ, బ్రబుద్ధ హృదయు నెంతు. 2

శ్రుతిపథం బెఱింగి హితమతి వేదాంత
వీథి నరుగ భవము వీడు నంచు
విజయశంఖ మొత్తి విశ్వగురుస్థాన
మాక్రమించు శంకరార్యుఁ దలఁతు. 3

వీతరాగులకును విజితేంద్రియులకును
విగత మత్సరులకు విజ్ఞులకును
మోహ శోక భయ విముక్త మానసులకు
మాన్యచరితులకు నమస్కరింతు. 4

అని యిట్లు దేవ గు ర్వాచార్య సాధు సజ్జనంబులకు
నమస్కరించి ;

సత్యనియతి సర్వ భూతహితం బప
రిగ్రహంబు ధీని నిగ్రహంబు ;
చౌర్యరహితవృత్తి, శౌచ, మాస్తిక్యంబు,
త్రికరణములశుద్ధి, తెగువ గలిగి. ౫

స్వార్థచింత లేక – సర్వేశుకృప తన
కబ్బినంతె గొనుచు నిబ్బరంపు
హృదయమున సతంబు నిడుములఁ జడియక
స్వాంత మీశునందుఁ జక్కఁ జేర్చి. ౬

ధీనియంతృకరుణ దీపింపఁ బురుషోత్త
మాఖ్యు దేవదేవు ననుదినంబుఁ
బూజ సేయఁ జేయఁ బొడమిన పుణ్యాతి
శయముచే వివేక నయన మొప్ప. ౭

శమదమాది షట్క సంపత్తి వైరాగ్య
మమృతపదవి నొంద నాతురతయు
హృదయమున జనింప మొదలంటు సంసార
తరువుఁ గూల్ప జ్ఞాన పరశువునను. ౮

జ్ఞాన మెద్ది? దాని సాధనక్రమ మెద్ది?
స్వానుభవముయొక్క సరణి యెద్ది?
అని విచారమగ్నులయి మార్గ మెఱుఁగని
సాధకులకు విమల బోధ గఱప. ౯

జ్ఞాని యనుభవంబు మానుగ నే నీ ప్ర
బుద్ధ గీతయందుఁ బొందుపఱతు
ముక్తియన్న మనసు మునుకొను మనుజుండు
శ్రద్ధతోడ దీనిఁ జదువుఁగాత. 10

## ప్రబుద్ధవచనము

నేను నే నటన్న దేని కర్థం బను
వాత్మచింతనమున నహముకన్న
నన్యమైన సచ్చిదాత్మయే నేనను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 1

ఎఱుఁగఁబడున దెల్ల నెఱిఁగెడి దానికి
నన్యమై వెలుంగు ననెడి యుక్తి
తను హృషీకతతులు తాను గా దనియెడు
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 2

ఎఱుఁగు దానిధర్మ మెఱుఁగంగఁబడ దను
స్వాత్మతత్త్వ మరసి సుఖము దుఃఖ
మాత్మయం దొకప్పు డైనను లేవను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 3

ఎఱుఁగఁబడెడిధర్మ మెఱుఁగంగఁబడు దాని
కనెడి యుక్తివలన నాత్మయందు
ఎఱుఁగఁబడున దెన్నఁ డెద్దియు లేదను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 4

దృశ్యమైనబుద్ధి దృశ్య మెద్దానికౌ
నదియె దృశ్యరహిత మగు చిదాత్మ
అదియె నేను దాని కన్యంబు గాను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 5

బోధరూపమైన బుద్ధి యెవ్వని ప్రకా
శమున బోధ నొంది జ్ఞాతయయ్యె
నదియె; సత్య చిద్ఘ నానంద రసమను
నిజమెఱింగినాఁడ నేఁడు నేను. 6

నే నటంచుఁ దోఁచు దానియందున జ్ఞేయ
మైన భాగ మాత్మ కన్యమంచు
విడువ నాత్మ యొకటె కడను నుండునటన్న
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 7

పరిణమింప బుద్ధి పరిణామ మనునది
లేక సతత మెద్ది యేకరీతి
బుద్ధియందు వెలుఁగు నద్దియే నేనను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 8

తనువు నింద్రియములు మనసు తమంబును
నేను గాను నేను నే ననివెడు
తలఁపు నెఱుఁగు నట్టి తత్త్వమే నేనను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 9

మనసు నింద్రియములుఁ గననేరని చిదాత్మఁ
గనుట కొక్క శ్రుతియె కలదు గాన
శ్రుతిని విడువ వేఱు గతి యింక లేదను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 10

శ్రుతి వచించినటులు మతిమంతుఁ డెవఁడేని
శ్రవణ మనన ములను సలుపుచున్నఁ
గనఁగనేర్చు నతఁడు తనస్వరూపంబను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 11

'తత్త్వమసి' వచించు తత్త్వావబోధంబు
హృదయఫలకమందు కుదురుఁబడిన
జననమరణభయము సమసిపోవునటన్న
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 12

ఈశజీవు లనెడి యీయుపాధు లవిద్య
చేత దృక్కునందుఁ జెలఁగుచుండు
దృశ్యవస్తువు లగు దృక్కుగా దనియెడు
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 13

ఆదియందు లేక నంతమందును లేక
మధ్య మున్న జగము తథ్యమౌనె!
శశవిషాణమట్లు జగ మసత్యం బను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 14

అద్వితీయ ప్రత్యగాత్మ ధర్మంబులౌ
అస్తి భాతి ప్రియములనెడి మూఁటి
వేఱుపఱప మిగులు విశ్వ మసత్తను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 15

చిత్ర మీజగంబు చేతోవిలాసంబు
స్వప్నవస్తువట్లసత్యమె యగు
తనదుభ్రమలకెల్ల మనసె కారణ మను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 16

తను నెఱుంగ మేన తమకంబు వీడును
బ్రహ్మ మైతి ననిన భయము దొలఁగు
జగ మసత్య మన్న సమయుఁ జిత్తంబను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 17

తత్త్వజ్ఞాన ప్రకరణము

సమాప్తము

శ్రీరామకృష్ణ సోదరుఁడగు
శ్రీనివాసునిచే రచియింపఁ

బడినది

ఓం తత్సత్

---

ఓం

శ్రీ రామాయ నమః

# విధినిషేధప్రకరణము

పూర్వబుద్ధి చెడక పుట్ట దొండొకటియా
బుద్ధి తద్విరుద్ధ బోధకముగ
నంచు నాత్మబుద్ధి కడ్డమౌ బుద్ధిని
విడిచినాఁడ తొలుత విధిగ నేను. 1

వసుధయందుఁ గల్గు వస్తుచయంబున
'నాది' యనెడుతలఁపు పాదుకొనిన
'నేను' ననెడుబుద్ధి మాన దెన్నఁటికని
విడిచినాఁడ దాని విధిగ నేను. 2

ఒడలినుండి తమక మొదలింప రాగలో
భములు మదము మత్సరమును నడప
కడ్డుతగులునంచు సడ్డ చేయక వాని
విడిచినాఁడఁ దొలుత విధిగ నేను. 3

చిల్లిగవ్వనైనఁ జిత్త మేనాఁ డాశ్ర
యించు నపుడె యొడలి నెంతు నంచు
మనసు తగులనీక తనుసుఖములనాఁడ
విడిచినాఁడ వాని విధిగ నేను. 4

ఆత్మవేత్తయైన నపరిగ్రహము వీడి
వస్తుసంగ్రహైక పరత నున్న
చిత్తువిడిచి తనువు పొత్తుఁగోరుటె యని
విడిచినాఁడ దాని విధిగ నేను. 5

మేనితోడిసుఖము మానిన మనుజుండె,
మేన నాత్మబుద్ధి మాన నేర్చు
మేనిసుకమటన్న మెయితలంపె యని
విడిచినాఁడ దాని విధిగ నేను. 6

గౌరవమున దృష్టి గలిగినవారికిఁ
గాయమందు దృష్టి కలుగు నంచు
పూజలందుకొనుట పూర్ణమనంబున
విడిచినాఁడఁ దొలుత విధిగ నేను. 7

పరులు నిందసేయఁ బలుకంగ రాదికఁ
బూజఁ జేసినంత పొంగరాదు
వీని విడువ మమత వీడు మేన నటంచు
విడిచినాఁడ వాని విధిగ నేను. 8

తనువునందుఁ దనకుఁ దమక మున్నప్పుడే
పతులు సుతులు హితులు సంపదలును
తమక ముడుగ మేన మమత లెక్కడివని
విడిచినాఁడ వాని విదిగ నేను. 9

చవ్వులవంకఁ బోవ సన్న్యాసియైనను
రసమునందె మిగుల రక్తుఁ డగును;
రసము విడువఁడేని రాగంబు చెడ దని
విడిచినాఁడ దాని విధిగ నేను. 10

విషయ చింతనముల విలసిల్లఁజేసెడి
వచనములను వినుటఁ బలుకుచున్న
యోగినైన నవియె భోగిఁ జేయు నటంచు
విడిచినాఁడ దాని విధిగ నేను. 11

వపువునకె తలంప వైరిగణంబులు
వపువు కాని నాకు వైరు లెవరు?
వైరిబుద్ధియున్న వపువుధీ చెడ దని
విడిచినాఁడ దాని విధిగ నేను. 12

తనువు కానటంద్రు ధనమును గూర్తురు
తనువు కానినాఁడు ధన మిఁకేల!
తత్త్వతనువులందు తనువుదే ఘన మని
విడిచినాఁడ దాని విధిగ నేను. 13

నింద్యమాటఁ దనువు నిందింత్రు లోకులు
నింద చేసి రంచుఁ గుందనేన?
తనువు కానినాకుఁ దమకె మేల యటంచు
విడిచినాఁడ దాని విధిగ నేను. 14

మేను నేనటన్న మేకొనుఁ గష్టంబు
మెయితలంపు వీడ మేలు గలుగు
మేలుగోరునరుఁడు మేను నే ననఁ డని
విడిచినాఁడ దాని విధిగ నేను. 15

వపువు సుఖములందు వలపు నడంచిన
మెయితలంపు వీడి మెలఁగ నేర్చు;
వలపు లుండువఱకుఁ దలఁపు వీడ దటంచు
విడిచినాఁడ వాని విధిగ నేను. 16

దేహబుద్ధి భేద బుద్ధి నొసంగును
భేదబుద్ధి నరుని భీరుఁ జేయు!
పొలయ భయము దేహ బుద్ధి పోవలెనని
విడిచినాఁడ దాని విధిగ నేను. 17

తత్త్వవేత్త ననెడు తలఁపైన నరునకు
మేని తమకమునను మెయికొనునని
తలఁపు వీడవలయు తత్త్వవేత్త కటంచు
విడిచినాఁడ దాని విధిగ నేను. 18

వేయిమాట లేల విశ్వంబులో 'నేను'
'నాది' యనెడి తలఁపు పాదుకల
విడువఁదగినవానిఁ దడవుసేయక వేగ
విడిచినాఁడఁ దొలుత విధిగ నేను. 19

విధినిషేధ ప్రకరణము
సమాప్తము
ఓం తత్సత్

ఓం

శ్రీ రామాయ నమః

# అభ్యాస ప్రకరణము

శమదమాది సుగుణ సంపత్తి లేకున్నఁ
జిత్త మాత్మయందుఁ జేరదనుచు
స్వస్థచిత్తమొంద సాధనసంపత్తి
నభ్యసించినాఁడ నంత నేను. 1

ఆత్మయందు మనము నట్టి నిల్పుదమన్న
నాత్మగాని తనువు లడ్డమగుట
తనువులెల్ల దాఁటి తత్త్వంబుఁ జేరంగ
నభ్యసించినాఁడ నంత నేను. 2

చెప్పికొనుట వినుట చింతించుట తదేక
నిష్ఠ నాత్మపరత నిలుచుటయును
జ్ఞానమునకు ముఖ్య సాధనం బని దీని
నభ్యసించినాఁడ నంత నేను. 3

ప్రతినిమేషమందు పరతత్త్వచింతను
సలుపవలయు నహము సమయునటుల
తత్త్వబోధ పూర్ణతను బొందుకొఱకని
యభ్యసించినాఁడ నంత నేను. 4

చిత్తు నే నటంచుఁ జెప్పనేర్చినాఁడు
చిత్తు గానివాని పొత్తదేల?
చిత్తుతోనె మనము హత్తింప వలెనని
యభ్యసించినాఁడ నంత నేను. 5

చిత్తువిడచి మనసు చేరెనా యన్యంబు
చిత్తునందదిమట్టి చేరఁజనదు
కానఁ జిత్తమెప్పుడు కడుమెలంకువ నుండ
నభ్యసించినాఁడ నంత నేను. 6

ధీని గెలువరాదు ధీరభావము లేక
దీని గెలువకున్న దేహబుద్ధి
విడువ రాదటంచు విఘగను ధీరత్వ
మభ్యసించినాఁడ నంత నేను. 7

తనువు గానటంచుఁ దలఁచిన ఫలమేమి
తమకె మునుఁగికొన్న తనువునంద
టంచు మేనతలఁపు ద్రుంచఁగ నెమ్మది
నభ్యసించినాఁడ నంత నేను. 8

తనువునకును గష్ట తతు లొనఁగూడిన
తనువునందుఁ దలఁపు దగులకుండ
తలఁపులందు నేని తత్త్వమిది యటంచు
నభ్యసించినాఁడ నంత నేను. 9

చిత్త మొక్క-క్షణము చిన్మయి విడిచిన
తనువునందుఁ దలఁపు తత్క్షణంబె
యుద్భవించు నంచు నోరిమిఁ జిద్వృత్తి
నభ్యసించినాఁడ నంత నేను. 10

వ్యాధు లొదవునాఁడు వైరి పైకొనునాఁడు
మరణభయము కలఁత పఱచునాఁడు
దేహబుద్ధి విడుచు ధీ కల్గవలె నని
యభ్యసించినాఁడ నంత నేను. 11

ఒంటె దిఱుగునాఁడు నరగంబు గనునాఁడు
వ్యాఘ్రవృశ్చికాళి వంకఁ బోవు
నాఁడు గూడ దనువు నాదను మది చెడ
నభ్యసించినాఁడ నంత నేను. 12

చిత్తునందు మనసు చేయును విడుచును
తలఁపు తనువునుంచి తొలఁగ బఱచు
దేహదృష్టి చెడిన స్థిరపడు మన మని
యభ్యసించినాఁడ నంత నేను. 13

చూపు లోని కేఁగ శుద్ధాత్మునితలంపు
బాహ్యమునకు నేఁగ బ్రహ్మబుద్ధి
యుండవలయు నంచు నోపికఁ దద్వృత్తి
నభ్యసించినాఁడ నంత నేను. 14

ఆత్మమాత్ర మఖిల మను బోధ కవధి స
ర్వం బఖండ చిత్సు ఖంబు గాఁగ
నిండుమనముతోడ నుండుటే యని; దీని
నభ్యసించినాఁడ నంత నేను. 15

బ్రహ్మ మైతి ననెడు పరిపూర్ణ బుద్ధికై
లో వెలికని చిత్త లోచనంబు
సంచరింపకుండ సత్తునందే చేర్ప
నభ్యసించినాఁడ నంత నేను. 16

ఆదియందె దాఁటి యడ్డంకు లన్నింటి
నాత్మబుద్ధికొఱకు నహరహంబు
దేహబుద్ధి విడువ ధీచేత మెల్లఁగ
నభ్యసించినాఁడ నంత నేను. 17

ఆత్మ గానిదాని నవలఁ ద్రోచుటయును
నాత్మబుద్ధితోడ నలరుటయును
ఏకకాలమందె యేర్పడవలెనని
యభ్యసించినాఁడ నంత నేను. 18

వెలికి లోని కనెడు వెత లెల్లఁ దీఱఁగాఁ
జిత్తునందు మనము చేరియుండెఁ
జిత్తునందుఁ దోఁచు చిత్రమే జగ మని
యెఱిఁగి దానివంక కఱుగ నేను. 19

అభ్యాస ప్రకరణము సమాప్తము

శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడినది

ఓం తత్సత్

ఓం

శ్రీ రామాయ నమః

# స్థితప్రజ్ఞప్రకరణము

జ్ఞాన మొదవుటచేత నజ్ఞాన మణఁగ
తనువునందున్న నేనను తలఁపు దొలఁగ
చిత్తు నేనైతినని చిత్తుఁజేరినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి.

తనువు నేనైతినని మదిఁదలఁచినపుడు
తనువు విడనాడి చిత్తును దలఁపదాయె
చిత్తు నేనైతినని చిత్తుఁజేరి నేఁడు
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి.

కాయమున కెన్ని క్లేశముల్ గలుగుచున్నఁ
గాయమును నేను గానని కడకుఁద్రోసి
చిత్తునేనైతినని చిత్తుఁజేరినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి.

'నాది' 'నే' ననునట్టి యనాదియైన
మాయసంసారమున భ్రమల్ మాసిపోవ
చిత్తు నేనైతినని చిత్తుఁజేరినట్టి
చిత్త మేఁగదు చిన్మయు చెంతవిడిచి.

దారలుం బుత్రులును ధన ధాన్యములును
భోగభాగ్యంబులును బరిపూర్ణములుగఁ
జేరియున్నను జిద్రూపుఁ జేరినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి.

మేను వ్యవహారపరతను మెలఁగుచున్న
స్త్రీ జనంబులమధ్యను తిరుగుచున్న
వపువునం దభిమానంబు వదలినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి.

గంధమాల్యాంబరంబుల గాత్రమునకు
సంతతంబును బూజలు జరుగుచున్న
పూలపాన్పున దేహంబు పొరలుచున్నఁ
జిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి.

ఇంద్రభోగంబులం బోలు నీప్సితముల
నెన్ని చేకూర్చి కూర్మితో నిత్తునన్నఁ
జిత్స్వరూపంబునందునఁ జేరినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి.

అనయము ప్రియాప్రియంబులు తనువునంబొ
దగులమొందిన బుద్ధికిఁ దగులుగాని
చిత్సుఖంబగు నాఁకిఁకఁ జెందవనుచు
జిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి.

గాలి యెండయు వానయు గాత్రమునకు
గాసి గలిగించుచున్నను గాసి యనక
గాత్రమును నన్యగాత్రంబు కరణిఁ జూచి
చిత్త మేఁగదు చిన్మయు చెంతవిడిచి.

పెంటకుప్పలయందును బెరడులందు
బూరిగుడిసెల యందును బొలములందు
మేను దొరలుచునున్న నమ్మేని మఱచి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి.

కఠిన శిలలందు సెలయేళ్ళ గట్టులందు
శైలగహ్వరములను దేవాలయముల
మేను చీకాకుపడి సంభ్రమించుచున్న
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి.

కట్టి జీర్ణాంశుకంబైనఁ గలుగకున్నఁ
గుడువ నన్నంబు తనకుఁ జేకూరకున్నఁ
బీడ లెన్నెన్ని తనువునఁ బెరుగుచున్నఁ
జిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి.

మృత్యుదేవత చనుదెంచి యెదుటనిలిచి
తనకు హానినిగూర్పంగఁ దలఁచుచున్న
చిత్తు నేనైతి ననిచిత్తుఁ జేరినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి.

వపువు మిత్రులయం దరివర్గమందు
నాత్మవిదులం దవిద్యావృతాత్ములందుఁ
దిఱుగుచును బహుక్రీడలఁ దేలుచున్న
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 15

బుద్ధివృత్తుల ననిశంబుఁ బూర్ణముగను
బోధమాత్రస్వరూపమై పొదలుచున్న
చిత్తు నేనై తనని చిత్తుఁ జేరినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 16

మాన మవమాన మనియెడు మాటలేదు
సుఖము దుఃఖము ననియెడి చూడ్కి లేదు
నిరతిశయమైన సుఖమున నిలిచినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 17

ముక్తకంచుకమం దను శక్తి లేని
విషధరముఁబోలి మమకార విరహితమగు
తనువు నందిఁకఁ దమకంబు తగదటంచుఁ
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 18

ఇన్నిజన్మంబులకు హేతువేది యనినఁ
దనువునందలి తమకమే యని సతంబుఁ
దలఁచి యీనాఁడు మేల్కాని తత్త్వమరసి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 19

స్థితప్రజ్ఞ ప్రకరణము సమాప్తము
శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచింపఁబడినది
ఓం తత్సత్

ఓం

శ్రీ రామాయ నమః

# ద్వంద్వాతీత స్థితి ప్రకరణము



నిరతిశయమైన ప్రీతికి నిలయమైన
నిత్యసుఖరూపమందట్టి నిలిచెబుద్ధి
దుఃఖరహిత స్థితింబొంది తుష్టిఁ జెంది
యున్నవాఁడ నిజస్థితిం గన్న నేను.

నిర్వికల్ప స్వరూపంబు నిర్మలంబు
చిత్తవృత్తి విహీనంబు చిన్మయంబు
నైన నాయందు నే నిల్చి హాయిగాను
నున్నవాఁడ నిజస్థితిం గన్న నేను.

తల్లిదండ్రులు తనయులన్ తలఁపులణఁగ
జననమరణంబులను భ్రమల్ సమసిపోవఁ
జింతఁ దొలఁగిన మనమున సంతసమున
నున్నవాఁడ నిజస్థితిం గన్న నేను.

అహము మొదలుగ తనువుతో నంతమైన
జడము నేగాను గనఁగ నజడమె యగుదు
ననుచు జడముల నభిమాన మట్టె విడిచి
యున్నవాఁడ నిజస్థితిం గన్న నేను.

ఈవిషయం బిసుమంత్రైన నిచ్ఛ లేదు
పుచ్చుకొననైనఁ గోరిక పుట్ట దెపుడు
ఇచ్చునెడఁ బుచ్చుకొనునెడ నిచ్ఛ లేక
యున్నవాఁడ నిజస్థితిం గన్న నేను. 5

మౌననియమమునం దుండ మనసు లేదు
వాగ్మినై యుండవలెనను వాంఛ లేదు
మౌనినై వాగ్మినై యుంట మాని యెపుడు
నున్నవాఁడ నిజస్థితిం గన్న నేను. 6

చేయఁదగు కార్యమిదియని చేయఁబూన
విడువఁ దగినదియని మరి విడువఁబూనఁ
జేయుటయు మానుటయు నను చేష్టలుడిగి
యున్నవాఁడ నిజస్థితిం గన్న నేను. 7

పలుకవలె సత్యమంచు నేఁ బలుకఁబోను
విడువవలె ననృతంబని విడువఁబోను
సూనృతాసూనృతంబులఁ జూడకెపుడు
నున్నవాఁడ నిజస్థితిం గన్న నేను. 8

భోగముల నొందవలెనని పొందఁబోను
విడువవలె భోగములనంచు విడువఁబోను
పొందుటయు మానుటయు నను భ్రాన్తి లేక
యున్నవాఁడ నిజస్థితిం గన్న నేను. 9

ధనము గూర్పంగవలెనంచుఁ దలఁపఁబోను
విడువవలెనంచు మరి దాని విడువఁ బోను
ధనము గూర్పంగ విడువంగఁ దలఁపు లేక
యున్నవాఁడ నిజస్థితిం గన్న నేను.

ఆత్మయందట్టి శోకమోహముల బాపి
గాసిపడు మూఢుఁ డజ్ఞానకలితుఁడగుచు
చిత్తధర్మంబులని వాని చింత లేక
యున్నవాఁడ నిజస్థితిం గన్న నేను.

తత్త్వబోధామృతముఁ ద్రావి తన్మయతను
చిత్తము లయింపఁ దానైన తత్త్వమందె
తనకు నన్యము గలదను తలఁపు లేక
యున్నవాఁడ నిజస్థితిం గన్న నేను.

పుట్టుగోచికి కటివయ్యుఁ బొంద వ్యథను
చీనిచీనాంబరములచేఁ జెంద ముదము
మంచిచెడ్డలఁ బరికించు మనసు లేక
యున్నవాఁడ నిజస్థితిం గన్న నేను.

కఠినశిలలందు శయనించి గాసిఁ బొందఁ
బూవుసెజ్జఁ బరుండియుఁ బొరయ సుఖము
కఠినమని మెత్తఁదనమని కననిస్థితిని
నున్నవాఁడ నిజస్థితిం గన్న నేను.

ఏమని వచింతు నాస్థితి నెవఁడెఱుంగు
నిరతిశయ నిత్యసుఖమున నిలిచి మాన
సేంద్రియాతీత సహజాత్మ వృత్తిని గాని
యున్నవాఁడ నిజస్థితిం గన్న నేను. 15

స్వానుభవపథంబు సచ్ఛిష్యసేవ్యంబు
సద్గురూపదేశ సంగ్రహంబు
శ్రీనివాస హృదయసీమ సంజనితంబు
బోధసారమిది ప్రబుద్ధగీత. 16

ద్వంద్వాతీతస్థితి ప్రకరణము
సమాప్తము
శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచియింపఁబడినది.

ఓం తత్సత్
ప్రబుద్ధగీత సమాప్తము.



ఓం

సద్గురుభ్యోనమః

## ధ్యానము

కం॥ హృదయాంతర్గతు డగుచును
హృదయ తమంబెడల నడిపి యెడఁద వివేకం
బొదవింపజేయు రఘుకులు
పదయుగళం బెంతు జ్ఞాన వహ్నిర గుల్పన్

కం॥ శ్రుత్యర్థమెల్ల పరమా
ద్వైతంబని కారికలను తత్త్వంబెల్లన్
హితమతి వివరించిన యా
మతిమంతుని గౌడపాదు మదినర్చింతున్॥

కం॥ గోవింద పూజ్యపాదుని
భావించి మనంబులోన వరయోగీంద్రున్
సేవింతు శంకరార్యుని।
భావంబున నాత్మబుద్ధి ప్రభవింపంగన్॥

కం॥ హస్తామలకాదులను ప్ర
శస్తులనౌ బ్రహ్మవిదుల సత్వజ్ఞుల స
న్న్యస్తుల శంకరశిష్యుల।
న్యస్తరజస్తములనే వినమ్రత గొలుతున్॥

కం॥ ఆచార్య పీఠమెక్కిన
యాచార్యుల విశ్వగురుల నాత్మజ్ఞుల నే
నాచార్య సాంప్రదాయుల।
ప్రాచీనుల నేటిగురుల-ప్రస్తుతి సేతున్।

కం॥ పరవిద్యను నేర్పిన మ
ద్గురువర్యుని రామకృష్ణ-గుణనిధిని సహో
దరుని పదాబ్జంబుల నే।
నిరతము ధ్యానింతుమది పు-నీతము గాగన్॥

ధ్యానము సమాప్తము

ఆ॥ వె॥ స్వానుభవవిధంబు చక్కఁగా వివరించి
జ్ఞాన దార్ఢ్యతకుప్ర ధానమైన
వాస్తవికపుదృష్టి వరలుట్కై నేడు
పలుకువాడ శ్రుతుల తలపు తీరు ॥

శ్రీ రామాయనమః

సద్గురుభ్యోనమః

# పరమార్థదర్శనము

తే॥ గీ॥ నేతినేత్యాది వాక్యముల్ —నేతినేతి
యంచు కల్పితములనిషే-ధించి దేని
కల్పితమ్ముగాని దని కట్ట-కడకుఁ దేల్చె
నట్టి ప్రత్యక్స్వరూప చి -దాత్మ నేను॥

తే॥ గీ॥ తత్త్వమస్యాది వాక్య తా- త్పర్యమైన
బ్రహ్మచైతన్య మెయ్యది-ప్రత్యగాత్మ
యని యహంశబ్ద లక్షిత-మై తనర్చు
నదియె నేనౌదు కా నహ-మాదికంబు॥

తే॥ గీ॥ అహమహమటంచు స్ఫూర్తియౌ-నహమునందు
జ్ఞేయభాగంబు విడువ — నజ్ఞేయమైన
జ్ఞానమే యాత్మయంచు సు-జ్ఞానమతిని
నరసినాయంత నేనుందు సహముబాసి॥

తే గీ॥ జ్ఞాతజ్ఞేయంబుగామిచే- జ్ఞప్తిరూపు
డైన యాత్మకు జ్ఞేయంబు-లైన తనువు
లన్యమై యుండ నవియెట్టు-లాత్మయగును
తనువులవిగాను నాకిక [illegible]॥

# వతమార్గ దర్శనము

తే॥ గీ॥ జ్ఞేయభాగంబు జ్ఞాతకు జెప్పరామి
జ్ఞేయధర్మంబు లాత్మకు జెప్పరాదు
గాన, యిచ్ఛాప్రయత్న దుఃఖములు సుఖము
జ్ఞానమును, నాకులేవు ని స్సంశయంబు ॥

తే। గీ। మూడవస్థల యందున మొనసియున్న
నాకసము ధూళినంటని యట్లు నేను
జాగ్రదాదుల నంటమి జ్ఞానులెల్ల
నన్నసంగు డటంచు నె న్నంగ గలరు ।

తే॥ గీ॥ ధీ వికారంబులొంద నే నేవికార
ములను బొందక బుద్ధితో, గలియకెపుడు
భాసిలుచు బుద్ధికిని నేను భాసమగుచు
ఘనముగానుండ నే నిర్వి కారి నగుదు ॥

తే॥ గీ॥ నన్ను నెరుగరు యిమ్మూఢ నరులు ధరణి
వారి బుద్ధులకును నేనె ప్రభుడ నగుదు
నిత్యసుఖరూపుడను నేను నిర్మలుండ
నేనె బ్రహ్మంబు నాయందె నేను నుందు ॥

తే॥ గీ॥ నాకు కారణమునులేదు నామరూప
జగము నాయందు విలసిల్లు జగమునకును
నేనె కారణమగుదును నిశ్చయంబు
బ్రహ్మశబ్దంబుచేత నే వరలుచుందు ॥

# పరమార్థ దర్శనము

గీ॥ ఈకనంబడు నానాత్వ మెల్లజూడ
బ్రహ్మమందున మాయచే ప్రభవమొందె
నాస్తిసర్వంబు నరయంగ నాస్తి నాస్తి
యంచు శ్రుతులును బల్కవే యార్తిదీర॥ 10

గీ॥ శ్రుతుల బరికించి చూడంగ శ్రుతముగాదె
బ్రహ్మమందున మాయచే భవమటంచు
యుక్తినరయంగ నదియును యుక్తమయ్యె
సత్యమెట్లగు బరికింప జగమిదెల్ల ॥ 11

గీ॥ సత్తుహేతువుడైన యసత్తులేద
సత్తుహేతువయినట్టి సత్తులేద
సత్తుహేతువయిన య సత్తులేద
సత్తుహేతువుగాగల సత్తులేదు ॥ 12

గీ॥ ఎటుల తర్కించి చూచిన నిట్టులనుచు
కార్యకారణ నియమంబు కానబడమి
పుట్టుకయటన్న నది వట్టిమాటకంటె
లేదుపరమార్థదృష్టిని లేమిభవము ॥ 13

గీ॥ జాతిగలదని వాదింప జాలునెడల
జాతికిని కారణంబును చాటవలదె ?
కారణములేక కలుగునె కార్యమరయ
కార్యకారణములు యుండ గలవె యొకట ॥ 14

# పరమార్థదర్శనము

తే॥ గీ॥ హేతువెయ్యదియని ముందు యెంచబడెనో
అదియె ఫలమయి తదుపరి నమరుచుండె
ఫలము నటువలె హేతువై బరగుచుండ
హేతుఫలములు కాదె యహేతుకంబు ॥

తే॥ గీ॥ హేతుఫలముల నిర్ణయం బెఱుగరామి
జాతిలేదని వేఱె యెంచంగవలెనె
హేతుఫలములు సత్యంబు లే యటన్న
హేతుఫలముల నిర్ణయం బేలలేదు ॥

తే॥ గీ॥ ఈజగంబున దోచునీ హేతుఫలము
లిట్టివి యటంచు జెప్పంగ నెరుగరామి
మాయచేతనె సృష్టి సంభవ మటంచు
నిజమెఱింగిన యార్యుల నిర్ణయంబు ॥

తే॥ గీ॥ స్వయముగానైన నితరంబు వల్లనైన
నెట్టివస్తువు యైనను నెట్టులైన
జననమందదు నటుల యసత్తు సత్తు
తలప సదసత్తు పుట్టుక తగనివగును ॥

తే॥ గీ॥ పుట్టుకయె సంభవింపమి నెట్టులైన
జీవులకు పుట్టువుల్ మరి జెప్పరాదు
జీవులందరు నజులౌట జీవులకును
కారణంబును నరయంగ గానరాదు ॥

తే॥ గీ॥ చిత్తమును పుట్టలేదు యీ చిత్తదృశ్య
ములును పుట్టుటయేలేదు పూర్ణమైన
బ్రహ్మమొక్కటె యేకమై వరలుచుండ
గన నవిద్యనె యివియెల్ల గలుగుచుండు ॥

తే॥ గీ॥ ద్రష్టయును ద్రష్టచిత్తంబు దాని దృశ్య
వర్గ మెల్ల నవిద్యచే బ్రజ్వరిల్లు
వానికిని జూడ పరమార్థ భవము లేదు
స్వప్నమును బోలియుండు నీ జాగరంబు॥

తే॥ గీ॥ పొన్పుపై కాయమొక్కటి బవ్వళింప
నన్యకాయంబు స్వప్నమం దలరు గాదె?
కలనుదోచెడి కాయంబు కరణిజూడ
చిత్తకల్పితమేయని చెప్పవలయు ॥

తే॥ గీ॥ తనర గగనంబునందున తరలినట్లు
తనదు నాశిక నెవ్వడో తరిగినట్లు
బ్రహ్మభావంబు తానెట్లొ బడసినట్లు
చూడ కల నవి మెలకువ పూనృతములె ॥

తే॥ గీ॥ గనగ సూక్ష్మంబునైనట్టి కాయమధ్య
భాగ మందున జూడమే పలువిధములు
స్వప్నమందున దోచెడి వస్తుసమితి
సత్యమేయన్న నివియెట్లు సత్యములగు ॥

తే॥ గీ॥ కాయమధ్యంబు నందున గలుగరాని
వస్తువర్గంబు జూడమే స్వప్నమందు
నివియు సత్యములేయన్న నెటులనుండు
నరమసూక్ష్మంబు నైన యిబ్బాగమందు ॥

తే॥ గీ॥ స్వప్నమునదోచు నీ దృశ్య వర్గమెల్ల
చిత్తకల్పనయే యని చెప్పవలయు
లేదు పరమార్థముగ స్థితి లేదుభవము
చిత్తమే దృశ్యవర్గమై జెలగుచుండు ॥

తే॥ గీ॥ ద్రష్ట చిత్తంబు దృశ్యంబు తగునె చెపుమ
సత్యములటంచు బలుకంగ స్వప్నమందు
నటులె జాగరమందున నౌనుగాదె ?
స్వప్నమును బోలియుండు నీ జాగరంబు ॥

తే॥ గీ॥ చిత్తము చలింప ద్రష్టయు జెలగుచుండు
చిత్తము చలింప దోచునీ చిత్రదృశ్య
మెపుడు చిత్తంబు దృశ్యంబు నిటులెద్రష్ట
దోచుచుండునో సంసృతి దోచునపుడె ॥

తే॥ గీ॥ ద్రష్టృ దర్శన దృశ్యబే దంబిదెల్ల
స్పందితంబైన చిత్తంబు వలన గలుగు
స్పందితముగాని చిత్తంబు నందులేవు
ద్రష్టయును దృశ్యమును మఱి దర్శనంబు

# పరమార్థదర్శనము

తే॥ గీ॥ సుప్తియందున చిత్తంబు చూడబడమి
ద్వైతమటలేదు కలదు యద్వైత మందు
స్వప్నజాగరములయందు వరలుచిత్త
మందువల్లనె ద్వైతంబు అచటదోచు ॥ 30

తే॥ గీ॥ గ్రాహ్యగ్రాహక రూపమై గానుపించు
నట్టి యీద్వైత మిబుల జూ పట్టుచెల్లి
స్పందితంబైన చిత్తంబు వల్లనగుట
చిత్తకల్పిత మిదియని చెప్పవలయు ॥ 31

తే॥ గీ॥ ఆత్మయందున కల్పిత మైనయట్టి
చిత్తమున కల్పితంబయ్యె చిత్రజగము
ఆత్మమాత్రంబుగాదోచ నఖిలజగము
చిత్తమునులేదు చిత్తసృష్టియును లేదు ॥ 32

తే॥ గీ॥ చిత్తమున ద్వైతభావంబు జేరినంత
చిత్తము చలించి కల్పన జేయుచుండు
చిత్తమున ద్వైతభావంబు జేరదేని
చిత్తమునులేదు చితసృష్టియునులేదు ॥ 33

ఘటము మృత్తికయందున గలిగినట్లు
బ్రహ్మమందున విశ్వంబు ప్రభవమయ్యె
ఘటము మృద్భిన్నముగాదేని తరణిజగము

తే॥ గీ॥ ఆదియందున నంత్యంబు నందులేక
మధ్యగలయట్టి జగమిది మిధ్యగాదె
మృణ్మయ ఘటంబు నందున మృత్తికట్లు
సత్యమగు బ్రహ్మమొక్కటే జగమునందు

తే॥ గీ॥ రజ్జుసర్పంబు నందున రజ్జువట్లు
శుక్తిరౌప్యంబునందున శుక్తిపోల్కి
విశ్వమున బ్రహ్మమొక్కటే శాశ్వతంబు
వితథమగు బ్రహ్మభిన్నమౌ విశ్వమెల్ల ॥

తే॥ గీ॥ రజ్జుసర్పంబు భ్రాంతిచే రాజిలునటు
బ్రహ్మమున దోచు విశ్వంబు భ్రాంతిచేత
భ్రమనివర్తింప రజ్జురూపంబు మాడ్కి
బ్రహ్మమే దోచు దొరగు ప్రపంచబుద్ధి ॥

తే॥ గీ॥ చూచునది చూడబడునది చూపు యనెడి
మూడునుంగూడ యీ బ్రహ్మమొకటెగాని
బ్రహ్మమునకంటె భిన్నమౌ వస్తువొండు
సత్యముగలేదు యిది శ్రుతిసమ్మతంబు ॥

తే॥ గీ॥ స్వప్నమందున స్వప్నంబు సత్యమయ్యు
మెలకువకు పిమ్మటను నది మిథ్యగాదె?
అటు లవిద్యావినిద్రన కరిలజగము
[illegible]

గీ॥ వెలుగు దోపంగ జీకటి విరిసినట్లున
విద్యచేత నవిద్య తా విరిసిపోవ
స్వప్నవస్తువు పోలిక సర్వజగము
మిథ్యగా దోచుచుండు ప్రబుద్ధునకును ॥ 40

గీ॥ స్వప్నమయుడగు జీవుండు జననమొందు
మరణమును బొందు నటులె జాగరితుడైన
జీవుడును పుట్టువునుబొందు చావునొందు
నంతియేగాని పరమార్థ మందుగాదు । 41

గీ॥ ఐంద్రజాలికవిద్యచే నైనజీవు
డెటులజన్మించి మృతినొందు నటులజీవు
డంతయును జన్మమృత్యువుల్ బొందుచుందు
రంతియేగాని పరమార్థ మందుగాదు ॥ 42

గీ॥ వాస్తవిక దృష్టి జూడనే వస్తువైన
పుట్టదెన్నండు నటువలె గిట్టదెపుడు
బంధమోక్షంబు లన్ననవి వట్టిభ్రమలు
అవి యవిద్యనశించిన యంతదొలగు ॥ 43

గీ॥ విను మనాదియయ్యైన యవిద్యచేత
నిద్రితుండైన జీవుండు నిద్రనుండి
యెపుడు మేల్కాను నాతండు నప్పుడెఱుగు

# పరమార్థ వర్ణనము

తే। గీ। స్వప్ననిద్రలులేని సుషుప్తిలేని
నిత్యపరిపూర్ణ ప్రత్యక్కు నేనటన్న
బోధమయదృష్టి గలుగు ప్రబుద్ధునకును
ద్రష్టృదర్శన దృశ్య భేదములు లేవు ॥

తే। గీ। అద్వయం బేక మమృతంబు నజమునైన
బ్రహ్మమే నేను చిత్స్వరూపంబు నేను
నిత్యనిర్దుఃఖుడను నేను నిర్మలుండ
నంచు నెఱుగంగ కేవలు డౌనతండు॥

తే। గీ। పుట్టుకయునులేదు పొలియుటయునులేదు
మోక్షకామి లేడు ముక్తిలేదు
సాధకుండులేడు సాధనయును లేదు
సత్యమిదెయె శ్రుతికి సమ్మతంబు ॥

తే। గీ। సర్వమును నాత్మగాజూచు జ్ఞానిదృష్టి
కఖిలమును మిథ్యగా దోచు నాత్మయొకటె
క్రింద మీదను సందుల గొందులందు
నిండి సర్వత్ర వెలుగొందుచుండు నెపుడు ॥

తే। గీ। చూడబడునది చూచెడి వాడనియెడి
భేదభావంబు యెవనికీ విశ్వమందు
తోచ దాతండె నిత్యని ర్దుఃఖుడతడు
మోహశోక భయంబుల బొందడెపుడు ॥

# పరమార్థదర్శనము

తే॥ గీ॥ సర్వమును బ్రహ్మమేయను జ్ఞానదృష్టి
గల్గువానికి యుత్క్రాంతి గల్గు కర్మ దతడు
క్షయము నొందంగ ప్రారబ్ధ మాత్మమాత్ర
దగుచు వెలుచు కేవలు డగుచు నిల్చు ॥ 50

తే॥ గీ॥ ఇదియె పరమార్థ దర్శనం బిదె రహస్య
మిదె యవిద్యా వినిద్రున కెఱుక పడని
బోధమయ దృష్టి దీని ప్రబుద్ధుడౌకడె
పొందనేర్చును యిదియె ప్రబుద్ధమతము ॥ 51

। గీ॥ శ్రీనివాసుండు హితమతి జెప్పెనట్టి
తత్త్వమిది యౌపనిషదంబు త్యక్త చిత్త
దోషులు పఠింప దగినది దొడ్డదైన
బుద్ధిగల మోక్షకామియే బొందు దీని ॥ 52

పరమార్థదర్శనము సమాప్తము

శ్రీరామచంద్రార్పణమస్తు

శ్రీరామ కృష్ణ సోదర శ్రీనివాస ప్రణీతము

ఓం

శ్రీరామాయనమః

# అంతర్దృష్టి
## లేక
# సత్యపథము

శ్లో॥ బాహ్యదృష్ట్యా భవేద్బంధ స్త్వంతర్దృష్ట్యా విమోచనమ్
తస్మాద్బంధవిముక్త్యర్థ మంతర్దృష్టిర్వివిచ్యతే॥

1. పరమేశ్వరుఁ డింద్రియముల బహిర్ముఖముగ సృజించి యున్నందున, పురుషుఁడు వెలికిఁజూచునుగాని లోపలనుండు పరమాత్మను చూడలేఁడు.

2. అందువలన, పరమేశ్వర సందర్శనమునకు మాః సేంద్రియాంతర్ముఖత్వ మపేక్షణీయమైయున్నది.

3. మనస్సు, స్వస్థానమునుండి బహిర్ముఖమై, సృష్టి లోని పదార్థములయం దనురక్తమై యున్నపుడు బహిర్దృష్టి యనఁబడుచున్నది.

4. ఆ మనస్సే, బాహ్యపదార్థములయం దాసక్తి సడలి, సర్వాంతరుఁడగు, పరమేశ్వరునియందనురక్తిగలిగి తదభిముఖమై యున్నపుడు, అంతర్దృష్టి యనఁబడును.

5. అంతర్దృష్టి; పరమేశ్వరుఁ డొకఁడున్నాఁడను దృః విశ్వాసముతో నుపక్రమింపఁబడి హృదయ మాతనియంద

మగ్నమగుకొలఁదియు, దృఢతరంబై చరాచరములందంత టను నాతనిఁ గనుటచే పరిపూర్ణమై 'వాఁడే నేనను, జ్ఞానముతో నుపసంహారమును బొందుచున్నది.

6. పుణ్యకర్మాచరణమునను, పాపకర్మ పరిత్యాగమునను, హృదయము పరిపక్వమై అంతర్దృష్టి కలుగుచున్నది.

7. బహిర్దృష్టి నరికట్టునట్టియు, నంతర్దృష్టికి సాధనమైనట్టియు కర్మ పుణ్యకర్మ యనఁబడును.

8. ఇంద్రియములు స్వతంత్రించి బహిర్విషయములయందు విజృంభించుటకు సహాయకారియగు కర్మ పాపకర్మ యనఁబడును.

9. మానసేంద్రియ మంతర్ముఖమై, క్రమముగా పరమేశ్వర సమీప గతమగుటమే. పుణ్యకర్మమునకు ఫలము.

10. మానసేంద్రియ మంతర్ముఖమయ్యు, కామనా సహితమై యున్నపుడు, చేయఁబడు కర్మలవలన ఇహపరములయందుగలుగు సుఖము పుణ్యకర్మయొక్క యవాంతరఫలమనఁబడును.

11. పుణ్యకర్మాచరణముచే హృదయము పరిపక్వమై, అంతర్దృష్టి యభివృద్ధి నొందుకొలఁదియు, జగన్నియామకుఁడు పరమేశ్వరుఁడేయనియు, జీవులా పరమేశ్వరునకు వ్యవహార సాధనములనియు, నెఱుఁగనగు వివేకజ్ఞాన ముదయించి కర్తృత్వ రహితబుద్ధితో వ్యవహరింపఁగల సామర్థ్యము గలుగును.

12. ఇది పుణ్యకర్మాచరణమువలనగలుగు ఉత్తమస్థితి.

13. మానసేంద్రియము బహిర్ముఖమై, పరమాత్మ విషయమునకు దూరమగుకొలదియు, మనస్సున కంతర్ముఖత్వము క్షీణించి, పురుషుఁడు బహిర్విషయములకు పరతంత్రుఁడై, భోగలాలసుఁడగుచు, మానసేంద్రియముల, భోగ్యవస్తు సంగ్రహణమునకై వినియోగించుచున్నాఁడు.

14. మానసేంద్రియ బహిర్ముఖత్వముచే అంతర్దృష్టి నశించుటవలన, పురుషుఁడు పరమేశ్వరునకు దూరుఁడై నాస్తిక మతావలంబకుఁ డగుచున్నాఁడు.

15 ఇది పాపకర్మయొక్క ఫలము.

16. మానసేంద్రియములు నియమ వర్జితములై, ఐహిక భోగములకొఱకు. స్వేచ్ఛా సంచారముగలవి యగుచుండ నిహపరములయం దనుభవించు దుఃఖము పాపకర్మయొక్క యవాంతరఫల మనఁబడును.

17. అంతర్దృష్టి క్రమముగా, నభివృద్ధిఁబొంది భవార్ణవోత్తారకమును. నిత్యనిరతిశయానందదాయకమును నగు పరమేశ్వరైక్యమును బొందించుచున్నందున రక్షింపఁదగియున్నది.

18. బహిర్దృష్టి; జననమరణ రూపఘోరసంసరణమునకు కారణమై దుఃఖప్రదమై యున్నందున విడువఁదగియున్నది

19. వేదమంతర్దృష్టి పరిపూర్ణులైనవారిచే కనిపెట్టబడిన పరమేశ్వర సిద్ధాంతము.

20. అంతర్దృష్టియు; తత్సాధనములును, అంతర్దృష్టి మభివృద్ధినొందుకాలమున క్రమానుగతములగు సిద్ధులును, ౦ంతర్దృష్టి పరిపూర్ణతయొక్క ఫలమును వేదముచే ప్రతి ాదింపఁబడుచున్నది.

21. బహిర్దృష్టియు నంతర్దృష్టియు, పరస్పర విరుద్ధ స్వభావముగలవై యున్నవి.

22. అంతర్దృష్టి తన పరిపూర్ణతకై బహిర్దృష్టి ;రికట్టుచున్నది.

23. బహిర్దృష్టి; ఇంద్రియ స్వాతంత్ర్యమునకై, ౦ంతర్దృష్టిని నిషేధించుచున్నది.

24. వేదము బహిర్దృష్టి నరికట్టుటతో నుపక్రమిం ;ఁబడి అంతర్దృష్టియొక్క పరిపూర్ణతతో నుపసంహరింపఁ ుడుచున్నది.

25. వేదము, ప్రమాణమా? అప్రమాణమా? ప్రమాణమైనచో, నంతయు, ప్రమాణమా? కొంత ప్రమా ణమా? అను యనుమానమునకు అంతర్దృష్టి పరిపాక రహిత ుగు బుద్ధియే కారణము.

26. వేదతాత్పర్య నిర్ణయమునందు పరిపూర్ణాంత ృష్టి గలవాఁడే యధికారి.

27. పుష్పమునందలి మధువును గ్రోలుటకు, ఈగ లో మధుపమునకు మాత్రమే సాధ్యమగునట్లు, వేద

తాత్పర్యమును నిర్ణయించి, ఇతరులచే ననుష్ఠింపఁజేయుట కొఱకు యంతర్దృష్టి గలవానికిమాత్రమే సాధ్యమగును.

28. మానవులలో ప్రతియొక్కనికిని పరమేశ్వరైక్యమును బ్రాపింపఁజేయు నుద్దేశముతో వేదము ప్రవర్తించుచున్నది.

29. అందువలన, మానవుల యంతర్దృష్టి నభివృద్ధి జేయఁగల సాధనక్రమము వేదమందు విశేషించి ప్రతిపాదింపఁబడియున్నది

30. మానవజాతి కంతకును, అంతర్దృష్టియందు సమానత్వము లేనందున, సాధనానుష్ఠాన క్రమమందును భేదము గాన్పించుచున్నది.

31. ఎవరి యనుష్ఠానముల వారాచరించు నపుడు మాత్రమే అంతర్దృష్టి; యుచితరీతిని వికసించి యభివృద్ధి నొందుచున్నది.

32. ఎవనియందు వేదచోదితానుష్ఠానములు, నామమాత్రావశిష్టములగుచున్నవో, వానియం దంతర్దృష్టియు, నామమాత్రావశిష్టమగు నభివృద్ధితో బీజ మాత్రావశిష్టమగుచున్నది.

33. ప్రతి పురుషునియందును, అంతర్దృష్టి బహిర్దృష్టులు సహజముగనే యుండితీరును.

34. అందొకటి అతిశయించినవానికి రెండవది యల్పమై యుండును.

35. అంతర్దృష్టి యతిశయించినవానికి, బహిర్దృష్టి యందు మానసేంద్రియ వికాస మలవడదు.

36. అటువలెనే, బహిర్దృష్టి యతిశయించినవానికి, అంతర్దృష్టియందు మానసేంద్రియము వికసింపదు.

37. అంతర్దృష్టియొక్క, అతిశయాఽనతిశయము అంతర్దృష్టి పరిపూర్ణమైనవానికి మాత్రమే గోచరించును.

38. ఒక సంవత్సరమున జరిగిన ఋతుధర్మములే ప్రతి సంవత్సరమును జరుగుచుండునట్లు, ఒక కల్పమున, జరిగిన సృష్టిధర్మములే ప్రతి కల్పమందును జరుగుచుండును.

39. ఒక సంవత్సరమున, ఒక ఋతువున జరిగిన ఋతు ధర్మములే ప్రతి సంవత్సరమును, నా ఋతువున జరుగుచుండునట్లు, ఒక కల్పమున, ఒక యుగమున జరిగిన యుగధర్మములే, ప్రతి కల్పమున నా యుగమునందు జరుగుచుండును.

40. ఏయే యుగమునకు దగినట్లాయా యుగమునందు యుగధర్మముల ననుసరించి, మానవజాతియం దంతర్దృష్టి బహిర్దృష్టులయందు మార్పుగలుగుచుండును.

41. ఈశ్వరాను శాసనముచే గలిగెడు మార్పులను నివరించుటయందు, మానవయత్నము ఫలప్రదము కానేరదు.

42 అంతర్దృష్టియభివృద్ధినొందు కాలమందు, బహిర్దృష్టి నిరోధకములును, అంతర్దృష్టి యభివృద్ధి దాయకములు

నగు, విద్యాబుద్ధులు వికసించునట్లు, బహిర్దృష్టి యభివృద్ధి నొందు కాలమందంతర్దృష్టి నిరోధకములును, బహిర్దృష్టి యభివృద్ధి దాయకములునగు విద్యాబుద్ధులు మానవజాతి యందు వికసించును.

43. అంతర్దృష్టి పరిపూర్ణమైనవాఁడు పరమేశ్వరైక్యమును బొందునట్లు, బహిర్దృష్టి పరిపూర్ణమైనవాఁడు నాస్తికమతావలంబకుఁడై, భోగలాలసుఁడగుచు సంసృతి చక్రమున భ్రమ్మరుచున్నాఁడు.

44. అంతర్దృష్టికి ప్రాధాన్యముగల యుగములందనుష్ఠానమే ప్రధానమై, అంతర్దృష్టి గలవారిచే నాదరింపఁ బడుచుండిన వేదము బహిర్దృష్టికే ప్రాధాన్యముగల యుగమునందు పాండిత్యప్రధానమై అనుష్ఠాన రహితులగు, బహిర్దృష్టి గలవారిచే పఠింపఁబడుచున్నది.

45 అంతర్దృష్టి పరిపూర్ణతకొఱకు ప్రవర్తించెడి వేదము బహిర్దృష్టి నరికట్టుటయందే ప్రాధాన్యము గలిగి యున్నందున, బహిర్దృష్టి గలవారిచే పఠింపఁబడినప్పుడు బహిర్దృష్టి నిరోధకములగు భాగములు నిషేధింపఁబడి నిర్వీర్యమగుచున్నది.

46. అంతర్దృష్టి అతిశయించు కాలమందంతర్దృష్ట్యాతిశయములేని వారియందు బహిర్దృష్టి వికసించుచుండునట్లు బహిర్దృష్టి యభివృద్ధినొందు కాలమందు బహిర్దృష్టి విజృం

భణము లేనివారియందంతర్దృష్టి ప్రకాశించు చుండుటయు గలదు.

47. బహిర్దృష్టి విజృంభించి, మానవులు వేదచోదిత నియమానుష్ఠాన రహితులై అంతర్దృష్టి బీజ మాత్రావశిష్ట మగుచుండ, మానవజాతియందు పరమేశ్వరుని అస్తిత్వము నంగీకరించు వారుండుటయే దుర్లభము.

48. అట్టియెడ నంతర్దృష్టి గలవారు తమ యంత ర్దృష్టిని రక్షించుకొనుటయే కర్తవ్యము.

49. అందువలన బహిర్దృష్టి విజృంభించెడి కాలమం దంతర్దృష్టి గలవారు బహిర్దృష్టి గలవారితో విరోధింపక తమ యంతర్దృష్టిని రక్షించు కొనుటయందే నిమగ్నులు కా వలయును.

50. ఎవ్వఁడీప్రకార మెఱుఁగునో, వాఁడు అంతర్దృష్టి నిరోధకమగు బహిర్దృష్టియందు మానసేంద్రియములకు స్వాతంత్ర్య మివ్వఁడు.

శ్లో॥ బాహ్యదృష్టేర్వినాశాయ చాంతర్దృష్టే స్సమృద్ధయే
జగధీశ మహంవందే జానకీహృదయేశ్వరం॥

అంతర్దృష్టి లేక సత్యపథము

సమాప్తము.

శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే

రచియింపఁబడినది.

ఓం తత్సత్.

# సత్యానుభూతి

## పరిశోధనపత్రము

### 3. తత్త్వదర్శనము

| పుట. | పంక్తి. | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 1 | 13 | స్యనేకథా | ప్యనేకథా |
| 2 | 1 | కరా | కర్తా |
| 5 | 2 | సేవ్యమిదంరఘుపతే స్తవం | సేవ్యంస్తోత్రంరఘుపతేరిదం |
| 8 | 5 | మార్యగీతేః | మార్యాగీతేః |
| 15 | 18 | సిద్ధయొ | సిద్ధమై |
| 24 | 1 | నిర్ణియతె | నిర్ణీయతే |
| 28 | 15 | స్వాఽత్త్వనశ్చ | స్వాద్వత్త్వనశ |
| 66 | 2 | నిర్ణయః | నిర్ణయం |
| 75 | 1 | రుక్తం | రుక్తో |
| | | క్రమం | క్రమో |
| 78 | 2 | మాలాఖ్యా | మాలాఖ్య |
| | | కథ్యతేమయా | కథయామ్యహమ్ |
| 81 | 2 | జన్మబంధం | జన్మబంధో |
| 81 | 14 | ఆపన్నా | ఆపన్నార్తి |

### 5. ప్రబుద్ధగీత

| | | | |
|---|---|---|---|
| 17 | – | ప్రబుద్ధగీత | స్థితప్రజ్ఞ ప్రకరణము |
| 18 | – | తత్త్వజ్ఞాన ప్రకరము | ప్రబుద్ధగీత |
| 22 | – | తత్త్వజ్ఞాన ప్రకరణము | ద్వంద్వాతీతస్థితి ప్రకరణ |